# గరిమెళ్ళ వ్యాసాలు



సంకలనం

బి. కృష్ణ కుమారి




తెలుగు విశ్వవిద్యాలయం

హైదరాబాదు

గరిమెళ్ళ వ్యాసాలు

సంకలనం

బి. కృష్ణ కుమారి

తెలుగు విశ్వవిద్యాలయం ప్రచురణ : 132
ప్రథమ ముద్రణ : జులై, 1992
ప్రతులు : 1000

వెల : రూ. 30/-

ప్రతులకు :
తెలుగు విశ్వవిద్యాలయం
లలితాకళాక్షేత్రం
పబ్లిక్ గార్డెన్స్, నాంపల్లి
హైదరాబాదు - 500 004

ముద్రణ :
విమల్ ప్రింటర్స్
గాంధి నగర్
హైదరాబాద్.

# భూమిక

తెలుగు భాషా సాహిత్య కళాసంస్కృతుల సర్వతోముఖవిలసనానికి, వికాసానికి, ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర శాసనసభ చేసిన చట్టం ప్రకారం 1985 డిసెంబర్ 2వ తేదిన రూపుదాల్చిన విశిష్ట విద్యా సంస్థ తెలుగు విశ్వవిద్యాలయం.

బోధన, పరిశోధన, ప్రచురణలతో పాటు విస్తరణసేవ, రాష్ట్రేతర రాంధ్రులకు, విదేశాంధ్రులకూ సహాయ సహకారాలలో కల్పన వంటి బహుముఖీన కార్యక్రమాలను కూడా ఈ విశ్వవిద్యాలయం నిర్వహిస్తున్నది.

పూర్వం ఉన్న అకాడమీలు, తెలుగు భాషా సమితి, అంతర్జాతీయ తెలుగు సంస్థ విలీనం కావడంతో విశ్వవిద్యాలయం వివిధ పీఠాలు, కేంద్రాలు, విభాగాల సమాహారంగా వ్యవహరిస్తున్నది. తెలుగు జాతి వైభవోన్నతులకు అద్దం పట్టే గ్రంథాల ప్రచురణ విశ్వవిద్యాలయ ప్రధాన ఆశయాల్లో ఒకటి.

విశ్వవిద్యాయంలో విలీనమైన అప్పటి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ అవిశ్రాంత కృషి ద్వారా దేశ సాహిత్య రంగంలో విశిష్ట స్థానం సమకూర్చుకుంది. విలక్షణమైన వందలాది గ్రంథాలను ప్రచురించింది.

విశ్వవిద్యాలయం ఈ ప్రచురణ సత్ సంప్రదాయాన్ని నేటికీ కొనసాగిస్తున్నది. గరిమెళ్ల శతజయంత్యుత్సవ ప్రారంభ సభలకి ఆయనకి నివాళిగా ఈ గ్రంథాన్ని మీ ముందుంచుతున్నది.

*"గరిమెళ్ళ వ్యాసాలు" గ్రంథం గురించి -*

ఈ వ్యాస సంకలనంలో ప్రజల పాటల గరిమెళ్ళకి మరో వైపు బలమైన వ్యాసరచయితని చూడవచ్చును.

స్వాతంత్ర్యసమరకాలంలో గళం విప్పి మహోజ్జ్వల జాతీయగీతాలు పాడగా ప్రజల నుర్రూతలూగించి ఆంగ్లేయపాలకుల గుండెల్లో సింహ స్వప్నమయ్యారు గరిమెళ్ళ. నాటి దేశభక్తి పోరాటాన్ని 'మాకొద్దీ తెల్లదొరతనం', ' సైతాను ప్రభుత్వమిక సాగనీయకండోయ్' అనే చరణాల్లో దట్టించి ఫిరంగి గుండ్ల కన్న శక్తిమంతంగా గుండెలదిరేటట్లు సంధించాడు.

పాటలు ఆపేసి భుక్తి కోసం, తన భావాల అభివ్యక్తీకరణ కోసం ఎక్కువగా రాజకీయ వ్యాసాలు రాశారు. అంతకుముందు భారతి, కృష్ణాపత్రిక ఇత్యాదుల్లో సాహిత్య వ్యాసాలు ప్రచురించారు.

గొప్ప కవీ కళాకారుడు తన కాలం నాటి స్థితిని సిద్ధాంతీకరించడానికి విపులమైన రచనలు చేయకతప్పదు. తనలోని సరికొత్త అనుభవం, సామాజిక పరిస్థితి, అవసరాల రీత్యా వివరణ ఇచ్చుకోక తప్పదు. అట్లాంటి వివరణే వ్యాసాల రూపంలో గరిమెళ్ళ ప్రచురించారు. ఈ వ్యాసాలు చాలా వరకు అంతకు ముందు తను రాసిన గేయాలలో తాను విడమరిచి చెప్పలేని అంశాలే కనిపిస్తాయి. ఐతే గేయాల్లో కనిపించేంత స్పష్టమైన తాత్వికత వ్యాసాల్లో కనిపించకపోయినా గరిమెళ్ళ ఆలోచనలు ఏమిటో, అతనే వైపో తెలిసిపోతుంది. తానున్న సమాజంలో అన్యాయం రూపుమాసి ఒకానొక సామ్యవాద వ్యవస్థ నెలకొనాలనీ, అది భారతదేశ స్థితిగతులకు అనుగుణ్యమైన దేశవాళీ సిద్ధాంతం వల్లే సాధ్యమవుతుందనేది ఆయన భావన. గరిమెళ్ళ ప్రజలను పాటల ద్వారా మేల్కొలిపారు. మేల్కొన్న తరువాత వాళ్ళు నడిచే మార్గాన్ని నిర్దేశించలేదు. నాటి దేశ రాజకీయాల దృష్ట్యానే వాళ్లని జాగృతం చేయాలన్నది అప్పటి ఆయన ఏకైక లక్ష్యం.

జాతీయోద్యమం ఎన్నో ఆటుపోట్లకి గురవుతూ విమర్శలకి లోనవుతుంటే ఆ విమర్శలలోని వాస్తవాలను పరిశీలించారు. ప్రతి సమస్యనీ, విమర్శనీ ప్రజాదృక్పథం నుండి చూశారు. తనని తానుకూడా ఆ ప్రజారాశిలో ఒకనిగా భావించారు. అంతేకాని ఆ ప్రజలకన్నా ఉన్నతునిగా ఎన్నడూ ఎక్కడా అనుకోలేదు. అందుకే అన్ని కష్టాలను, అంతదారిద్ర్యాన్ని అవలీలగా ఎదుర్కొగలిగారు. తాను త్యాగం చేస్తూ ప్రజలనూ, పరిపాలకులనీ త్యాగం చేయాలనే ఉద్బోధ చేశారు. తనలాగే ధనికులు కూడా మౌలికావసరాలు తీర్చుకొని తమ అదనపు ఆస్తిని ప్రజలకి పంచాలని ఆశించారు. ఐతే ధనస్వభావ దుర్గుణాన్ని (అంతర్జాతీయంగా కూడా) అంచనవేయడంలో మాత్రం పొరబాటు పడలేదు.

ఇక *సాహిత్య వ్యాసాల గురించి* –

శనివారపు సుబ్బారావు గారు వ్రాసిన 'పల్లెటూరి కథలు' గ్రంథ సమీక్షని కూడా వ్యాసంగా గ్రహించి సంకలన కర్త ఇందులో చేర్చారు.

'నూతన సాహిత్య విజృంభణము' (1926) వ్యాసంలో కవిత్వం గురించి రాస్తూ "వ్యర్థ పద్య ప్రచురణ మెక్కువై నోటిలో నుంచి వచ్చెడి తుంపురలు అచ్చుపడుచున్నవేయని విచారింపవలసి వచ్చినది." అని ఘాటుగానే విమర్శించారు. భావకవిత్వపు స్వర్ణోత్సవ కాలంలో అందుకు భిన్నంగా జాతీయ భావనతో సమరగీతాలురాసి ప్రచారం చేస్తూనే భావకవిత్వాన్ని పై విధంగా విమర్శించడం గరిమెళ్ళ సాహిత్య దృక్పథం తేటతెల్లం అవుతుంది.

భక్తి భావాలకి పరిమితమైన గీతకవిత్వం దేశభక్తి కోసం నడుం కట్టాలని చెప్పారు. 'సాంఘిక నవల' (పే.65) వ్యాసంలో 'శైలి కవికి నైజమై ఉండాలం'టారు. 'పల్లెటూరి కథలు' (పే.54) సమీక్షలో రచయిత అందమైన ఉన్నతవర్గం వారిని కాకుండా కింది వర్గం వారిని గురించి రాయాలని హెచ్చరిస్తారు. వాడుక భాష వల్ల జనసామాన్యభాష సాహిత్యంలోకి వస్తుందనీ అందుకు స్వాగతం పలకాలనీ అంటారు.

నాటి సాహిత్య వాతావరణంలోని లొసుగుల్ని ఎత్తి చూపుతూనే సాహిత్యం నిర్వహించాల్సిన విధిని నొక్కి చెప్పారు. రచయిత బాధ్యతని ఆయన మాటల్లోనే చూద్దాం.

కోకవరంలో ప్రోగ్రెసివ్ రైటర్ల మహాసభలో అధ్యక్షోపన్యాసం చేస్తూ (పే.86) "మనకూ, కేవలం సాహిత్య లేఖకులకూ గల వ్యత్యాసం ఏమంటే వారు పరిశుభ్రమైన సోపానకులును, కళాభిమానులును అయి వుండగా మనము కళలను ప్రజాసేవకు, విజ్ఞానమునకు, దేశ పురోభివృద్ధికి వినియోగపరుచుటకై తయారై ఉన్నాము" అంటారు.

సాహిత్యం సాహిత్యం కోసమే అని కాకుండా అది ప్రజాభివృద్ధి కోసం అని నమ్మి దాన్ని ఆచరించినవారు గరిమెళ్ళ. తాను వ్యక్తం చేసిన ఆలోచనల్లోని అభివృద్ధికరమైన అంశాల్ని ఈనాటికీ గ్రహించవలసిన పరిస్థితి ఉంది. ఆ రకంగా ఈ వ్యాసాల ఆవశ్యకతని గుర్తించక తప్పదు.

కవిగా, రచయితగా, ఒక వ్యక్తిగా గరిమెళ్ళ స్ఫురణ, ప్రేరణ ఈనాటి పరిస్థితులకి మరింత అవసరం. అందుకే ఈ వ్యాస సంకలనం.

– **జయధీర్ తిరుమలరావు**
డైరక్టర్, ప్రచురణ శాఖ
తెలుగు విశ్వ విద్యాలయం.

# ముందుమాట

గరిమెళ్ళ సత్యనారాయణ రచించిన 'మా కొద్దీ తెల్లదొరతనము' 'దండాలండోయ్ మేముండ లేమండోయ్' మొదలైన పాటల్లో 'జాతీయోద్యమ కాలంలో దేశభక్తుల్ని సృష్టించిన అపర కవిబ్రహ్మ' కన్పిస్తాడు.

గరిమెళ్ళ 1926 నుంచి 1952 ఆగస్టు వరకు కృష్ణా పత్రిక, భారతి, ప్రజామిత్ర, ఆనందవాణి, ఢంకా, కిన్నెర మొదలైన పత్రికల్లో అనేక విషయాలను గురించి రాసిన వ్యాసాలు లభించాయి. ఈ వ్యాసాల్లో ఒక విమర్శకుడు దృగ్గోచరమవుతాడు. గరిమెళ్ళ వ్యాసాలు చదివే పాఠకుడు కూడా విమర్శనా దృష్టితోనే చదవాల్సుంటుంది. లేకపోతే గరిమెళ్ళ పట్ల గుడ్డి ఆరాధనో గుడ్డి ద్వేషమో కలిగే అవకాశం వుంది.

స్థూలంగా చెప్పాలంటే గరిమెళ్ళ ఉద్యమాలు ఊపులో ఉన్నపుడు పాటలు రాశారు. ఉధృతి మందగించినపుడు వ్యాసాలు రాశారు.

'రాజకీయాలనుంచి కవిత్వ విషయాలు ఎన్నుకోవాలి'. అని చెప్పిన గరిమెళ్ళ చివరి వరకు రాజకీయాలకు చేరువలోనే వున్నారు. ఆయన వ్యాసాల్లోంచి రాజకీయాలను విడదీసి చూపటం, ఇవి రాజకీయమైనవని ఎత్తి చూపటం కష్టం. అన్ని వ్యాసాల్లో రాజకీయ స్పర్శ వుంటుంది. ఆయన రాసిన వ్యాసాలను విభజించే ప్రయత్నం చేసి, ఆ యా వ్యాసాల్లో ప్రధానంగా వున్న అంశాలను బట్టి 2 భాగాలుగా విభజించవచ్చు.

*1. సాహిత్యం. 2. రాజకీయం.*

గరిమెళ్ళ కవి, గాయకుడు, రచయిత. అందువల్ల ఆ కవి, గాయకుడి సాహిత్యాభిప్రాయాలను తెలియచేసే వ్యాసాలను మొదటి భాగంలో చేర్చడం జరిగింది.

సాహిత్య వ్యాసాలు 1926 నుంచి 1938 వరకు లభించాయి. మనం యిపుడు పేర్కొంటున్న ఆధునిక సాహిత్యాన్ని (కందుకూరి నుంచి తరువాత వచ్చిన సాహిత్యాన్ని) నూతన సాహిత్యంగా గుర్తించి, ఆ సాహిత్యాన్ని అనేక కోణాలనుంచి పరిశీలిస్తూ రచించిన 'నూతన సాహిత్య విజృంభణము'తో యీ

సంకలనం మొదలవుతుంది. తిరువళ్ళువరు రచించిన తిరుక్కురళ్ కావ్యాన్ని 'అర్థత్రయ సర్వస్వము' అనే పేరుతో 7 భాగాలుగా ప్రకటించ నిశ్చయించి మొదటి భాగానికి రాసిన ముందుమాట, సమీక్షా వ్యాసాలు మొదలైనవి పై దాని ననుసరించాయి. 'ప్రపంచ మంతా అక్షరాలూ-అంకెలే' అనేది 25-10-38 న పశ్చిమ గోదావరి జిల్లా కేశవరంలో 'ఆంధ్రదేశ ప్రోగ్రెసివు రైటర్ల మహాసభ'లో (అభ్యుదయ రచయితల సంఘం మహాసభ కాదు.) చేసిన అధ్యక్షోపన్యాసం. ప్రజల్లో అక్షరాస్యత పెరగాల్సిన ఆవశ్యకతని, దానికై రచయితలు చేయవలసిన కృషిని ఇందులో చర్చించారు.

గరిమెళ్ళ కవిగాను, రచయితగాను కూడా ప్రజల్లో రాజకీయ పరిజ్ఞానాన్ని పెంచడానికి కృషి చేశారు. దేశ రాజకీయాల గురించి, రాజకీయ పార్టీల గురించి, ఆంధ్ర రాష్ట్రం ఏర్పాటు గురించి, రాజకీయాలను ప్రభావితం చేసే ఆర్థిక పరిస్థితుల గురించి, ఆయన అభిప్రాయాలను ప్రతిబింబించే వ్యాసాలు రెండవ భాగంలో పొందుపరచబడ్డాయి.

1926లో అప్పటి శాసన సభలలో ప్రవేశించుటకై జస్టీసు పార్టీవారు, స్వరాజ్య వాదులు, సముచిత సహకార వాదులు తమ తమ నినాదాలతో, ప్రచారాలతో బయల్దేరినపుడు ఆయా విషయాలను చర్చించిన 'భ్రమ పెట్టని వారెవరు?' అనే వ్యాసంతో ఈ భాగం ప్రారంభమవుతుంది. ఈ భాగంలో ఒకటి రెండు వ్యాసాలు మినహా మిగిలినవన్నీ 1947 నుంచి 1952 వరకు వచ్చినవి. అప్పటి కాంగ్రెస్, ఆంధ్రరాష్ట్రం ఏర్పాటు, కమ్యూనిజం మొదలైన విషయాలకు సంబంధించిన వ్యాసాలు ఈ భాగంలో ఉన్నాయి. ఇందులో వ్యాసాలను పాఠకుల సౌలభ్యం కోసం తారీఖుల వారీగా కాకుండా విషయాల పరంగా ఒకచోట చేర్చటం జరిగింది.

ఏ దేశం అభివృద్ధి చెందాలన్నా, అభివృద్ధి అయ్యేట్టు కృషి చెయ్యాలన్నా, ఆ దేశ ఆర్థిక పరిస్థితులు కూడా పరిగణనలోకి తీసుకోవాలి. ఈ విషయాన్ని గరిమెళ్ళ మర్చిపోలేదు. ఆర్థికాభివృద్ధిని సాధించటానికి, ఉన్న పరిస్థితిని చక్కదిద్దుకోవటానికి ఏదేశానికైనా ప్రణాళికలు అవసరం. అమెరికా, రష్యా, బ్రిటను, ఇండియా మొదలగు వారి ప్రణాళికల గురించి చర్చించిన వ్యాసం 'ప్రణాళికలు' మొదలైన ఆర్థిక వ్యాసాలు ఇందులో ఉన్నాయి. స్వాతంత్ర్యానంతర

భారత దేశంలో ఆర్థిక పరిస్థితుల్లో వచ్చిన మార్పునే ఆర్థిక వ్యాసాలు ఎక్కువ చిత్రించాయి. స్వార్థ పరులకే పరిస్థితులెంత బాగా వుపయోగపడుతున్నాయో చెపుతూ ప్రజలు సుఖపడాలంటే నాశనం కావలసిన అధర్మం ఎంతో వుందంటూ చెప్పే 'ధర్మమేవ జయతే' అనే వ్యాసంతో యీ సంకలనం ముగుస్తుంది.

ఈ వ్యాసాల్ని పఠించేటపుడు అప్పటి రాజకీయ, సామాజిక అంశాలను కూడా దృష్టిలో పెట్టుకోవాల్సి వుంటుంది. 1907లో బిపిన్ చంద్రపాల్ ఆంధ్రలో పర్యటించి ఉపన్యాసాలిచ్చారు. ఆ సమయంలో వారు హిందూ పునరుద్ధరణ భావాల్ని కూడా ప్రచారం చేశారు. వారి ఉపన్యాసాలకు ఉత్తేజితులై రాజకీయాలవైపు మళ్ళిన వారిలో గరిమెళ్ళ ఒకరు. ఆ అభిప్రాయాలు ఆయనను చివరి వరకు వదలలేదు. అందుకే ప్రాచీన వర్ణవ్యవస్థలో ఉన్నది వర్గ వ్యవస్థే అన్న వాదాన్ని ఖండిస్తూ అది వర్గ వ్యవస్థ కాదనీ, అక్కడ దాస్యం, బానిసత్వం లేవనీ, అది ప్రభు సేవక దర్జా అనీ సమర్థిస్తారు. భారతదేశం రెండుగా చీలిందనే కోపంతో దానికి మొత్తం బాధ్యత ముస్లిం నాయకులదే అంటారు. గ్రామ సంస్కృతిని గొప్ప చెయ్యటం, నౌకరీ చెయ్యటాన్ని చిన్నచూపు చూడడం (నీచంగా చూశారనాలేమో) చేశారు. రష్యాలో వచ్చిన సోషలిస్టు ప్రభుత్వం, అది సాధించిన ప్రగతి అన్నీ బాగానే వున్నాయి గాని మన దేశాని కొచ్చేసరికి 'దేశవాళీ' కావాలి అంటారు. దేశాన్ని బాగు చెయ్యటానికి ఎవరో 'అవతార మూర్తి' దిగిరావాలంటారు.

సమకాలీన పరిస్థితులు మనుషుల్ని ఎంత బలంగా ప్రభావితం చేస్తాయో గరిమెళ్ళ రచనలు చదివితే అర్థమవుతుంది. 'రాజకీయాలనుంచి కవిత్వ విషయాలు ఎన్నుకోవాలి' అన్న గరిమెళ్ళ భావ కవిత్వం ప్రభావానికి లోనై 'వలపు-వగలు' అనే గీతం రాశారు. జానపద బాణీల్లో పాటలు రాసి ప్రజలను చైతన్య వంతుల్ని చేసిన గరిమెళ్ళ పద్యకావ్యాల ప్రభావంలో పడి 'వేగి ప్రొద్దు తలంపులు' అని దీర్ఘ మాలికలు రాశారు. పై రెండు తప్ప అట్టివి ఇక లభించ లేదు కనుక ఆ ప్రభావాలనుంచి బయట పడ్డారనే అనుకోవాలి.

హిందూ పునరుద్ధరణ భావాల ప్రభావం వున్నా, ఆర్థిక దుస్థితి జీవితాన్ని పట్టి పీడించినా ' మాకొద్దీ తెల్లదొరతనము' అని గొంతెత్తినపుడు ఏ ప్రజల పక్షపాతో చివరివరకు కూడా గరిమెళ్ళ అదే ప్రజల పక్షపాతి. తెల్లదొరతనాన్ని

ఎదిరించటానికి ఎలాగైతే వెనుకాడలేదో, అలాగే స్వతంత్ర భారత ప్రభుత్వ చర్యలను, నాయకులను విమర్శించటానికి, ప్రశ్నించటానికి భయపడలేదు. ప్రజాశ్రేయస్సుని గరిమెళ్ళ ఎంతలా కాంక్షించాడో ఏదో ఒక రూపంలో ఇందులో ఉన్న వ్యాసాల్లో కనబడుతుంది.

గరిమెళ్ళ వ్యాసాల్ని సంకలనం చేసి, ముందుమాట రాసే అవకాశాన్ని నాకిచ్చిన తెలుగు విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులు డా. సి. నారాయణరెడ్డిగారికి, తదితర అధికారులకు నా ధన్యవాదాలు.

– బి. కృష్ణకుమారి

# కృతజ్ఞతలు

గరిమెళ్ళ వ్యాసాలను సేకరించటంలో సంకలనం చేయటంలో, సహకరించి సలహాలిచ్చిన-

డైరెక్టర్ ఆఫ్ స్టేట్ ఆర్కైవ్స్, హైదరాబాద్, మద్రాసు కార్యాలయాల అధికారులకు, సుందరయ్య విజ్ఞాన కేంద్రం, హైదరాబాద్, సారస్వత నికేతనం, వేటపాలెం, గౌతమీ ప్రాంతీయ గ్రంథాలయం, రాజమండ్రి, గంగిరెడ్డి గ్రంథాలయం, అనపర్తి, ఆంధ్ర సాహిత్య పరిషత్, ప్రభుత్వ ప్రదర్శనశాల మరియు పరిశోధనా కేంద్రం, కాకినాడ, ఠాగూర్ గ్రంథాలయం, విజయవాడ, తెలుగు విశ్వవిద్యాలయం, గ్రంథాలయాల అధికారులకు,

డా॥ చల్లా రాధాకృష్ణ శర్మ, డా॥ జయధీర్ తిరుమలరావు, శ్రీ పరకాల పట్టాభిరామారావు, సజ్జా వెంకటేశ్వర్లు, చలసాని ప్రసాద్, కె.వి. రమణారెడ్డిగార్లకు

ఎపుడు వెనక్కి తిరిగినా వెన్నెల్లా నవ్వుతూ కన్పించే 'సుధ'కి,

హృదయ పూర్వక కృతజ్ఞతలు.

— బి. కృష్ణకుమారి

# విషయసూచిక

## సాహిత్యం



## రాజకీయం



## అనుబంధం

# గరిమెళ్ళ సత్యనారాయణ జీవిత విశేషాలు

| | | |
|---|---|---|
| జననం | : | 1893 |
| తల్లిదండ్రులు | : | సూరమ్మ, వెంకట నరసింహం |
| జన్మ స్థలం | : | శ్రీకాకుళం జిల్లా<br>నరసన్న పేట<br>గోనెపాడు గ్రామం |
| విద్యాభ్యాసం | : | ప్రియాగ్రహారం,<br>విజయనగరం,<br>మచిలీపట్నం. |
| వృత్తి | : | విజయనగరం ఉన్నతపాఠశాలలో ఉపాధ్యాయుడు గాను, గంజాం జిల్లా కలెక్టరు గారి కార్యాలయంలో గుమాస్తా గాను, గృహలక్ష్మి, ఆనందవాణి మొదలైన పత్రికల్లో ఉపసంపాదకుడు గాను, కొన్ని పత్రికలకు ఫ్రీలాన్స్ జర్నలిస్టు గాను పని చేశారు.<br><br>– స్వాతంత్ర్యోద్యమంలో పాటలు రాసి పాడినందుకు 9.2.1922న అరెస్టు కాబడి రెండేండ్లు కారాగార వాస శిక్ష అనుభవించారు. |
| మరణం | : | 18.12.1952 మద్రాసులో |

# నూతన సాహిత్య విజృంభణము

ఆంగ్లేయ నాగరికత, ఆంగ్ల సాహిత్యము తోడి పరిచయము, ఆంగ్ల పాఠశాలలలో ప్రవేశము మొదలైనవి యేర్పాటు కాబడినప్పటి నుండి తెలుగు సాహిత్యములో కొన్ని మార్పులుదయములైనవి. ఈ మార్పుల యొక్క సూచనలంతకు ముందరి కాలములో కూడా నుండవచ్చును. వీటిలో నా కాలము యొక్క లక్షణము లలరారుచుండ వచ్చును. ఇవియును కావలసినంత పెద్దమార్పు లింకనూ కాకపోవచ్చును. అయినను దీని నొక ప్రత్యేక యుగమని నిర్ణయించ వలసినంత భేదమున్నది కనుక దీనిని "నూతనయుగ"మని భావించుట కాటంకము లేదు. ఈ యుగమెట్లు ప్రారంభించుచున్నదియు, ఎన్నెన్ని రూపములు దాల్చినదియు, ఎట్లెట్లు పరిణామము నొందవలసినదియు మనము చూడవలసియున్నది.

ఇంతకు ముందర కాలమును కాదని యీ యుగము యొక్క ప్రత్యేక విజృంభణములు గద్య రచనమును, ఖండకావ్యములును, నాటకములును, అచ్చు ఆఫీసులు యెక్కువయై, సంస్కార ప్రచారముల కవసరము పుట్టి, అక్షరజ్ఞానమును పఠనాసక్తియు ప్రజాసామాన్యములో మునుపటి కన్న విరివియైన యీ కాలములో నవి మూడును విజృంభింప దొరకొనుట సహజము. అట్లని పూర్వపు ప్రబంధములిప్పుడు వ్రాయబడకుండక పోలేదు. పూర్వము గద్యకావ్యములు కాని ఖండ కావ్యములు కాని లేవని కాదు. ఈ యుగములో ప్రబంధ సృష్టి తగ్గినదనియు, ఖండకావ్యము లెక్కువయైనవనియు, గద్యము యొక్క ఉపయోగములు హెచ్చినవనియు మాత్రమే దీని యభిప్రాయము. ఇప్పుడు వ్రాయబడిన కొలది ప్రబంధములకును అంతకు ముందరి ప్రబంధములకును చాలా భేదము కూడ నున్నది.

ఈ యుగము తిరుపతి వేంకట కవీశ్వరుల కవిత్వములతోను, వీరేశలింగం పంతులు గారి వచనములతోను, ధర్మవరం కృష్ణమాచార్యులు గారి నాటకములతోను ప్రారంభించుచున్నదని చెప్పవచ్చును. వీరి యుద్యమముల కంతకుముందు ప్రారంభములు లేవని యర్థము కాదు. కాని యిట్టి యుద్యమములలో కీర్తి ప్రారంభకులకు కాక, ఆ రంగముల

పైపైకి వచ్చి విజృంభించిన వారికి దక్కుట సామాన్యము కనుక ఆ పట్టాభిషేకము వారికి కట్టుట యెవ్వరికిని యపచారము కాని యశ్రద్ధ కాని కానేరదు.

## శతావధాని కవులు

ముందు పద్య కవిత్వములలోని పరిణామములను పరిశీలింతము. తిరుపతి వేంకటకవీశ్వరులు గత యుగ సాంప్రదాయములలో శిక్షితులు. సంస్కృత సాహిత్య పారంగతులు, పండిత శ్రేష్ఠులు, సుధీవిరాజితులు, అసదృశ ధారావిలాసితులు. అనేకుల కంచుఢక్కలు పగులగొట్టి దిగ్విజయ మొనర్చిన వీరులు. వీరింతకు ముందరి యుగములో నుద్భవించి యుందురేని యే యొక్క రాజువొద్దనో పడియుండి, గూఢ శబ్దవితతిచే గుంభితములై యుండు ఏ కొలది పుస్తకములనో వ్రాసి, తమ యొద్దకు విద్యాసక్తి మెయి వచ్చు నే కొలది మంది శిష్యులకో పాఠములు చెప్పి, తమంతటి వారిని చేసి తమ యశశ్శరీరముల నీప్రపంచముపై నాచంద్ర తారార్కముగ వెలయునట్లు విడచిపెట్టి తమ యవతారములను చాలించి యుందురు. కాని కాలమానము మాఱిపోయినది. రాజులు చితికిపోయి పెద్ద స్థితిపరులుగా మాత్రము మారి యగ్రహారములను రాగి పట్టాల మీద శాసనములుగా వ్రాసి యిచ్చి దానము చేయగల స్థితినుండి జారిపోయినారు. ఈ లాటి స్థితిపరులను పదిమందిని చక్క బెడితే కాని యొక కవీశ్వరుని పొట్ట జరుగదు. కాక రైలుబండ్లు హెచ్చి ప్రయాణ సౌకర్యములు వెలగు చున్నవి. కనుక యొక్కని దగ్గర మాత్రమే వన్నె కెక్కుట కంటె పెక్కుర యెదుట కీర్తి గొందమను కోరిక పుట్టుట సహజము. కాక మునుపటి వలె శిష్యులు తమ వద్దకు వచ్చి శుశ్రూష చేయుచు జ్ఞానము గఱచుకొనెడి దినములు కావివి. శిష్యులలరారెడి పాఠశాలలోకి కొలువుకు వెళ్లి వాళ్లకు చదువులు వచ్చినను రాకున్నను తనపని తాను చేసుకొని నెలజీతమును అణాముద్రపై సంతకము పెట్టి పుచ్చుకోవలసిన పద్ధతులివి. పాండిత్యమునకును వివాదమునకును నిక్ష్వాకుల నాటి నుండియు చుట్టరికము. ఇరువురును పండితులయ్యు ఒకరినొకరు “త్వంశుంఠ” యంటే “త్వంశుంఠ” యనుకొనుట వారిలో మామూలై యున్నది. రాజులకు అల్పరాజుల నెల్ల బరి మార్చుటట్లు పండిత కవీశ్వరులకు “గ్రంథపుం

దెరువాట్లు " కొట్టు పామరులను పసిమసంగుట విద్యుక్తమై యున్నది. కనుక వీరు నానారాజ సందర్శనములు, గుంటూరు సీమలు, గీరతములు మొదలగునవి రచింపవలసి వచ్చును. ఇవి చాటు పద్యములవలె నొకటియును రెండును గాక పత్రికలు సంచిక లెల్లను నిండి కావ్యరూపములు దాల్చవలసి వచ్చినది. వీటికి జవాబులు ఇటువంటివి, యితరుల వివాదములు మొదలగున వెల్లను కూడ ఖండకావ్యములుగా వెలసినవి. ఈ తగాదా లెల్లయును శతావధానముల కొరకు గదా! శతావధానములలో నెవ్వరే యంశము మీద పద్యము చెప్పుమనిన దాని మీద చెప్పవలెను. ఇట్టి పద్యములలో నెల్లకయిత తళ్కులు అలరారుచున్నవి. వీటికి నిజముగా నీ సందర్భములలో కాకుండినచో పూర్ణకావ్యములలో ప్రవేశమున కనువు దొరకక కవితా సంస్పర్శన భాగ్యము దక్కెడిది కాదేమో! ఇప్పటి సభలు కేవలమును పండితుల సభలు కాక పాండిత్యము లేక ఆంగ్ల విద్యాధికులు మొదలగు వారి కూటములగుట చేత ఈ పద్యములు కొంత వరకు ఈ కాలమున కనువులై, సులభ గ్రాహ్యములై యుండక తీరినది కాదు. కాక వారు నిజముగ కవీశ్వరులు - నిజమైన కవీశ్వరులకు ఏ గ్రంథయుగములోనో పడి యుండుట కష్టము. తమ చుట్టు పట్ల నున్న యుగము, నాగరికత, విలాసములు, ఉద్యమములు మొదలైన వెల్లయును వారి విమర్శనలకు పాత్రములై కవిత్వములోనికి జొరబడును. వీరి పాణిగ్రహీత, శ్రవణానందము మొదలగు గ్రంథములు పేరునకు ప్రబంధములే యయ్యు సమకాలిక నాగరికత యొక్క పటములు. కాని యివి యన్నియు తాత్కాలికము అనియు, పుణ్యమును పురుషార్థమును సంపాదించునవి కావనియు, శాశ్వత కీర్తిని సంపాదించుటకై యేమి, జన్మ తరింపచేసుకొనుటకై యేమి, సుప్రసిద్ధ సంస్కృత గ్రంథములను భాషాంత రీకరించుటో నాటకములుగ మార్చుటయో దైవప్రశంసకంబులగు పురాణములను రచించుటయో కవి యొనర్పవలెనను ప్రాచీన విశ్వాస సాంప్రదాయము ననుసరించి, కొన్ని సంస్కృత నాటకములు భాషాంతరీకరించుటయు, పాండవ జననాది గ్రంథములను స్వతంత్రించి వ్రాయుటయు, దేవీ భాగవతమును తెలుగు సేతయు కూడ కలిగినది. వీనిలో గూడ పాండవ జననాది నాటకములలో వారు తీసుకొన్న భావ స్వాతంత్ర్యమున్ను, దేవీ భాగవతములో వారు కనపరచిన రచనా స్వాతంత్ర్య

మును వాటికి నవీనయుగ సంబంధమైన యొక విశిష్టత్వము నిచ్చు చుండుట చేత నవి నవీన నాటక రంగముల మీదను కవితాపరాయణుల విలోకనము నందును నమలులో నున్నవి. ఇతర శతావధానులును నున్నారు, పండిత కవీంద్రులును నున్నారు. కాని వారిలో నున్న ప్రాచీన నవీనపు తళ్ళుకులెల్ల వీరిలో మూర్తీభవించి యుండుట చేత వీరిని వారికి ప్రతినిధులుగా మాత్రమే తీసుకొనినాము. వీరందరిని గూర్చి కూడ యీ సూత్రముల ప్రకారము ప్రత్యేక ప్రశంసలకు పాలు సేయుచు విమర్శనలు వ్రాయవలసి యున్నది.

ఇట్టి ఖండ కావ్యములకును భావ కవిత్వములకును దగ్గర సంబంధ మున్నది. ఇట్టి సమయమున ఆంధ్రయువకులకు ఆంగ్ల కవీశ్వరులతోడి పరిచయముకలిగినది. ఆంగ్ల భాషలో మన భాషలో వలె ప్రబంధముల వంటి పెద్ద పూర్ణ పద్యకావ్యములు లేవు. కావ్యమిహమున కీర్తిని పరమున ముక్తిని నొసగు ననియు దీనిని కృతి నొందుట సప్త సంతానములలో నొకటి యనియు మన మత విశ్వాసమగుట చేత దాని యందు నిష్ఠాబద్ధమగు నొక శ్రద్ధ తీసుకొని చక్కని చిత్రకళగా చేయవలసి వచ్చినది. దానిని గూర్చి కొన్ని నిబంధములు, నిషిద్ధములు, అలంకారములు, క్రమములు మొదలగునవి యేర్పడి సంస్కృత కాలము నుండియు సాంఘికాచారముల వలె అనుసరించబడుచు వచ్చినవి. వెఱ్ఱి, మొఱ్ఱి పద్యములెన్ని వ్రాసినను చాటుధారలెన్ని కురిపించినను వారు దాని నొక ప్రశంసనీయతకు కారణముగా గైకొనలేదు. పాశ్చాత్య దేశములలో నట్లు కాక కవిత్వము మనస్సు నాహ్లాదింప చేసుకొనుట కొక చిత్ర విశేషమగుట చేత యెవరి యిష్టము వచ్చిన యంశమును వారు, యెంత వరకైతే అంత వరకు, యిష్టము వచ్చిన రీతిని రచించి లోకుల యెదుట పెట్టి వైచి ఆనందించుకొనుచుంటయే వారి యాశయము. ఇట్టి వానిలో యశః ప్రేరితములగు కావ్యములు దీర్ఘములై క్రమబద్ధములై కళాసహితములై "పేరడైజు లాస్టు" వలె నలరారుచున్నవి. తక్కినవి గాలిపటములవలె కవితాప్రపంచములో కొట్టుకొనుచున్నవి. మతనిష్ఠతోను పాండిత్య ప్రదర్శనాహంకారముతోను యశోవాంఛతోను వ్రాయబడినప్పుడు తప్ప, దీర్ఘకావ్యములు కాని, కావ్యాలంకారములు కాని బయలుదేరవు. ఆంగ్ల సాహిత్య చరిత్రములో నట్టి సంచలనములచే ప్రేరితమైన

కాలమత్యల్పము. రిన్సైజాన్సుకు ముందు ఫ్రెంచి యిఙ్గ్లీషే కాని ఆధునిక యిఙ్గ్లీషే లేదు. అక్కడితో పండిత యుగము ప్రారంభమగును, కాని పాండిత్య పరిశ్రమ యుగ భాగ్యమును ఆ దేశమెంతో కాలమనుభవించలేదు. దాని యడుగుల జాడలనే వెంబడించుకొని యీ నవీన వార్తా పత్రికా యుగము వచ్చినది. ఆ యుగము నిలచిన యీషత్కాలములో మిల్టను విజృంభించెను. అంతతో సరి. తరువాతను గబ గబ గ్రంథములు వ్రాయడము, వేగము వేగము అచ్చాఫీసు కివ్వడము, తడి తడి ప్రూఫులను దిద్దడము, షిల్లింగు పెట్టి వీధి పోయే వాళ్ళు కొనుక్కొని చదువుకొని బాగున్నాదనో ఓగున్నాదనో విమర్శించడము, యిట్టి నవీన యుగము, ప్రారంభించినది. లండను నిండా సంచికలు వెలసినవి. ఎవరి యిష్టము వచ్చినట్లు వారు వ్రాయదొడగిరి. జాన్సను, పోపు మొదలైన పండిత శ్రేష్ఠులిది నచ్చక దూషించుచు భూషించుచు సాహిత్య సామ్రాజ్య చక్రవర్తులై యేలుచుండుటలు, వెంటనే క్రొత్త క్రొత్తసూత్రములు లేచుటలు, ఒకరి మీద ఒకరు తిరుగుబడుటలు, ఈ గందరగోళము లోనికి దిగినది. తిరుపతి కవీశ్వరుల నాటికే మనదేశములో వ్యర్థ పద్య ప్రచురణ మెక్కువయై నోటిలో నుంచి వచ్చెడి తుంపురులు కూడ అచ్చుపడుచున్నవేయని విచారింప వలసి వచ్చినది. అట్టిచో లండను నగరములో నిట్టి పత్రికలలో నెన్ని పద్యములు వ్రాయబడు చుండెడివో యెవ్వరి కెరుక? ఇట్టి కట్టతుట్టలలో నెట్టి యభాగ్యుడు వ్రాసిన వైనను కొన్ని మంచివి బాగుగా నుండుటయు, కొందరు మంచి కవీశ్వరులు కూడ చిన్న చిన్న పద్యములే కాని పెద్దవి వ్రాయలేకుండటయు సహజము. విద్యాధికులకు పెద్ద కావ్యములను వ్రాసి మిల్టను వలె కీర్తి పొందుదమని అప్పుడప్పుడు కోరిక వొడము చుండెడిది. కాని వాటితో తులతూగ లేక విరమించు కొనువారు కొందరును, కొందరు పెద్ద కావ్యములు వ్రాసినను అవి అతికిన చితుకుల వలె నుండుటయే కాని గంభీర కావ్యమునకు 'గల యేకత్వ మందులో లేకుండుటయు తటస్థించెను, ఇట్లు తాత్కాలికముగా వ్రాసెడి చిన్ని చిన్ని పద్యములు కాక, తీరుబాటు సమయములలో ఆలోచించి కవితావేశములో వ్రాసెడి దీర్ఘ పద్యములు కూడా ప్రత్యేకమైన గ్రంథము కావలసినంత పెద్దవి కాక Major Poems అని మాత్రము పిలువబడుచుండెను. Minor poems ను ఖండ కావ్యము లన్నచో Major poems ను అఖండ

కావ్యములనవచ్చును. కాని అవి నిజముగా అలంకార శాస్త్రక్రమము దేనికైన బద్ధములైన కావ్యములు కావని మన మనవలెను. "రసాత్మకం కావ్య" మని అందులో రసము తళుకులున్నంత మాత్రముననే అవి కావ్యములగుచున్నవని భావించి మనము ఖండకావ్యములను గత్యంతరము లేని నామకరణము చేసుకొన్నాము కాని రఘువంశము వలె గాని మనుచరిత్రము వలెఁ గాని అవి కావ్యములు కాదని యెరుంగునది.

## భావకవిత్వ ప్రారంభము

ఆంగ్లభాష నభ్యసించు విద్యార్థులు క్లాసులలో పఠించి సారమును గ్రహించి ప్రశంసింప నేర్చుకొన్న వివియే కనుక యిట్టి పద్యములు మన భాషలో లేకుండుటచే వానిని జొప్పింతమను కుతూహలము చెలరేగెను, కాక వీరికి సంస్కృత భాషా కావ్యముల పరిచయము కాని తెలుగు కావ్యముల నైనను ఆంగ్ల కావ్యము లంత శ్రద్ధగా పఠించెడి తీరుబాటు కాని తక్కువయయ్యెను. కాక అట్టి ప్రబంధములును కావ్యములును యెక్కువగా నుండుటచేతను, చాదస్తపు పండితులెల్లరును నింకా అదే మతలపుల మీద పదములు మార్చి, చెప్పిన భావములు చెప్పుచు పదవిడంబనమే కాని కవితా మాధుర్యమును చూపజాలకుండుట చేతను, అట్టి కావ్యముల కంటె ఇట్టి "కావ్యములు" రచించుటయే వీరికి సులభముగా నుండుటయే కాక దేశహితమనియు, భాష కొక క్రొత్త పోకడయనియు, ఆంధ్రరాణి కొక నవ్యాలంకార మనియు తోచినది. వార్తాపత్రికలును, మాసపంచికలును వెలయు చుండెడి యుగములో వాటికి దూరమైన కాలుడవులలో గూర్చున్న వారికి తప్ప పూర్వకాలపు దీర్ఘ కావ్యముల వంటి కావ్యములు వ్రాయుటకు వీలు లేదు. ఇదియును కాక కావ్యరచన ముక్తిప్రదమను భావము పోయినది. సప్తసంతానములలో నొకటని యెంచి కృతి నంది కవితిలకములను పోషించు రారాజులును అస్తమించిరి. ఇప్పటికవిత్వము యొక్క ఆశయ మెల్లను వాలుకుర్చీలో కూర్చుని వార్తాపత్రికా పుటముల నించుక తీరుబడి చూచుకొని తిరుగవేయుచుండు పాఠకుని తృప్తిపరచుటయు, తొందర తొందరగను తప్పకుండను మాసపంచికలకు "Matter" నిచ్చుటయును నైయున్నది. ఇప్పటి "భావకవీశ్వరు" లలో కొందరు, తమకు మంచి సమయములలో

దృశ్యమగు చిత్రములనప్పుడప్పుడు వ్రాసుకొని దఫదఫాగా పత్రికలకు పంపుచున్నారు. కొందరు పత్రికలకు పంపవలెననియే యేదైన అంశమును కల్పించుకొని వ్రాయుచున్నారు. పత్రికలును పెక్కులు వెలయుచున్నవి. కనుక పద్యముల యొక్క గుణాగుణముల ప్రశంసకుపోక చరణములైనంత మాత్రముననే వానిని తమ పత్రికలలో నిర్ణయించబడిన (Column) కాలములో నదికి ప్రచురించుచున్నవి. కవి పేరులు కూడ ప్రచురించుచుండుటచేత నామ ప్రచురణాభిలాష గల అనేకులు యువకులు కూడ ప్రతివారమూ పత్రికలకు పద్యములను పంపుచున్నారు. ప్రతి పత్రికాలయమునందును వారు కూడ ప్రచురింపజాలనన్ని ఖండకావ్యములు పెరుగుచు ప్రచురణమయేవి కాగా మిగిలినవి నెలకొకసారి పరశురామప్రీతి యగుచున్నవి. ఇట్లు మనదేశములో ఖండకావ్యముల యుగము ప్రారంభమైనది. ఇది యంతయు దేశానర్థక మనియు భాషానాశకమనియు, అపాండిత్య జన్య మనియు, అల్పజ్ఞతా సూచకమనియు భావించి సంస్కృత పాండిత్యము కావ్య ప్రబంధ పరిశ్రమమును, నుభయ భాషా ప్రభుత్వమును, విజృంభణమును, భాషాశుద్ధియును గల వారు తొంటి పద్ధతిపైని భ్రమను విడిచిపెట్టుకొనలేక, అట్టి దైవ సంబంధములును భక్తి సంబంధములును నగు కృతులు సేయుటయే వంశపావనమనియు, భవతారకమనియు భావించి - ప్రబంధముల జాబితా కింకొక గ్రంథమును ఆ మతలపు పద్యములకు మరి కొంత సంఖ్యయును చేర్చుచున్నారు.

ఇట్లు మన నేటి ఆంధ్ర కవిత్వమును ప్రబంధ కవిత యొక వైపు నుంచి జూచుచు, యీ చెల్లా చెదరేమిటి! యీ అవక తవక యేమిటి, ఈ నీరసమేమిటి! యీ భావమేమిటి! యీ అగాధమేమిటి! యీ అజ్ఞానమేమిటి! అని విచారించుచు హేళన సేయుచున్నది. ఒక వైపు నుంచి పత్రికలు, సంచికలు, నామప్రచురణ వాంఛలు, నవీనతాభిలాషలు, క్రొత్త క్రొత్త దృశ్యములు, యెఱలు, భ్రమలు, ఆశలు, నిరాశలు మొదలగు నవి పెనగి తమ వైపునకు లాగుకొనుచున్నవి. అయితే ప్రబంధ హేళనల నిది లెక్కసేయక, స్వాతంత్ర్యమును స్వవికాసమునే తన సంకల్పమైనట్లును బంధనములు, ముళ్లు మొదలగు వానిలో నదియే నొవ్వ చెడుచున్నదనియు యెదురు హేళనలు సలుపుచున్నది. లాభమే కానిండు నష్టమే కానిండు తొంటి

ప్రబంధ కవిత్వమిప్పటి కవిత్వ రచనారంగము నుండి సెలవు పుచ్చుకొని పోకతీరదు. అది యెంత సేపటికిని ఒకటే పిండి వంటయై మొగము మొత్తి విసిగించినది. స్వతంత్రమున కందులో అవకాశము తక్కువగుట చేత అది పూర్వపు ప్రబంధముల తాలూకు మరియొక ప్రతి యగునే కాని వేఱొకటి కాజాలదు. కాక పూర్వపు దేవుళ్ళందరికిని దేవలోక పురుషులందరికిని మన పూర్వులే పెండ్లిండ్లు చేసి, వారి శృంగారములను వర్ణించినారు, ఇప్పుడు మన మెవరినైన వెదకి తీసుకుని రావలెనననంత సులభము కాదు. ఇక మనము ప్రబంధములు వ్రాయక ప్రబంధముల సరళిలోనే క్రొత్త కథలు వ్రాయవలెనన్న ప్రబంధములలోని వర్ణనలు అలంకారముల వంటి వానిని మనము తీసివేయుచున్నప్పుడు ప్రబంధములు కాని పద్యములు కాని యేల వ్రాయవలెను. గద్యము చాలదా! యతి ప్రాస వృత్తములలో మేమీ భావముల నిముడ్చగల మని గొప్ప చూపుటకా! చూడ చూడ నీకాలములో భావములలో మెరసెడి తళుకులు, స్వగతములగు దీర్ఘమగు తత్వ లేక ఆధ్యాత్మిక చింతనలు, ప్రకృతి పరవశత్వములు మొదలగు వానికి తప్ప కథలకు కవిత్వమునందు తావు లేదు. అయినను ప్రబంధ కవిత్వము నిప్పటికైనను మేము నిరసింపబూనము. ప్రాత వర్ణనలు కల్పనలు దొంగిలించి, వేరొక రీతి పదములతో తిరిగీ యొప్ప చెప్పకుండా, వీలయినన్ని స్వాతంత్ర్యములు తీసుకొని తమ కవి యనుభవములను కథా భాగములలో జొప్పించి వ్రాయగల వారికి మాయబభినందనము లీనున్నాము. అంతవరకున్ను మన తెనుగు కవిత్వమునకు ఖండ కావ్యములును భావకవిత్వములును కాక గత్యంతరము లేదు. అయినను భావకవిత్వరంగమిప్పుడు చాలా అరాచకముగా నున్నది. దానికొక సిద్ధాంత మంటూ లేదు. అర్థము తెలియ నీయకపోవుట, అలంకార మంతంతలోనే మార్చుట, భావమును ప్రస్ఫుటము చేయకుండుట, స్వాంతమునందు నిమగ్నము చేసి సంగీతపు కళలు విసరి విసరిపాడుచు ఆనందించుట యివి యెల్లియు భావకవిత్వ లక్షణములుగా పెక్కురు భావించి, కోరి యట్లు వాని నొనరించుచున్నారు. నిజముగా భావమున కెట్టి నిబంధనలు లేవో భావకవిత్వమునకుఁ గాని ఖండ కావ్యములకు గాని వ్రాసి పెట్టి నిర్ణయించగల నిబంధనలు లేవనియు, ఉండజాలవనియు మేమును నొప్పుకొందుము. కాని సహజత్వమును కూడ, ఒక యుండకూడని లక్షణ

ముగా చేసుకొనుట భావకవిత్వపు లక్షణమని మేము తలంచము. మానవ స్వభావములకు, ఊహాగమనములకు, యుక్తజ్ఞానములకు, కవితా సంచారములకు చిట్టి చిట్టి భేదములు కొన్ని యున్నను వ్రాసి పెట్టి నిర్ణయింపఁజాలనట్టియు, విశాల విమర్శక దృష్టి కలవారికి తమంతట తామే గోచరించునట్టియు కొన్ని జాడలున్నవి.వాటిని కూడఁ జూడ లేక కాని, లక్ష్యపెట్టక కాని కలమునకు వచ్చినట్లుగను, అల్పజ్ఞత్వమునకు తోచినట్లుగను, అహంకారములకు సరిపడు నట్లుగను స్వాతంత్ర్యమను పేరిట స్వైర విహారము నొనర్చుచుండు అనేకము కుప్పకుప్పలు ఖండకావ్యము లెల్లను అనతి కాలములో మఱువబడును. మన ఆధునిక భావ కవిత్వములలో అట్టి విశాల సూత్రముల కొప్పు నట్టివియు పెక్కులున్నవి. ఒప్పనట్టివియు అంతకన్న పెక్కులున్నవి. ఈ కవుల పద్యములను ప్రత్యేకము ప్రత్యేకముగా పట్టుకొని, నిస్వార్థ దృష్టితో పరిశీలించి యీ విభేదము నీయగల భారము విమర్శక శిఖామణులపై నున్నది. ప్రస్తుత సందర్భములలో భావకవిత్వరచనము కంటె కూడ యీ విమర్శక కార్యము తొందరగాపూనవలసిన ఆవశ్యకత లేకపోలేదు. విమర్శకు లించుక నిష్పక్షపాతముగ నీ పనికి బూనుకొనిన యెడలను, కవులించుక నిగ్రహముతోను, తమ రచనలను దీర్ఘకాల జీవముండవలెననెడి ఆశతో వ్రాసిన యెడలను నీ పని చక్క పడక మానదు.

## గీత కవిత్వము

భావ కవిత్వములో కంటె గూడ గీత కవిత్వ మీ యుగములో పొందిన యభివృద్ధి యెక్కువ ప్రశంసనీయముగా నున్నదని దేశమెల్లను నంగీకరించుచున్నది. ఈ రంగములో నాచార్యపీఠము నారయణదాసు గారి కిచ్చుటలో వెనుకకు గొంకెడు వారెవ్వరును లేరు. సహజముగనే గీత కవిత్వము పద్యకవిత్వము కంటె నెక్కువ హృదయరంజకముగను రమణీయముగను నుండును. దానికి చక్కని కట్టుబాటులున్నవి. దానిలో నుంచి తప్పుకొందమన్నను సాధ్యము కాదు. లయనుంచి అది తప్పుకొనలేదు కదా! సంగీతమందులో నిమిడియే యున్నది గదా! ప్రాసములను, నంత్యప్రాసములను వాటంతట నవియే పడును కదా! ఎంత తాపీగాపాడి యెంత గాన శక్తి చూపించి యెన్ని యొడుపులు, కళలు వేసినను నది

వద్దనదు గదా! పదములకందని దూరసీమలకు గూడ అది సులభముగ పోగలదు గదా! పండిత పామర జనబోధకమును రంజకమును గదా! అందుచేత మన దేశములో నేమి పరదేశములలో నేమి పద్యకవిత్వము కంటె నది యెక్కువ ప్రచారము నందును అమలు నందును నుండుటలో ఆశ్చర్యమేమి! ఇంతకు పూర్వ యుగములలో నది భక్తి రంగము నందును, శృంగారము నందును మాత్రమే ప్రభాసిల్లు చుండెను. ఈ యుగములలో నది సామాన్యములగు నంశములను, దేశభక్తి ప్రబోధములను నాటకములలోని పాత్రల సంభాషణములను మొదలగు వానిని గూడ గుత్త గొని జాతీయ జీవనము నుత్తేజితము నొనర్చుచున్నది. సహజమృదుల మాధుర్యమై సంగీతపు కట్టుబాటులకు సాహచర్యము సలుపు కర్ణాటకపు కత్తునకు సాయముగా అనుభవైక రమ్యములగు హిందూస్తానీ కత్తు తళుకులు, ఆంగ్ల సీమలనుండి పరతెంచిన బ్యాండు నొక్కుల నినాదములు మొదలగునవి, యెల్ల కూడుకొని ఆంధ్ర దేశపు గీతారంగము నెల్ల అవి ఆనందపులకితములు చేయుచున్నవి. నారాయణదాసుగారు గాయక శిఖామణులును, లయబ్రహ్మలును, కవి తిలకములును, పండిత శ్రేష్ఠులును, స్వాతంత్ర్య గ్రహణను నందు ఆదర్శకముగా నుండు నంత యోగ్యత సంపాదించిన వారునునై తమ హరికథలలో నెల్ల పెక్కు సందర్భములు చొప్పించి చక్కని గీతములు పాడివి మన భాషకును ఆధునిక పద కవిత్వమునకును అనుపమానమైన సేవ నొనర్చిన వారు. జానపదుల అకాల్పనిక సంగీతపు పోకడలు గూడ మన యువక కవులకు నచ్చి, వారి నుత్తేజింపఁ జేయవలసిన అవసరము కూడ వచ్చుట చేత ఆ మెట్టులలోనే ఉత్తమ భావములు, ఉత్తమ భాషను జొప్పించి, వాటిలో ననుశ్రుతములుగ వచ్చుచున్న జీవ భాషను భాషారూపములను విచ్ఛిన్నము చేయకుండ సంగ్రహించి గ్రుచ్చి పద కవిత్వమును (Ballad poetry) గూడ మునుపెన్నటి కన్న ఒక ఉన్నత స్థానమునకు తెచ్చి క్రొత్త క్రొత్త పనులను దాని చేత చేయించుచున్నారు. మహాత్ముని రాజకీయాందోళన దీని కొక నూతన ధర్మమును, నూతన రంగమును, నూతన భాషను, నూతన కవిబృందమును ప్రసాదించెననుట కాటంకము లేదు. ఇందులో నిప్పటకే తదితర రంగములలో కంటె నెక్కువ పని జరిగినది. ఇంకను జరుగవలసి యున్నది. మన పూర్వపు ఫక్కీలు, మెట్టులు, క్రొత్త పద్ధతుల యడుగున

బడి అదృశ్యములగుచున్నవి. హిందూస్తానీ తళుకులును, బ్యాండు స్వరములును యానాదుల వీధి భాగవతములను గూడ ఆక్రమించుచున్నవి. కూచిపూడి భాగవతులు మొదలగు వారి శిష్యులు కూడ నాటకపు కత్తులలోనికి దిగుచున్నారు. ఇంకను గ్రామములలోనికి పోయి అక్కడి పూర్వపు బాణ్యడుపద్ధతులను భాగవత పద్ధతులను నేర్చుకొని, సంగ్రహించవలసిన యావశ్యకత యున్నది. వాటిని మనము విసర్జింపజాలము. అరవదేశీయులు కర్ణాటకపు కత్తులలో నారితేరి త్యాగయ్య గారి కృతులను చక్కగా పాడగల్గుచునే, హిందుస్తానీ కత్తులో కూడా మనోహరములగు గీతములను రచించుచునే, ఇంగ్లీషు బేండు నోటుల యెడ వ్యామోహితులగుచునే వారి కావడిచిందు, నొంది చిందు తేవారము, తెమాంగు, తిరుప్పుగళు, లావణి మొదలగు మెట్టుల నశ్రద్ధ చేయకుండ పాడగల్గుచు కీర్తిని సంపాదించుకొనుచున్నారు. మనవారో ఆధ్యాత్మ రామాయణము కీర్తనలు, అష్టపదులు, క్షేత్రయపదములు, తరంగములు మొదలగునవి పాడుట మఱచిపోయి ఆ పుస్తకములను మాత్రము బీరువాలలో పెట్టుకొనుచున్నారు. భాగవతము దరువులుకాని, బొమ్మలాట కలాపములు గాని, యక్ష గానములు కాని మునపటి ఫక్కిని పాడలేరు సరేగదా వాటిని హేళనము సేయుట గొప్ప యనుకొనుచున్నారు. కొన్ని సంవత్సరముల క్రిందట మనదేశపు పడవవాండ్రు, ఊడుపుల వాండ్రు, దంపుల వాండ్రు, జోతలవాండ్రు, చెంచువాండ్రు నేవేవో గాథలు నెంతయో వింతయగు మెట్టులో అపురూపమగు భావములతోను ఆచారములతోను పాడుచుండెడివారు. ఇప్పుడు వారి నందరిని "అప్పనాబనాతనా" ఆవేశించినది. సంగీతము, పదకవిత్వము, జానపదుల లౌకిక గానమాధుర్యము నందభిలాష మొదలగు గుణములు గల వారీ మొదలైన వాని నెల్ల సంగ్రహించవలెను. గీత గోవిందము మొదలగు వానిని పాడగల కొందరి దగ్గరకు తక్కిన వారు పోయి వాటి గమనికలు వారితో నశింపకుండునట్లు చిరస్థములు చేయవలెను. ఇక కర్ణాటకపు కత్తును, హిందూస్తానీ కత్తును, బ్యాండు కత్తును, నశించక వాటంతట అవియే వృద్ధి పొందగల పరిస్థితులు దేశములో పాదుకొనుచునే యున్నవి.

# మిశ్ర కావ్యములు

ఇక మిశ్ర కావ్యములను గూర్చి యాలోచించ వలసి యున్నది. హరికథలు, భాగవతములు, బొమ్మలాటలు, మొదలగునవి పద్య గద్య గీత మిశ్రితము లనుట కాటంకము లేదు. అవి అట్లే యుండవలె ననుటలో కూడ నందరును నేకగ్రీవముగా నొప్పుకొనుచున్నారు. హరికథలలో మనమెల్ల కత్తులను జొప్పించినను, బొమ్మలాటలు, భాగవతములలో మాత్రము పూర్వపు కత్తుల నింకను నుంచి వాటి విశిష్టత్వమును నిలబెట్ట వలసిన యావశ్యకత యున్నదనియే మా విశ్వాసము. మునుపటి కలాపములను రామ బాణముల నోటిలో నుండి తప్పించి యిప్పటి యాటగాంధ్ర గాత్రములలో నుంచవలెను. అవసరమైనచో యీ దేశ కాల పరిస్థితులకు సరిపోవునట్లు కథా క్రమములు మార్చుచుండవలెను. వాటిలో పూర్వము నుండి వచ్చెడి నాగరికములగు హాస్యములను తగ్గించి సత్సదస్యులును కులాంగనలును వినుటకు యోగ్యమైనంత సరసములు చేయవలెను. వాటిలోని హాస్యములు ప్రస్తుత పద్ధతులను విమర్శించు చుండవలెను. నాటక ప్రదర్శనములను గూర్చి ఎంత పరిశ్రమము తీసుకొనుచున్నామో అంతకు మరింత పరిశ్రమము దీనిని గూర్చి మనము తీసుకొనవలెను. వీటికి కాలానుగుణ్యముగ నొక యాకారము వచ్చి యనాగరికజన హృదయరంజకములుగా చేసి విడిచిపెట్టినచో, మన పూచీ లేకుండా వాటంతట నవియే సమస్త శుభకార్యములయందును దేవతోత్సవముల యందును ప్రాకిపోగలవు. ఇవి నాటకముల కంటెను, భావకవిత్వముల కంటెను బలతరములై ప్రజలకెక్కువ బాగుగ నచ్చి, దేశమున కెక్కువ సేయుననుట కభ్యంతరము లేదు. పూర్వ మివియే భారతవిజ్ఞానమును సంప్రదాయములను, ఆచారములను, వీర పరాక్రమములను, దేశ మతాభి మానములను, దైవభక్తిని, రాజనీతివిజ్ఞానములను, వేదాంతరహస్యములను దేశమునందెల్ల వెదజల్లు చుండెడి ఖర్చులేని విశ్వ విద్యాలయములు (యూనివర్సిటీలు) అయి యుండెడివి. ఇట్టి జ్ఞాన ప్రచారకములైన సాధనములను విరగద్రోయుచు విద్యాభివృద్ధియు దేశాభివృద్ధియు చేసుకొనుచున్నామని సొమ్ము దండుగ పెట్టికొనుచు యౌవనము వమ్ము చేసుకొనుచు, స్వాతంత్ర్యము చౌక చేసుకొనుచు, దాస్యమే పరమావధిగాను, గౌరవముగను భావించుటకంటె అవివేకము వేఱొకటి లేదు.

## ఈ కవిత్వములలో వాడుక భాషకు గల స్థానము

ఇక వీటిలో ప్రయోగించెడి భాషను గూర్చి యించుక చెప్పవలసి యున్నది. ఒక్క పద్యకవిత్వము నందును భావకవిత్వము నందును తప్ప నన్నయ్యచిన్నయ్యసూరిగార్ల వ్యాకరణముల నిబంధనలకు లొంగియుండ వలసిన యావశ్యకము మరి దేనికిని లేదు. వ్యావహారిక గ్రాంథిక భాషా మిశ్రమము వాటిలో ననుశ్రుతముగా వచ్చుచున్నది. దాని ననుసరించియే యవి యెల్లయును పోవచ్చును. భాష యొక్క గాంభీర్యము చెడకుండ గూఢ భావములు కూడ వహించగలుగునంత ఔన్నత్యమును, అవి సులువుగా గ్రహింపగలుగుటకు తగినంత వాడుక సిద్ధియును వాటికున్నచో చాలును. పాత్రౌచితిని బట్టి వీటిలో నెచ్చు తగ్గులుండవచ్చును. కేవలం గ్రాంథికత్వమున కాశించి కష్టముగను అసహజముగను చేయకూడదని కేవలం సులభత్వమున కపేక్షించి హేయముగను వికారముగను చేయకున్నచో చాలును. మన ఆంధ్ర దేశములో జిల్లా కొక్కొక్క (district) పరిభాష యున్నదనియు, ఒకరి భావము లొకరికి తెలియవనియు వాదించెడి భావమునకు మే మొప్పుకొనము. ఒక జిల్లా కింకొక జిల్లాతో పరిచయము తక్కువగా నున్నదనియు, అందుచేత నొకరి వాడుక భాష యింకొకరి వాడుక భాష నుండి కొంచెము భిన్నముగ నున్నదనియు మే మొప్పుకొందుము కాని, ఆభేద మొకరి ధోరణి యింకొకరికి తెలియనంతటిది కాదు. పరస్పర సంచారముల వలన అవి అవగ్రహణములు కాగలవు. పదును కాగలవు. వాటిలో ననేకములు గ్రంథస్థములుగా జేసి గౌరవము నిచ్చుటకు తగి యున్నవి. ఈ పనిని మన మిప్పుడు మానివేసినచో వాడుక భాషా భేదములే మరియును పెద్దవై, ఒకరి భాష యొకరికి తెలియక, ఒకరితో ఒకరు గ్రాంథికముగా ననగా నన్నయభట్టు వలెనో, పెద్దన్న వలెనో తప్ప మాటలాడుకొనుటకు వీలు లేక, అంత పాండిత్యము లేని వారు వేర్వేరు జాతులై, బొంబాయి తెలుగులు, ఆంధ్ర తెలుగులు, తంజావూరు తెలుగులు, తెలుగు తెలుగులనని వేర్వేరులై క్రమముగా తెలుగు రూపుమాసి అచ్చటచ్చటికి సమీపములలో నున్న బలవద్భాషలలో మిశ్రమమై పోయి అచ్చటచ్చటి వారా యా భాషలను మాటలాడుకొనక తీరదు. ఇట్టి గతియే బొంబాయి లోని తెలుగు వారికిని అరవదేశము తెలుగు వారికిని పట్టినది. నెల్లూరు,

బళ్ళారి, కర్నూలు, చిత్తూరు, మొదలగు జిల్లాల వారికిని క్రమముగా గుంటూరు వారికిని గూడ అట్టి గతులే పట్టవలసి వచ్చును. గనుక ఆయా జిల్లాలలో ప్రజల ప్రచారములో నున్న వాడుక భాషను, వాడుక భాషా రూపములను గ్రంథస్థములు చేయుట వలన వచ్చెడి నష్టము లేదు సరిగదా, లాభమధికముగా నున్నది. శబ్దజాల మెక్కువయియినను, ఇరుగు పొరుగు వారల లక్షణములు, మాటలు తెలియును. ఇందుకు హరికథలు, భాగవతములు, యక్షగానములు, బొమ్మలాటలు, పాటల కంటె నెక్కువ ఉచితమైన సాధనములు స్థలములును వేరెవ్వి? ఇదియును గాక వీటి కనుశ్రుతముగా వచ్చుచున్న సంప్రదాయమును మాని వీని నన్నింటిని గూడా భారత భాగవతాదుల ప్రక్కలో గూర్చుండ బెట్టవలె ననుటలో అర్థము లేదు. ఇక ఆథునిక కవిత్వమును భావగీతములలోనే, అవి యెల్లయును ప్రయోగించుకొనుటయా మానుకొనుటయా అనునది కవి గారి యిష్టము. ఆయన మాత్రౌ)ముచితజ్ఞుడు కాడా! మన పూర్వులు ప్రబంధకవిత్వములో గూడ నట్టి స్వాతంత్ర్యమును క్వచిత్తు క్వచిత్తుగా తీసుకొనుచుండిరి. ఇప్పుడు మనవారు కూడా తీసుకొనుచున్నారు. అట్లు తీసుకొనుటలో తప్పేమియు లేదు. అసలులో ఈ గ్రాంథిక వ్యావహారిక భాషా వివాదము గద్యరచనకు మాత్రమే సంబంధించినది. హరికథాదుల కిది కొత్త కాదు. అందులో రెండును కలియుచునే యున్నవి. పద్య కవిత్వము దీనిని విస్తారమంగీకరించి యుండలేదు. క్వచిత్తుగా అప్పుడును ఇప్పుడును కూడ నంగీకరించు చున్నారు. గద్యమునే యిట్లా? అట్లా? వ్రాయుట యని వివాదము లేచినది. అయినను ఈ వివాదము యొక్క తరంగములు పద్య కవిత్వము మీదికి కూడ ప్రాకి యీ వాడుక పదములందులోని కెక్కువగా వచ్చుచున్నవి. దీనికి గారణ మీ వాదము యొక్క మూలపురుషులలో నొకరగు గురజాడ అప్పారావు గారు కవి కూడనై తన ముత్యాల సరముల నిట్టి పదములతో గ్రుచ్చుటయే. ఇది క్రమముగా ముత్యాల సరములలో నుంచి యితరములలోనికి గూడ ప్రాకజూచుచున్నది. కాని తక్కిన వృత్తముల లోనికి గాని పద్యములలోనికి గాని యింత జోరుగా ప్రాకుటకు వీలు లేదు. ముత్యాల సరములను పద్యము లనుటకంటె పాట అనవలెను. ఇట్టి ఛందస్సులే తెలుగు ఛందస్సులనియు, కందము, ఉత్పలమాల మొదలగునవి అసలు తెలుగు ఛందస్సులు కావనియు, వాటిని గైకొన రాదనుటయు

విపరీతము. అసలు ఆంధ్రభాషయే మిశ్రభాష. కొన్ని సంస్కృత సంప్రదాయములను, కొన్ని ద్రవిడ సంప్రదాయములను గూడి అది యేర్పడినది. అసలు ఆంధ్ర భాషయో, తెలుగు భాషయో, యేదో ఇవి రెండును కాదని దాని విశిష్ట లక్షణములు ఏమిటో తెలుసు కొనుటకు చారిత్రక పరిశోధకుల కైనను సాధ్యమగునో కాదో! ఇట్టి సందర్భములో ప్రస్తుతపు తెలుగులో పరిపాటియై యున్న పదములు, వృత్తములు, నడకలు మొదలగునవెల్లయును వాటి వాటి వ్యుత్పత్తు లెట్టి వైనను ఆంధ్రభాషలు, ఆంధ్రఛందస్సు, ఆంధ్రరీతి యనుకొనవలసినదే. పాటలుకాని యిట్టి ఛందస్సులలోకి కూడా కవులు వాడుక భాష లోని రీతులు చొప్పించి యున్నారు. బాగుండని చోట బాగున్నాయి కావందుమే కాని, అట్టుల జొప్పించకూడదని చెప్పి కవి స్వాతంత్ర్యమునకు మేమడ్డురాము. ప్రస్తుత భావకవీశ్వరుల పద్యములలోని రసస్ఫుటత్వము, భావసహజత్వము, కవిత్వపు పాకము, మొదలగు వానిని గూర్చి మాకు కొన్ని సందియములుండవచ్చును గాని వారు తీసుకొనుచున్న భాషా స్వాతంత్ర్యములను గూర్చి మేము తగవులాడము. భాష శరీరము. భావము హృదయము. శరీరము చక్కగను లలితముగా నున్నది. ఆ హృదయమును గ్రహించుటకు మా హృదయము కూడా తడువులాడుకొనుచు అనేక చోటుల విసిగి, విహ్వలయై, చీకాకుపడి, యేమియును గానక కాల వ్యయమునకై విచారించి వెనుకకు వచ్చుచున్నది. ఆ హృదయమునకు కాంతి నద్దవలెను – ఆ హృదయము విషాద విచార శోక దందహ్యమానమై గాఢాంధకారము కంటెను కాఱునలుపుగ నుండవచ్చును– కాని కవియొక్క కవిత్వపు కాంతితో కూడ దాని వైపునకు ఇంచుక జ్ఞానవంతుడగు పాఠకుడు తొంగి చూడలేకున్నచో అది వ్రాయకున్నచో గలుగు గొఱంతయేమి? నేనెవ్వరికొఱకై కాని వ్రాయలేదు. పిట్టవలె అవ్యక్తముగా పాడుకున్నాను. ఆ ఆనందము నాకున్నది. దేశమునిండ పత్రికలును అచ్చాఫీసులును నున్నవి కనుక పంపించి నా పేరుతో అచ్చు వేయించుకొన్నా నన్నచో విమర్శకుడు దానికొరకై సిరా దండుగ చేసి పాళీ మొద్దు చేసికొన నక్కరలేదు.

## ప్రబంధ వచనములు

ఇక నీ యాంగ్ల యుగములోని గద్యవచనమును గూర్చి యాలోచింప వలసి యున్నది. ఇంతకు ముందు ప్రబంధములలో గనబడుచుండెడి వచనములు పద్యముల కంటె కష్టములై, కవిత్వ శోభితములై, యమక యుక్తములై, ద్వ్యంద్వార్థ సముపేతములై గంభీరములై, ఛందోబద్ధములు కాని కారణము చేత యెక్కువ స్వతంత్రములై కవిప్రతిభకు పద్యములకంటె ప్రబలతర నిదర్శనములై యున్నవి. పోతనామాత్యుని గద్యములలో చాలామట్టుకు కాదంబరి పోకడలున్నవి. పెద్దన్న వచనములును సులభ సాధ్యములు కావు. వచనములు వ్రాయుట కదియే సరళి యని భావించు చుండిరి. ఈ ఆంగ్ల యుగములోని నారాయణదాసుగారు వ్రాసిన రుక్మిణీ కళ్యాణములోని వన వర్ణనము వాటి పోకడలోనే యున్నది. వచనము కూడ ఒక రీతి కవిత్వ విశేషమనియే భావించబడుచుండెను గాని దానిలో నొక వ్యావహారిక ధర్మమున్నదని వారెవ్వరును దాని నుపయోగించినది కాదు. భారతములోని తిక్కన్న వచనములు అంతగా కవిత్వ విశేషములు కాక ముందరి కథకును వెనుకటి పద్యములకు గల సంబంధమును మాట వరుసగా చెప్పుచుండు అతుకుల వలె అతి రమ్యములై వచన లక్షణములు అనేకములు వాటికి పట్టి యున్నవి. భారతమే ఒక మోస్తరు వ్యవహార కావ్యము. అందులో తిక్కన వ్యవహార జ్ఞాని. భారతమును మనలో కొందరింకను "మాటలమూట" యందురు. కవిత్వ నైపుణ్యములు, అలంకార విశేషములు, ద్వ్యంద్వార్థములు మొదలగు వానికైగాక భారతము యొక్క గొప్పతనమెల్లను కురుపాండవ జ్ఞాతుల మత్సరాభి మానములను, వీర పరాక్రమములను రాజకీయ వ్యవహారములను కవికథకుడు చెప్పినటుల నుండెడి పటిమకై చెందుచున్నది.

## గద్యకావ్యముల శైలి

ఇవి కాక శుకసప్తతి, హంసద్వాదశి, విక్రమార్క, కాశీ మజిలీలు మొదలగు కథలు కేవల వచన కావ్యములు- వీటిలోని వ్యవహారములు, సంభాషణములు మొదలగువానికి సంబంధించిన భాష భారత వచనముల వలె

టూకీగాను సులభముగాను నుండును కాని వర్ణనములను ప్రారంభించెడి చోట్ల ప్రబంధవచనముల యనుకరణములుగా నున్నవి. అయినను వాటికిని వీటికిని భేదము లేకపోలేదు. ప్రబంధములు కేవలము పాండిత్య ప్రదర్శనము కోసము, పండితులకి తెలియడము కోసము, పామరులకు తెలియవలెననెడి సంకల్పమేమీ పెట్టుకోకుండా వ్రాసినవి. ఈ కథలట్లు కాదు. పెద్ద పాండిత్యము లేక యించుకంత చదువుకొని విలాసముగ కాముకులై వీధులలో తిరుగువారి కొరకుగాని, చోరత్వములోగల నెరజాణతనముల నెల్ల స్వైరవిహారిణులెటింగి యానందించు కొనుటకు గాని, లోకములో జరుగ గల యద్భుతములను తెలిసికొన నువ్విళు లూరు చుండునట్టి కొంచెము మట్టుగ చదువుకొన్న వారు పఠించుకొనుటకు గాని వ్రాయబడిన గ్రంథములు అట్లైనను, వాటిని హృదయరంజకముగను, భావమును ఉద్రేకించునట్లుగను, ప్రకృతిని చిత్రించు నట్లును అద్భుతమును ప్రసాదించునట్లును చేయవలెనని తలచి ప్రబంధ వచనముల పోకడ నందు చొప్పించనిదే దానికి కావ్య ప్రపంచములో నుండదగినంత ఘనత రాదని యూహించి విద్వత్కథకులు వ్రాసిన వే యవ్వి. ఇందు చేతనవి ఉత్తమ వర్ణనలు, మధురశైలి, సులభ కథనము మొదలగు లక్షణములతో గూడి ఇప్పటి నవల ప్రపంచమునకు జనకుడనదగు శైలిలో నున్నవని చెప్పవచ్చు. దేశ చరిత్రములు, విమర్శనములు, సమాచారములు, శాసనములు, పత్రములు, ఉత్తరములు మొదలగు వ్యావహారిక గ్రంథములుగా గాక రసవంతములై హృదయములలో సంచలనాదులు కల్పింప వలసిన శైలి కావలెనన్నచో ఆ శైలి మన కెంతమాత్రమును తిరస్కరణీయము కాదు. ఇవి కావ్యములకా కావ్యములు, చదువుకొనగల వారు పఠించుటకుదగిన కథలకా కథలు, చిలకమర్తి లక్ష్మీ నరసింహంగారి నవల శైలికి దీనికి చక్కని సంబంధమున్నది. ఈ శైలి నోటికి వచ్చినటులెల్ల వ్రాసుకొని పోవుట కాదు. డెందములో నుదయించెడి భావముల నెల్ల సుందర పదములతో చిత్రించి వినువారి వీనులను రంజింపజేయ వలె ననెడి యభిలాషతోను, సుందర దృశ్యములను వర్ణించవలసిన యవకాశములు చిక్కినప్పుడెల్లా చేయి విరచుకొని యూరకొనక శాంతముగను ఆమూలాగ్రముగను దానిని వర్ణించి కథ కట్టి దృశ్యములతో గల సంబంధముల నతికి రంజింపగ జేయు చాతుర్యముతోను వ్రాయబడిన శైలి యది. దీనికి ధోరణి యొక్కటియే ప్రధానముకాదు.

సౌందర్యము కూడా మఱియొక గుఱి. ఇట్టి సుందర ధోరణిని చిందించింది లక్ష్మీనరసింహముగారి కలము విశ్రాంతి చెందింది. అప్పటినుంచి ఆంధ్ర గద్యశైలిలో నెన్నైనను చిందులాడు చున్నవి గాని సౌందర్యము కాని వీనులకు విందుగొల్పు కలక్వాణము కాని మందునకైన గాన రాదు.

## ఆ శైలి పడిపోవుటకు కారణములు

ఇది యాంధ్రకవుల లోపముగాని కథకుల లోపముగాని కాదు. ఇది గద్యయుగము, వ్యవహార యుగము. విద్యా పాండిత్యముల యుగము కాదు. త్రోవదప్పి యెవ్వరికైనను విద్యయును రావచ్చును, పాండిత్యము కలుగవచ్చును. కవిత్వమును రావచ్చును. ఏదో యొక శైలియు నలవడవచ్చును. కాని ప్రతివారు కోరుచున్నదియు వ్యవహారము. మన విద్యా సంస్థయున్ను విధానమున్నూ వ్యవహార కర్మాగారములు కాక విద్యాలయములను కొనుట వెట్టి. అక్కడ చదువులు చెప్పుచున్నారు, పుస్తకములు గలగల లాడుచున్నవి. బాలకులు నిద్రలు లేక యేవో కంఠతా పెట్టుచు తపశ్శాలుర కంటె (గూడ నెక్కువగా కృశించుచున్నారు. కాని ఇదియెల్లయు జ్ఞానాజ్ఞాన సమస్యా పరిష్కారార్థమే కాదు. పరీక్ష పేసవుట కొఱకు. అది యెందుకు? ఉద్యోగము సంపాదించుకొని పొట్ట పోషించుకొనుట కొరకు. ఇప్పుడు పరీక్ష పోయినచో యావజ్జీవనమును అన్న వస్త్రములు లేక మలమల మాడిపోవలెను. కాస్త స్థితిపరులో తమ ధనమును విద్యమీద మదుపు పెట్టి పరీక్షలు పేసయి అసలు వడ్డీలు కలిపి లాగవలెనని కోరుచున్నారు. కొంత కాలము వరకు నిది లాభప్రదమై తక్కిన అన్ని వృత్తుల కంటెను నెక్కువ లాబభకరముగ నుండెను గాని యిప్పుడు నిరక్షరకుక్షులార్జించినంత బాగా వీరార్జించుకొనలేక, వారు సునాయాసముగా శ్రీమంతులగుచుండుట చూచి వీరి చదువులకై వీరే సిగ్గును పొందుచు తమ తొంటి యాశయము తీరదు సరేగదా, దాని వలన తలవని తలంపుగా, (గలిగిన జ్ఞానము యొక్క ఫలితమును గూడ దారిద్ర్యము చేతనో విఫలమనోరథులమైతిమను నిరాశ చేతనో అనుభవించలేకున్నారు. కవిత్వమునకుఁ గూడనిదే గతి పట్టినది. కాని భావకవీశ్వరులు యౌవనపు మెఱుపు ఉన్ననాళ్ళు షెల్లీ కీట్సుల వలె యే ప్రేయసి మీదనో నాలుగు ప్రేమగీతములు పాడి, అనతికాలములోనే

విషాదచ్ఛాయ వారి నావరించుటచేత డెందములు చిన్నవోయి దుఃఖాక్రాంతులై విషాదమును, నిరాశను, ప్రావృడ్జలదముల వంటి కాఱు చీకట్లను అవ్యక్తముగ ఆంధ్ర సారస్వతము నందెల్ల జిమ్ముచున్నారు. భావ కవిత్వము మా కర్థము కాదనే వారలు దీనిని బాగుగా పరిశీలించవలెను. రవీంద్రునివలె Mystic అవ్యక్త గీతములను వ్రాయవలెననెడి కోరికయు రవీంద్రుని దనరును కొంత తగులుట యట్లుండనిచ్చి, పాపము వారి డెందములే అప్రాప్తమనోరథములై అరజవ్వనములోనే అనర్థములు వారిపై వ్రాలి, పాట అవ్యక్తమై గుండె గొంతుకలో నుంచి రాకుండెడి వారును, గొంతు ముళ్ళు వీడని వారును నై యున్నారు, పాపము అట్టివారి గీతములు మన కవ్యక్తములుగా నున్న నన్న ఆశ్చర్యమేమి? వీరు నిజముగా నిష్కాముకముగా పాడుచున్నవారే. గీతములు చదువు వారుండరు, కొనువారుండరు. వీరి యెడ సానుభూతి చూపగలవారు కూడా అరుదగుచున్నారు . అయినను సాహిత్య కవాటముల నెల్ల ముట్టడించి, తలుపులు బిగ్గతట్టి తమ స్వరమును పది మందియు వినునట్లు నిర్బంధించ గలుగుచున్నారు.

అయితే ఈ గద్య కవుల కింకను అంత దురావస్థ పట్టలేదు. ఏ రాముని చరిత్రయో ఒక చిన్న కథగా వ్రాసినను, ఏ ఆంధ్ర వీరుల చరిత్రములనో ఒక చిన్న గుచ్ఛముగా గ్రుచ్చినను టెక్స్టు బుక్కు కమిటీ వారి ప్రాపకముతో దానిని పేసు చేయించుకొని ఖర్చులు పోగా ఒక పుస్తకము మీద రెండు వందల రూప్యములైనను లభించి వారు పొందుచున్న యితర వేతనమునకును పిత్రార్జితమగు భూమి యేమైన మిగిలియున్నచో దాని మీదనుండి వచ్చు కొంచెము శిస్తుకును తోడై జీవనమును కొంచెము సహన యోగ్యముగా చేయును. యూనివర్సిటీ వారు పద్యము లెల్లయును పూర్వ కవీశ్వరుల నుండియే యెత్తి నిర్ణయించుట చేత ఆ లాభము కేవలము కంపెనీలవారికే పోవుచున్నది. పోతన్నగాని, తిక్కన్నగాని, మొల్లగాని, తెమ్మనరుకదా! కాక భావకవుల విషాదగీతములను ప్రేమ గీతములను యే కుర్రవాళ్ళకు టెక్స్టుగా నిర్ణయింపనగును?

## వచనము యొక్క కర్తవ్యములు

ఇప్పటి గద్యమెన్ని శాఖలుగా నున్నదో అవి యెట్లెట్లు

ఉన్నవో, వాటి నెట్లు అభివృద్ధి పరచవలెనో నిర్ణయించు కొనుటకు ముందు గతయుగములో గద్యము చేసియుండిన పనియేమో యిప్పుడు చేయవలసిన పనియేమో, నిర్ణయించవలసి యున్నది. గతయుగములో వ్రాయబడిన యే కొలది గద్య గ్రంథములైనను వినువారి మనములను రంజింపజేయుటకు వ్రాయబడిన సుందరములగు కథలు. వాటికొక సుందరమగు శైలి యవసరము. గత యుగములో గద్యమున కిది తప్ప వేరే ప్రధానమగు పనిలేదు. ఇప్పుడు గద్యము చేయవలసిన పనులు హెచ్చినవి. చారిత్రము నెల్లను పరిశోధించి తిరగ వేసి వ్రాయవలెను. వృక్షశాస్త్రము, శరీరశాస్త్రము, పదార్థవిజ్ఞాన శాస్త్రము, రసాయనశాస్త్రము మొదలగు శాస్త్రములను బాలురకును ప్రౌఢులకును తెలియజేయవలెను. దేశకాల పరిస్థితులను గూర్చి విమర్శనములు చేసి ప్రజలనుద్బోధించవలెను. ఎక్కడెక్కడి వింతలను విడ్డూర్యములను పత్రికలకు వ్రాసి లోకమునకు చాటవలెను. సభలందు చర్చలు చేసి తీర్మానములు చేయవలెను. కవీశ్వరుల గ్రంథములను పఠించి విమర్శనములను వ్రాయవలెను. మహాపురుషుల జీవితములను వ్రాసి బాలురకు సదాశయములు చూపవలెను. ఇది చేయవలసిన వ్యవహారము లపరిమితముగ నున్నవి. ఇవి యన్నియును కావ్యములు కావు. వీటిలో సౌందర్యమును చూచుకొనుచు నగిషీలు చెక్కుచుండిన లాభము లేదు. విశృంఖలమగు ధారయు, పదములు తొట్రుపాటుతనము లేమియును, పూర్వాపర సందర్భములు తప్పిపోమియు తర్కశాస్త్ర సమ్మతముగ సిద్ధాంతములును తీర్మానములును రుజావు చేయుటయు, సౌలభ్యము మొదలగు గుణములే దీనికి ప్రధానములు. పరిశోధకులును, భారమునెత్తిపైగల వారును, నెల్లరును ఈ కావ్యముల యందే నిమగ్నులై యున్నారు. వీరి కర్తవ్యము వేరు. వీరికి కావలసిన శైలివేరు- ఇట్టి శైలికి పితామహుడై వీరేశలింగముగారు వెలసినారు- తెలుగు జాతి యీయీ శాఖలలో వృద్ధి పొందుచున్నన్నాళ్లు ఆ మహనీయుడొనర్చిన యుపకారమునకై చేతుల నెత్తి కృతజ్ఞతను చూపక మానదు.

## నవలలు

ఇట్లయ్యును గద్యమునుండి కావ్యలక్షణములను మనము సంపూర్ణముగా విడదీయ జాలము. వీరేశలింగము గారే తమ నీతి చంద్రిక యందు ఇట్టి

లక్షణములకై ప్రయత్నించిరి కాని, అతని తరువాతి వారు దానిని కేవలము కృత్రిమమని త్రోసి వేసి అతనికి గల ప్రాముఖ్య మెల్ల అందుకొరకై కాక వానికి విరుద్ధమైన దాని కొరకేయని కృతనిశ్చయులైరి. ఇతని తరువాత నట్టి లక్షణములు గల గద్య కావ్యములను వ్రాసినవారు చిలకమర్తి లక్ష్మీనరసింహం గారే. వీరు తెలుగులో స్వతంత్రములగు గద్య కావ్యములు వ్రాసి విస్తారమగు సాహిత్యము సృష్టించి కీర్తి పట్టము గట్టుకొని విద్యా వయోవృద్ధులై విశ్రామము తీసుకొనుచున్నారు. ఆ తరువాత స్వతంత్రములగు గద్యకావ్యములను వ్రాయగల శక్తి తెలుగు విద్యావంతులలో నస్తమించినది. పద్య కావ్యములలో రవీంద్రుడును, ఆంగ్లేయుల Minor Poems ను శరణ్యము లైనట్లే గద్యకావ్యములలో బంగాళ నవలాకారుల తర్జుమాయున్ను, అయిరోపీయ నవలాకారుల ప్లాటులున్ను (Plots) శరణ్యములైనవి. ఈలోగా స్త్రీలలోనేమి, చదువురాని జాతులలోనేమి విద్య యెక్కువై పఠనజ్ఞానము వ్యాపించినది. ఆంగ్లేయ పాఠశాలలో నేమి కచేరీ సావిళ్లలోనేమి కొలువులు సేయుచు తీరుబాటు లేని విద్యాధికులకు పరిశోధనము విమర్శనము మొదలైన పరిశ్రమలు సేయుట కవకాశములు చిక్కలేదు. కాని ప్రత్యేక గద్య కావ్యములను వ్రాయగల స్వతస్తేజ మింకను ఉద్భవించలేదు. గాని, ఏ కొలువులోనో కాలక్షేపము సేయుచు అప్పుడప్పుడొక శాస్త్రీయ గ్రంథమును వ్రాయుటకును, ఒక నవల నేభాషనుండియైనను తర్జుమా చేయుటకును Plot ను త్రిప్పి వ్రాయుటకును తగినంత ఉత్సాహము విద్యాధికులకు చిక్కినది. పరిశోధనమును పరిశ్రమయును వున్నచో బుద్ధిమంతులకును ఓపిక కలవారికిని తప్ప సాధ్యముకానివి. కాని హిందూ దేశపు భాషలలో దేనినైనా సంపూర్తిగా నేర్చుకొని అందులోంచి నవలలను తెలుగులోనికి తర్జుమా చేయుట పెక్కు జనులకు సులభ సాధ్యమైన పని. వంగదేశీయులు పద్య కవిత్వమునందే కాక నవల రచనము నందును పేరెన్నిక గని యుండిరి. మధ్య యుగము నాటి బంగాళదేశ చరిత్రమును, రాజపుత్రస్థాన చరిత్రను, మహారాష్ట్ర చరిత్రను, బుందేల్‌ఖండ చరిత్రను రసవంతములగు నవలలుగా వారు వ్రాసిరి. అవి కన్నడ భాషలోనికి కూడా తర్జుమా అయినవి. కొందరు కన్నడమును సులువుగా నేర్చుకొని వాటిని తెలుగు చేసిరి. కొందరు బంగాళ, మహారాష్ట్రము, హిందీ మొదలగు భాషలనే స్వయముగా నభ్యసించి వాటిలో నుండు

నవలలను కుప్పలు తిప్పలుగా తర్జుమా చేసినారు; చేయుచున్నారు. ఆంధ్ర ప్రచారిణీ గ్రంథమాల, సరస్వతీ గ్రంథమాల మొదలగు గ్రంథమాలలెన్నియో రెండేసి మాసముల కొక నవల చొప్పున దించి ఆంధ్రుల హస్త పద్మముల కర్పించుచున్నారు. గ్రంథాలయము లూరూరా వెలసినవి. ఆంధ్రులలో గ్రంథ పఠనాసక్తి హెచ్చినది. కాని దినదినమునకు భాషాంతరీకరణములై మన భాషలో పడుచున్న యీ నవలలే మన దేశమునందు స్వతంత్ర గద్య కావ్య రచనము లేక నవల రచన మింకను ఎట్లు ఉద్భవించనే లేదో తెలియజేయు చున్నవి. ఎవ్వరిని జూచినను ఏదో యొక క్రొత్త భాష నభ్యసించుచు, అందులోనుంచి కూడబలుకు కొనుచు ఒక నవలను భాషాంతరీకరించు చున్నవారే. ఆంధ్రులలో స్వతంత్ర గద్య కావ్యములుదయించుట కింకను నెంతో కాలము గడువవలెను కాబోలును. రాయచూరు యుద్ధము, విజయనగర సామ్రాజ్యము, లక్ష్మీప్రసాదము మొదలగునవి కొన్ని స్వతంత్ర కావ్యములు కలవు కాని అవి క్రొత్త రచనలకు మార్గ దర్శకములైనవి కావు. నవల యనగా ప్లాటు నొకటి పెట్టి కథనల్లి వేయుట కాక సమకాలిక సాంఘిక జీవనమును చిత్రించుటయై యున్నది. అట్టి నవలలొకటి రెండు తప్ప ఆంధ్రజీవనమును చిత్రించునవి లేనేలేవు.

## ఆఖ్యాయికలు

గద్యకావ్యములలో రెండవ విధానము చిన్ని కథ (Short story) బంగాళా భాషలో ప్రేమచందు యిట్టి కథల నెన్నింటినో వ్రాసెను. అవి మన భాషలోకి తర్జుమా అగుచున్నవి. మరియు నితర భాషలలో నుంచి కూడా తర్జుమా అగుచున్నవి. చిన్ని కథ యొక్క చాతుర్యమెల్లను ఒక మనుజుని జీవితమును ఆఖ్యానములో నుండి యెక్కడ నుంచియో మొదలు పెట్టి చిత్రముగా కొంత వరకు తీసుకొని వెళ్ళి యెక్కడనో అద్భుతముగా నాపివేయుటలో నున్నది. ప్రతి మనుష్యుని జీవితమునందును నట్టి యద్భుతములు జరుగుచున్నవి. అట్లు ప్రదర్శింపవచ్చును. కాని ఆ అద్భుతమును గ్రహించి చిత్రించగల సూక్ష్మబుద్ధి గల కథకుడు కావలసి యున్నాడు. అతడు వచ్చేలోపల ఈ యద్భుతము ప్రాతగిల్లి పోవును లేదా మఱపు వడును. దానిని చిత్రించుటకు గూడ గద్యకవులు కావలసి యున్నారు.

నవలకారుని కంటె యిట్టివాడు పుట్టుట సులభము. నవలలో మానవ జీవితము నొక అధ్యాయము నెల్ల చిత్రించవలసి యున్నది. ఇందులో నాలుగైదు తావులు కాని, ఒకటి రెండు తావులు కాని ఒక్క తావైనను చిత్రించి పాడుగు కాకుండా చూచుకుంటే చాలును. భారతి యిట్టి వానిని కందామని నొప్పులు పడుచున్నది. ఎవరు పుడతారో చెప్పజాలము.

## రాగల గద్యకావ్యములు

పురాణములలోని నాయకుల జీవితములను ఈ నూతన దృష్టితో తిలకించుచు, వారి జీవితములు మన కెట్టి సందేశముల నిచ్చుచున్నవో యుద్బోధించుచు వారి చర్యలకు క్రొత్త క్రొత్త అర్థములను వ్యాఖ్యానములను సేయుచు, గద్య గ్రంధములను వ్రాయుచో అవి చక్కని కావ్యములగును. లేదా చారిత్రక మహాపురుషుల, పరాక్రమశాలుర జీవితములను, వారిని వారి వారి పరిస్థితులలో నిలిపి వారి శత్రువులను కష్టములను వారు అతిక్రమించి యెట్లు ధన్యులైనారో అనుకూలమగు అధ్యాయములుగ కథ విభజించి వ్రాయుచో అదియును చక్కని గద్య కావ్యము కాకమానదు. అనేకము అంశములమీద సుందరమగు భాషలో ప్రతి వారును తమ సుందరములగు అభిప్రాయములను వ్యాసరూపములుగా వ్రాయవచ్చును. అవి సూరిశాస్త్రిగారి నాట్యలేఖల వలె గాని పానుగంటి లక్ష్మీనరసింహారావుగారి సాక్షి ఉపన్యాసముల వలె గాని అంత పెద్దవై యుండవచ్చును. లేదా యింకను చిన్నవి చేయవచ్చును. ఇట్టి వ్యాసములలో కేవలము ధోరణియు విపులత్వము కొరకు గాక క్లుప్తత, రూఢి, సుందరత్వముల కొరకు ప్రయత్నించుచుండుట మంచిది. వీటి యన్నిటిలోను కేవలము ధోరణికే కాక సౌందర్యమునకు గూడా శైలి యందు తావుగలదు.

## ఆంధ్రనాటకములు

ఆంధ్రనాటకములను గూర్చి మన దేశములలో నీ మధ్యను లేచినంత విమర్శనము అభిప్రాయములు, పత్రికలు, వ్యాసములు గ్రంథములును మరియే యితర శాఖపైగాని లేవలేదు. ప్రజ్ఞావంతులు కొందరందులో పాల్గొనుచున్నారు. పాటలు కావలెననువారు, వద్దను వారు, పద్యమును రాగము విసరిచదువు

మనేవారు, త్రుంచి చదువుమనువారు, రాగము లేకుండా చదువుమనువారు, అంతా గద్యమునే వ్రాయు మనువారు, గద్యపద్య మిశ్రమము చేయుమనువారు, షేక్స్పియరు వలె ప్రధాన పాత్రములకు ప్రధాన రంగములకును సర్వదా పద్యమున్ను, మామూలు పాత్రలకు మామూలు వాడుక భాషయును కావలె నను వారు పెక్కురు పెక్కు అభిప్రాయముల నిచ్చుచున్నారు. ఇంకను ప్రారంభములును సోదాలను మాత్రము చేయుచున్నారు. ఏవో కొన్ని సిద్ధాంతములు బయలుదేరునను ఆశకలుగుచున్నది. నవలలు, చిన్న కథల కంటె దీనిలో విశేషమేమనగా ఇందులో భాషాంతరీకరణములు కన్న స్వయంరచితము లెక్కువ యున్నవి. ఇతర భాషలలో నాటకముల పోకడ లెట్లున్నవో భాషాంతరీకరణము చేసి విద్వాంసులు తెలుపుచున్నారు. ప్రపంచము లోను హిందూ దేశములో నితర భాగములలోను బయలుదేరుచున్న ప్రస్తుత నాటక సిద్ధాంతములు తెలియబడుచున్నవి. ఎన్ని వివాదములు అభిప్రాయ భేదములు ఉన్నను నాటకరంగ ముత్సాహవంతముగను శుభసూచకముగను నున్నదనియే చెప్పవలెను.

## దేశచరిత్రములు

ఇక కావ్యములు కాని యితర గద్య గ్రంథములను గూర్చి మన మాలోచింపవచ్చును. ముందు విమర్శన గ్రంథములు. వీటిలో ప్రకృతి వర్ణనలు కాని, ఉత్సాహోద్రేకములు పుట్టించుట కాని, సుందర పదతుందిల మగు శైలి కాని అవసరములు కావు. విమర్శకుని దృష్టి యెల్లయు తన చెంతనున్న అసంఖ్యాకములగు పత్రముల నుండియు, అభిప్రాయముల నుండియు సత్యమైన దెద్దియో నిర్ణయించి బలవత్తరముగ రుజువు పరచి, అందుకు వ్యతిరిక్తములైన వన్నింటిని కాదని చెప్పి త్రోసిపుచ్చుట. ఇట్టి విమర్శనము ముఖ్యముగా దేశ చరిత్రమున కవసరమై యున్నది. ఈ రంగములో మనకంటే ముందు పాశ్చాత్యులు ప్రవేశించి పత్రములు, శాసనములు, గ్రంథములు మొదలగునవి తిరగవేసి వారికి తోచిన సిద్ధాంతములను స్థిరపరచి, నచ్చనివి త్రోసివేసి చరిత్రలు వ్రాసి, ప్రపంచమునకు ప్రచురించి మన దేశములో పిల్లల చేతను పెద్దల చేతను పఠింపచేయుచున్నారు. ఇందు వారి పరిశ్రమయే మనకు కొంత సహాయకరము కాగలదు. క్రొత్త క్రొత్త సంగతులు

కూడా తెలియుచున్నవి. దేశభాషలును, శాసనముల లిపులును, దేశ లక్షణములును స్వదేశీయుల మగుటచేత వారి కంటె మనకు మఱీ బాగుగా తెలియ గలవు. వారి సిద్ధాంతములు సరిగా లేవనియు అవి ప్రబలినచో మన నిజ లక్షణములు బయలు పడక లోకము మోసపోవుననియు భావించి పెక్కుఱు దేశీయులా రంగములోనికి దిగి క్రొత్త చరిత్రలు వ్రాయుచున్నారు. దేశచరిత్ర వ్రాయు నుద్దేశ్యముతో గాక సాహిత్య చరిత్రము నెఱుగు నుద్దేశ్యముతో కొందరు వానినెల్ల తిరగవేసియున్నారు. కొమర్రాజు లక్ష్మణరావు గారు, చిలుకూరు వీరభద్రరావుగారు మొదలగు వారెల్ల మొదటి తరగతి వారు. వీరేశలింగం పంతులుగారు, గిడుగు రామమూర్తి పంతులు గారు, జయంతి రామయ్య పంతులుగారు మొదలైన వారెల్ల రెండవ తరగతి వారు. వీరి పరిశ్రమల నాధారము చేసుకొని ఆంధ్రప్రదేశ్ చరిత్రమును విపులముగా వ్రాయవలసి యున్నది. ఆంధ్ర సాహిత్య చరిత్రమునకును ఆంధ్రచరిత్రమునకు అవినాభావసంబంధమున్నది. కనుక ఆ సందర్భములోనే ఆంధ్రసాహిత్య చరిత్ర కవుల చరిత్రలు కూడ దొరకును.

## వార్తాపత్రికలు

వార్తాపత్రికల వైపున కొకసారి చూడనిదే గద్య కావ్య ప్రశంసను మనము విడచిపెట్టజాలము. వార్తాపత్రికలు కేవలమును వార్తావాహకములు మాత్రమే కావు. యుక్తాయుక్త విచక్షణము, సమహిత శీలము, దేశాభిమానము, స్వాతంత్ర్యాకాంక్ష, నిర్భీరుత్వము, మొదలగు గుణములు గల సంపాదకులచే నడుపబడుచుండు పత్రిక అనతి కాలములో దేశములో ఆచార్యపీఠము వహించి, ప్రజలకు విధినిషిద్ధములను చూపుచు క్లిష్ట సమయముల యందు అనుసరణీయమైన సలహాల నీయగల హక్కును సంపాదించుకొనుచున్నది. దేశములో వివిధ రాజకీయాభిప్రాయ భేదములు సాంఘిక విధానములు, విశిష్టమతములు నుండి యొకరి సలహా యొకరికి నచ్చును గాక, మానును గాక, వ్యాసముల యందలి, అందును ముఖ్యముగా సంపాదకీయములందలి శైలి, వారము వారమునో దినదినమునో వీనులపై డప్పుల శబ్దము వలె పడుచుండుట చేత ఇది రహస్యముగా పాఠకుల భావనలోనికిని వచో విధానములోనికిని దూరి, దేశీయ సాహిత్యమునకే యొక క్రొత్త ధోరణి

కల్పించక మానదు. ఈ విషయములో దేశమాత చేసిన సేవయు కృష్ణాపత్రిక యొనరించుచున్నదియు మిగుల ప్రశంసింపదగినవి. ఇప్పుడు చేతిలో నైదు వందలు గల గల లాడుచున్న వారందరును ఒక పక్షమునో, ఒక వ్యక్తినో, ఒక జాతినో దూషించుటకై యొక పత్రికను పెట్టుకొని, కొన్ని నాళ్ళు గల గల లాడించి చిత్త జల్లుల వలె వెలసిపోవుచున్నారు. కొన్నిపత్రికలలో పత్రికలు సాగుటకు గల మదుపు, పేజీలు నిండుటకు గల మాటలు, ప్రకటనదారుల (Advertisers) నమూనా సొమ్ములును తప్ప ఒక శైలి గాని సాహిత్యచాతురి గాని కానరాకున్నవి. ఆంధ్రపత్రిక సంపాదకీయములు కొంచెము పొట్టివైతే బాగుంటుంది. బ్రాహ్మణులు దానవులు కారని తలుస్తే సమదర్శిని మంచి ఆదరణ పాత్రమౌతుంది. బ్రాహ్మణేతరోద్యమముతో ఢీకొనుటయే తన అవతారము యొక్క ఆదేశమనుకోకుంటే తెలుగు స్వరాజ్య పత్రిక తన విజ్ఞానమును మఱీ బాగా వెదజల్లుతుంది. జాతిద్వేష గీతము నొక్క శ్రుతి తగ్గించి పాపము సుబ్బమ్మగారి వంటి బాల వితంతువుల మీద నుంచి తన ఆయుధపు గుఱిని తప్పించినచో తెలగ పత్రిక యెక్కువ శౌర్యవంతమౌతుంది. దాని శైలియు సాహిత్య చాతుర్యమును నీచపు హేళనల నుండి విరమించవలెను. దురుసు తనమును బాల్య చాపల్యమును విసర్జించినచో కాంగ్రెసు పత్రిక యెక్కువ మన్నన పాత్రమౌతుంది. అయితే యెన్నికలు దాటే వరకు మాసలహా యెవరికి గాని నచ్చునని తోచదు. ఆ తరువాత మిగిలినవి యెక్కువ స్తుతి పాత్రము లౌతాయని నమ్మవచ్చును.

## గ్రంథ విమర్శకుడు

పిమ్మట నాంధ్రగ్రంథములు విమర్శనము చేయవలెను. మొన్న మొన్నటి వరకును గ్రంథ విమర్శన మనిన ఒప్పులు మానివేసి తప్పులు చూపించుట యనియే అర్థము. అవియును వ్యాకరణము తప్పులు. గురుజాడ శ్రీరామమూర్తి గారు, వీరేశలింగం పంతులు గారు మొదలైనవారు అంతకన్న ఒక మెట్టు ముందుకు వచ్చి కవి జీవించిన కాలన్నిర్ణయము, అతని వంశావళి, అతని మతము, అతని పద్యముల నుండి రసగ్రహణార్థము కొన్ని పద్యములనెత్తి వ్రాయుట యీ మొదలగు పనులు చేసినారు. విమర్శనమనిన నింతకన్నను ముఖ్యమైనపని యున్నది. ఆ గ్రంథములలోని రసమును గ్రహించుట,

అందులోని పాత్రముల స్వభావముల ఔచితులు చర్చించుట, తోడివారి గ్రంథములలోని పాత్రములతో పోల్చిచూచుటలు, అందులో మానవ స్వభావమున కొప్పిన వెంతవరకొ విపరీతమెంత వరకో మొదలగునవి యెల్ల విమర్శన చేసి కవితత్వమును గ్రహించి, పాఠకులకు దానిని చెప్పి, విద్యాధికులకును విద్యాహీనులకును గూడ ఆయా గ్రంథములను పఠించి, విమర్శించి తమ తమ అభిప్రాయములకు వారు వచ్చెడి రీతిని చేయగల యుత్సాహమును పురిగొల్పుట. ఇది నిజముగా నొక కథ. పాశ్చాత్య దేశములలో నిది చక్కగా వన్నె కెక్కి విమర్శకుడు కవితో తుల్యమైన స్థానము నలంకరించు చున్నాడు. విమర్శకుడు కేవలము వ్యాఖ్యాత కాదు. కవి హృదయగ్రహణ విద్యాధురీణుడు. కొత్త సిద్ధాంతములను క్రొత్త సత్యములను గ్రహించుటలో నతనికి గల బుద్ధి కవిబుద్ధితోను, చారిత్రకుని బుద్ధితోను, ప్రకృతి శాస్త్రములలో గొప్ప గొప్ప సిద్ధాంతములను కనిపెట్టి పెద్ద మార్పులు చేయుచున్న బోసు మొదలగు వారల బుద్ధితోను, జ్ఞానాధిక్యముచే బ్రహ్మమును తెలుసుకొన్న వేదాంతి బుద్ధితోను తుల్యమైనదిగా యెన్నబడు చున్నది. అట్టి వారి బుద్ధి ప్రసరించినచో రామాయణ భారత భాగవతములు, ప్రబంధ రాజములు మొదలగున వెల్లయు మనకు క్రొత్త సత్యములను క్రొత్త ధర్మములను క్రొత్త సందేశములను వ్యక్తీకరించును. ఈ పని కేవలమున్ను కవిని పొగడ దొరకొనుట వల్లను లభించదు. కవికి విముఖుడగుట వలన లభించదు. కవితో యేకమయి కవివలె చూడగల శక్తి నలవరచుకొనుట వలన లభించును. గ్రంథపఠనపరాయత్తచిత్తుల కది సులభసాధ్యము. మన యువక కవులలో పెక్కురు దీనికి గడంగ వలెను.

## శాస్త్ర గ్రంథములు

ప్రకృతి శాస్త్రములను గూర్చియు ఆర్థిక సహకార తత్వములను గూర్చియు కృషి శాఖలను గూర్చియు పెక్కు గ్రంథములు వ్రాయవలసి యున్నది. కాని ఇవి ముఖ్యముగా తత్శాస్త్రములలోను, తత్శాఖలలోను పండియున్న పండితులు చేయవలసిన పనియై యున్నది. విశ్వవిద్యాలయముల వారును, విద్యాశాఖల వారును చేయించవలసిన పనియై యున్నది. ఎవరు చేసినను దీనికి కావలసినది భాషా పాండిత్యము కాదు, శాస్త్ర పాండిత్యము.

భాష సుందరముగను మనోరంజకముగను నుండవలసిన పనిలేదు. తెలుగు మాటలాడుటలోను వ్రాయుటలోను కాస్త ధోరణియున్నచో చాలును. కాలక్రమేణ దానికి కొంత పరిభాష యేర్పడి, ధోరణి నలిగిపోయి ప్రవాహము వలె నుపన్యసించుటకు వీలిచ్చును. ఇంగ్లీషుభాష, బెంగాళీ భాష మొదలగు భాష లెల్లయు నీ శైలి నిట్లే యలవరచుకొన్నవి. తెలుగును నిట్లే యలవరచు కొనగలదు. ప్రయత్నము చేయకుండా వెనుకకు తగ్గియుండుట వలన పనియే ప్రారంభము కాదు. ఆంధ్ర యూనివర్సిటీ వారు లేనిపోని సందేహములు పెట్టుకొని కాల విలంబనము సేయుట కంటే యెక్కువ అవివేకమైన పనిచేయలేరు.

## వాడుకభాష

గిడుగు రామమూర్తి పంతులుగారు ప్రారంభించిన వ్యావహారిక భాషా వాదము లోని సమంజసత్వమును గూర్చి యొక్కసారి ఆలోచించి యీ అంశమును ముగింతము. ఈ వాదము అమలులో గద్యవచనము నిమిత్తమైయే ప్రారంభింపబడినదని ఆయనే చెప్పుచున్నారు. గీతకవిత్వము లోనికి వ్యావహారిక భాషా ప్రయోగములు జోరుగ బోవుచున్న వన్నచో గద్య కావ్యములోనికి పోకుండా వాటి నెవ్వ రాపంగలరు? గద్య కావ్యము లోకి కంటెను గూడ గద్య విమర్శ గ్రంథముల లోనికిని, గద్య శాస్త్ర గ్రంథముల లోనికిని ఆ వాడుక పదము లెక్కువగా పోక తీరదు. మాలపల్లి వంటి నవలలు ఆ వాడుక పదములను అసంఖ్యాకములుగా లోన జేర్చుకొనియును చిలకమర్తి లక్ష్మీనరసింహంగారి నవలల కంటె తక్కువ మనోరంజకముగను మధురశైలి వంతముగను నున్నవని చెప్పంజాలము. భారతిలోను సఖిలోను ప్రచురింపబడు చుండు చిన్న కథలు లేక ఆఖ్యాయికలు రచన, రసపరిణామము, కళ మొదలగు విషయములలో నెట్లుండినను ఆకర్షణ శక్తిలో గ్రాంథిక భాషలోని కథల కంటే మిన్నగ నున్నవని చెప్పక తీరదు. చిన్నయ్యసూరి నీతిచంద్రిక, యెక్కువ అపురూపములగు పదములతో వారు పరిచయము కల్పించి నిఘంటువు చూసుకొని భాషాజ్ఞానము వెచ్చించునట్లు చేయుచున్నను వీటికంటే యెక్కువ ఆకర్షకముగ లేదు. ఈ భాషలో ఆ కథలు వ్రాసినందువలన దాని వన్నె యేమియును తగ్గదని చెప్పగలము. భాషా పరిశ్రమము కావల్సిన వారే

పుస్తకము నైనను చదివి అభ్యసించుకొనవచ్చును. కాని సులభశైలి, నిర్దుష్టముగా భావములను విప్పి చెప్పగలుగుట మొదలగు నేర్పులు చిక్కుటకు చిన్నయ్యసూరి గారి వంటి గ్రంథములు చదువ నవసరమే లేదు.

## వాడుకభాష నెట్లు చంపిరి

కాక పంతులు గారు మరి యొక్కటి చెప్పుచున్నారు. అదియును మాకు సాధ్యమని తోచుచున్నది. తెలుగు గద్య కావ్యములకు, చారిత్రక గ్రంథములకు, ఆంధ్ర భాషలో ననుశ్రుతములుగా వచ్చుచున్నది వాడుక భాషా శైలియే యనియు చిన్నయ్య సూరి మొదలగు పండితులు వ్యవహారిక భాషయే మహా అపరిశుభ్రమైనట్లు భాషకు పరిశుద్ధత నిచ్చుటకొరకు తన వ్యాకరణము ప్రకారము ప్రాత గ్రంథములలోని అకాల్పనిక శైలిని తన వ్యాకరణము ప్రకారము దిద్దెననియు, తన ప్రాత ప్రతులను గూడ ఈ సూత్రముల ప్రకారము దిద్దుకొనెననియు వారు చెప్పుచున్నారు. వారు సంగ్రహించుకొని యుంచుకొనిన పై కథల పుస్తకములు మొదలగు వాని నెల్లచూపి తమ సిద్ధాంతమును వారు స్థిరపరచుచున్నారు. వసుచరిత్ర, భారతము మొదలగు మహాగ్రంథముల యొక్క పురాతన పండిత వ్యాఖ్యానములలో నీ వాడుక భాషాప్రయోగములే ఉన్నవి. వారికి గ్రాంథిక భాష రాదనరాదు. అవి అన్నియు అచ్చు తప్పులేయని త్రోసి వేయరాదు. అప్పటి చరిత్ర గ్రంథములును శాసనములును ఇంకను ఆ భాషలోనే యున్నవి.

అయిననేమి చిన్నయ్యసూరి పందెమును ఇప్పటి పండితుల పందెమును నెగ్గినది. అప్పటికి అనుశ్రుతముగా వచ్చుచున్న గద్య భాషను వారరికట్టి పద్య కావ్యములలోని వచన భాషకు మానవజీవిత వ్యవహారములలో నములులో లేని గ్రాంథిక ప్రయోగముల భాషకు పట్టాభిషేకము చేసి, వ్యాకరణము వ్రాసి, మన యూనివర్సిటి వారి సహాయముచే దానిని ప్రతిష్ఠించిరి. ఆంధ్ర విద్యార్థులకు కూడ ఈ పోతపాలలవాటయి చంటిపాలు అంటూ ఒకటి ఉంటాయనే జ్ఞానమే లేకుండా చేసినారు. ఆ కృత్రిమ శైలిలో వ్రాయుటయే ఒక కాడికి సులభముగను, గద్యము వ్రాయవలసిన వాడుక భాషలో వ్రాయుట కష్టముగను చేసినారు. కొక్కొండ వెంకటరత్నం పంతులు మొదలగు వారి చేత నదియే యుత్తమ భాష కనుక యింట్లో కూడ నట్లే మాట్లాడవలయునని

తలంప జేసి అట్లే మాట్లాడుట అభ్యాసము చేసుకొని నట్లు చేసినారు. నేడు యెన్ని తప్పులు ఎన్ని అవకతవకలైనా పడి ఆ గిరులలోనే కొట్టుకొందామని చూస్తున్నది. కాని దిగుదామని కోరిక ఉన్నా దాని స్వస్థానమున కది రాజాల కున్నది. మహామహోపాధ్యయ బ్రహ్మశ్రీ ఆచంట వేంకటసాంఖ్యాయన శర్మ గారంతటివారు, "గిడుగు రామమూర్తి పంతులు గారు చెప్పినట్లే కావచ్చును. వారు భాష యొక్క శ్రేయస్సునూహించి కృత్రిమమని అనుకోకుండా అకృత్రిమము నొనరించినవారే యనుకొందము. అది దేశమునకు మేలుగనే పరిణమించినది. అది వ్రాత కలవాటయినది. మావంటి వారము యుపన్యాసాలను కూడ అట్లే యిచ్చుచున్నాము. ఇప్పుడు దాని మీదికి తిరగబడి మునుపటి స్థితికి పోవలసినంత ఆగత్యమేమి?" యని సెలవిచ్చినారు.

మనము తిరుగుబాటు చేసి తొల్లిటి నుండి అనుక్రమముగా వచ్చుచున్న స్థితికి రాగలుగుదుము, రాలేకపోదుము. పదియేండ్ల వరకును తెలుగుభాష నేర్చుకున్న తెలుగు కుఱ్ఱవాడు ఆ తరువాత అరవ దేశము వెళ్లి తెలుగు నేర్చుకొని, తనది ఒకప్పుడు శుద్ధమైన తెలుగన్న సంగతే మరచిపోయినాడు. తనదే మేల్తరమగు తెలుగనుకొనుచున్నాడు. చాలా కాల మట్లే అలవాటగుట చేత తన దేశపు తెలుగును తిరిగి నేర్చుకొనగల అవస్థను దాటిపోయినాడు. అయినను ఎవరైన వెళ్లి "తమ్ముడూ నీ పూర్వపు తెలుగు ఇదికాదురా, అదిరా దానికలవాటు పడురా" అని ఉపదేశిస్తే వాడికి నచ్చితే కూడా వాడీ తొల్లిటి తెలుగుకు రాలేడు, అయినా నాదా తెలుగు అని తెలుసుకొనుట వాడి కానంద దాయకముగా నుండక పోదు.

## వాడుకభాష యొక్క భవిష్యద్భాగ్యము

మే మెవ్వరమును ఇప్పుడట్టి అకాల్పనిక సహజ మధుర భాషను, ఈ కూసువిద్య నేర్చుకొన్న కతమున వ్రాయజాలకున్నను మన భాష కొక్కప్పు డట్టి యకృత్రిమ మాధుర్య ముండెను గదా యన్న ఆనందము లేకపోలేదు. ఒక్క సారిగా మే మా ముచ్చట లూరెడి మంజుల శైలికి రాజాలకున్నాము. రాగోరుచు గ్రాంథికములోనికి పడుచున్నాము. కాని వాడుక భాషయును తత్ప్రయోగములును వాటంతట అవియే మా కలముల లోనికి పోవుచున్నవి.

వాటికి ఆతిథ్యమిచ్చి ఆదరించుచున్నాము కాని పండిత నైజమగు తిరస్కార దృష్టితో గెంటివేయలేదు. అది మా స్వస్థాన మనియు జన్మభూమి యనియును మాతృమందిరమనియును, పాలకోశ మనియును తెలిసిన తరువాత మేము దాని దగ్గరకు రెక్కలు కట్టుకొని యెగరజాలకున్నాము కాని, అదియే దీనదృక్కుల తోను, తెలివి నవ్వులతోను, చిన్ని నవ్వులతోను, చెయి చాచుకొని వచ్చు చుండగా ఎత్తిపట్టుకొని ఆదరించకుండుట కలదా! అందరికి వారు పుట్టిన యింటిలోనే పెరిగి వృద్ధి నొంది పేరు మోయడం సహజమైతే, మాకు మేము పుట్టినిల్లదే అని తెలుసుకోవడమే ఆనంద కారణముగా వుంది. సహస్రకోటి కంఠములు కాదు కాదని కేకలు వేస్తున్నా ఒక్కడూ ఔను ఔను అని చేతులు రెండు యెత్తుతూ ప్రాత పత్రాల వేపూ దిద్దిన గ్రంథాల వేపూ శాసనాల వేపూ చరిత్రల వేపూ చూపెడుతూ మొర్రపెట్టి స్వస్థానము చూపించేడు. ఇల్లు గుర్తు పెట్టుకున్నాము గదా! ఇటు వేపు దృష్టి తిరిగింది గదా! ఇంటిలోకి వచ్చి కూర్చోవడం సాధ్యం కాకపోయినా ఆ ప్రాంతాలనేనా తచ్చాడుతాము. అటువేపు చూడడమే భాషాద్రోహము, మహాపాతకం, అందవిహీనం అనే భయాలు పోయినాయి. పెక్కురకాల గ్రంథాలు, కవిత్వాలు విమర్శలు, శాస్త్రాలు బయలుదేరనున్నాయి. శ్రీ పంతులుగారు చూపించిన మార్గం రామసహాయమై వారి వేపు కృతజ్ఞతాదృష్టితో తిలకించేటట్లు చేయక మానదు. కొందరు ముందర వెళ్ళుతారు, కొంధరు తాపీ పడతారు. కొందరు తొందరపడుతారు. కొందరు నిక్కి వెనక్కి నక్కుతారు. కొందరు సంతోషిస్తూ వెళుతారు. కొందరేడుస్తూ జారుతారు కాని అందరూ కూడా ఆస్వస్థానానికే ఆ చుట్టుపట్లకే పోగలరు? లేకుంటే వీళ్లెవరో అక్కడి వాళ్లకి తెలియడ మెలాగా!

*కృష్ణాపత్రిక, 2.10.1926*

# మున్నుడి

ఈ గ్రంథముతో నేడవకుసుమమును మాచందాదారుల కందరికి నందజేయుచున్నాము. మా గ్రంథమాలలోని గ్రంథములకెల్ల తలమానిక మనదగునది యీ అర్థత్రయ సర్వస్వమేయని మా విశ్వాసము. ఈ గ్రంథము అఱవ భాషలో క్రీ.పూ. రెండవ శతాబ్దములో తిరువల్లువరు నాయనారు అను ఒక సాలెకులస్థునిచే రచింపబడినది. ఈ గ్రంథమును సదరు కవీంద్రుడు సన్యాసాశ్రమము పుచ్చుకొనిన తరువాత రచించినాడట. మానవజన్మమున కవశ్యసాధన నీయములగు చతుర్విధ పురుషార్థములను గూర్చి శ్రుతి స్మృతి శాస్త్రము అనుభవము అను నాలుగు విధములగు జ్ఞానములను గల ఆ మహనీయున కెట్టి పరిచయమును అభిప్రాయములును నున్నదియు ఈ గ్రంథము వలన పాఠకులకు విదితము కాగలదు. చతుర్థపురుషార్థమగు మోక్షమును గూర్చి వివరముగ నతడీ గ్రంథమున చర్చించగడగకపోయినను ధర్మ భాగములో రెండవ విభాగమగు సన్యాసాశ్రమమును గూర్చి ప్రవేశించుటలో ఆ సన్యాసికి గల మోక్షపరిజ్ఞానము కూడ మనకు విదితము కాగలదు. మోక్షమును గూర్చి వివరముగ చర్చించబడని కారణము ఈ గ్రంథము యొక్క ఉపోద్ఘాతములో గాననగును.

తక్కిన మూడు పురుషార్థములను గూర్చియు సమగ్రమగు జ్ఞానమును సుందరమగు కవిత్వముతో నింత సూక్ష్మముగ విరచించిన గ్రంథము ప్రపంచములో నింకొకటి లేదని విద్వాంసులనేకులంగీకరించిన విషయము. ధర్మమును గృహస్థభాగము సన్యాసభాగము అను రెండుపాయలుగను అర్థమును రాజ్యాంగభాగము సామాన్యభాగము అను రెండు పాయలుగను కామమును సంస్కృతములోని సంభోగభాగము విప్రలంబ భాగములకు క్రమముగ నొప్పెడి చౌర్యభాగము సతీత్వ భాగములను రెండు పాయలుగను విడదీసి యరెదమ్ముగ వర్ణించినాడు. నీతి గఱపుటలో మొదటి భాగమును వివేకమును గల్పించుటకు రెండవ భాగమును భోగరుచి చూపించుటకు మూడవ భాగమును అనుపమానములైనవని చెప్పవలెను. ధర్మసిద్ధమగు జీవనమును నడుపగోరు ప్రతిమానవుడును మానవతియు (అట్లు నడుపుటకు గోరనైనగోరని యభాగ్యులను గూర్చి మన మాలోచింపవలసిన పనిలేదు) మొదటి భాగమును

బఠింపక తీరదు. అట్లు కోరనివారికి కూడ ఇదియొకసారి చదివిన యెడల గాని వినిన యెడల గాని ధర్మము చేయవలెననెడి వేడిని ఉత్సాహమును పుట్టించి కుత్సితములనుండి, బూటకముల నుండి, సందేహములనుండి తొలగించి అకళంకస్వాంతులను జేయును గనుక సకల గృహస్థులకును సన్యాసులకును గూడ ఇది అవశ్యపఠనీయంబని వక్కాణింపక తీరదు. అర్థ భాగములో రాజులు, మంత్రులు, సైనికులు, సేవలు, వేగులు, స్నేహితులు, బందుగులు మొదలగు రాజ్యాంగ నిర్వహణమునకు ప్రధానులగు జనులెల్లరును గలిగియుండవలసిన లక్షణములు విడువవలసిన గుణములు ఒకరి యెడల నొకరు మెలగవలసిన రీతులు అతి వివేకవంతముగను సారస్యముగను వర్ణింపబడుటయే గాక, దేశము, కోట, మొదలగు సంస్థలెట్లు అమర్చబడ వలసినదియు గూడ సూచింపబడినది. మరియును సశేషభాగమను రెండవ పాయలో రాజ్యాంగ సంబంధములేని యితరులు గూడ తమ తమ స్వంత రాజ్యములగు సంసారములను నిర్వహించు విషయములోనున్న ద్రవ్యోపార్జనాది యితర విషయములలోనున్న యెట్టి మెలకువ కలిగి ప్రవర్తింపవలసినదియును మిగుల క్రమముగను నింపుగను వర్ణింపబడినది.

ఇక మూడవ భాగమగు కామ భాగమునందా, ప్రియుడును ప్రియురాలును తొలుదొల్త నొకరి నొకరు చూచుకొనుట మొదలు, కామోద్రేకముచే నొకరితో నొకరు భోగించుట, నానాటికి ఆసౌఖ్యమునందు మత్తులగుట, గుట్లు బయలుపడనుండుట, లేచిపోవుట, విమర్శించుకొనుట, తిరిగి గృహంబు చేరుకొనుట వివాహబంధితులగుట మొదలుగాగల ద్రవిడ శృంగారరస సంప్రదాయ ప్రకారమగు సంభోగ శృంగార పరిణామ ప్రకరణములును, వివాహానంతరమున నాయకుడు ధర్మార్థ కామములలో నేదేని యొక దానినిగాని లేదా యొక్కొక్కప్పుడొక్కొక్క దానిని గాని సేకరించు నిమిత్తం నాయిక నెడబాసియుండునప్పుడు ఒకరి నొకరు విడబాసియెట్లు కాలము గడుపగలిగిరను నంశములును మిగుల శృంగారముగ వర్ణింపబడినవి. ధర్మభాగములో భార్యాభర్తలకు సంబంధించిన ధర్మజీవనమును సాంసారిక జీవనమును నడుపవలసిన విధానమును వర్ణించి వారి భోగమునకు సంబంధించిన శృంగార రసము నిందు చిత్రించినాడు. ఈ రెండు భాగములలోను నెచ్చటను గాని సంస్కృత గ్రంథము లనేకములో వలె

శృంగారరసమును పచ్చిచేయక భావముయొక్క సూక్ష్మసౌందర్యమును క్రొంగొత్తకళలతో వర్ణింపఁగలుగుట అతని అసమాన ప్రజ్ఞకు నిదర్శనము.

తిరువల్లువరునాయనారు జీవచరిత్రమును, వారు గ్రంథమును రచించి తమిళసంఘము లేక తమిళ పరిషత్తు దగ్గర పఠించుటకు పోయిన ప్రకారము, ఆకాశవాణియు తమిళ సంఘమును వారిని సన్మానించిన రీతియు, యుగయుగముల సంఘపండితులును కవీంద్రులును వారిని ప్రశంసించుచు వ్రాసిన పద్యములు మొదలగున వెల్లయును వాటంతట నవియే యొక సంపుటము కాఁగలవు. ఈ "తిరుక్కుఱళు" ఆరు సంపుటములును ముద్రించిన తరువాత నేడవ సంపుటముగా దానిని ముద్రించి ఆంధ్రుల కరపద్మములకు దానిని గూడ అర్పించగలవాడను.

"తిరుక్కుఱళు" శబ్దము యొక్క వ్యుత్పత్తిని గూర్చి కొంచెము చెప్పవలసియున్నది. తిరుశబ్దము శ్రీ శబ్దభవము - శ్రీ శబ్దము ఆంధ్ర భాషలో 'సిరి' యగునట్లే తమిళ భాషలో 'తిరు' అగును. తిరుమణి, తిరువీధి, తిరుపతి, తిరువల్లిక్కేణి, తిరువణ్ణామలై,తిరువల్లువరు మొదలగు పేరులలో నింకను యలరారుచున్నది. శ్రీ యనగా శుభప్రదమైన లేక దైవ సంబంధమయిన యని యర్థము. కుఱళనగా యించుమించు సూత్రమని యర్థము - విస్తారమగు అర్థమును భావమును నొక చిన్న వాక్యము లేక పద్యములో నిముడ్చబడినచో దానికి కుఱళు అని అర్థము -కుఱళుశబ్దమునకు వ్యుత్పత్తి యర్థము పొట్టిదైన" యని. అయినను తిరువల్లువరునాయనారు ఈ గ్రంథమును రచించిన నాటనుండియు ఆ శబ్దము ఈ గ్రంథమునకు మాత్రమే చెందుచు వచ్చినది. గీతయనగనె భగవద్గీత యగునట్లు, బైబిలు (అసలు అర్థము పుస్తకము అని) అనగనె క్రైస్తవమత గ్రంథమగు బైబిలు అగునట్లు, వేదము (అనగా చెప్పఁబడినదియని మొదటి యర్థము. మాట) అనగనె మన ఆర్యవేదములగునట్లు కుఱళు అనగనె వల్లువరిగారి కుఱళేయగుచున్నది.

ఇది యెల్లయును పద్యములలో వ్రాయఁబడిన కావ్యమైయున్నది. ప్రతి పద్యమును రెండేసి చరణములు గలది – అందులో మొదటి చరణము రెండవ దాని కన్న పొడుగైనది. తమిళు సాంప్రదాయ ప్రకారము యతితోనో

ప్రాసయతితోనో అది కూడుకొనియుండును, మొదటిచరణము నాలుగు గణములతోను రెండవచరణము సుమారు రెండున్నర గణములతోను కూడియుండును. తిరువల్లువరువారు ఈ గ్రంథము వ్రాసిన నాటి నుండియును ఆఛందస్సునకు కుఱళుఛందము అనుపేరు రూఢియైనది. తెలుగులో గూడ నేనును అట్లే గ్రంథమునెల్ల వ్రాసి ఆ ఛందస్సుకు గూడ కుఱళు అను శబ్దమునే ఉపయోగించుచు వచ్చితినని యీ గ్రంథమును పఠించెడి వారికి విశదము కాగలదు. అది స్త్రీలు మొదలగు వారు పాడుకొనుటకును పండితులు చదువుకొనుటకును గూడ వీలుగనుండును. అఱవ కుఱళుకు సామీప్యము గల ఛంద మింతకన్న వేరొక్కటి లేదు.

ఛందోబద్ధములగు చిన్న సూత్రములలో విస్తారమగు అర్థములను గూర్చి సూక్ష్మముగ నుపన్యసించిన కావ్యమేది యనిన తిరుక్కుఱళు అనియే చెప్పవలెను. ఆ మూడు పురుషార్థములను గూర్చియు సకల సమాచారమును నిందు క్రమనియమము తప్పిపోకుండ చెప్పబడియున్నది గనుకను, ఇందులో లేని సమాచారము మఱియొకదానిలో లేదని చెప్పబడుటచేతను ఇది మహోత్కృష్ట గ్రంథమని నిర్వచించుటకెట్టి యాటంకమును లేదు. ఇట్టి గ్రంథమును వ్రాయుటచేతనే కవిదైవముగ భావింపబడి దైవత్తిరువల్లువరు అని పిలువబడుచున్నాడు. అట్టి గ్రంథములో నెట్టిదైన లోపముగాని చెప్పబడని సమాచారముగాని యున్నదని మన మెంచితిమేని అది మన బుద్ధిలోపమును భాషాంతరకారుల లోపమును వ్యాఖ్యాతల లోపమును నగునుగాని కవిలోపము గాని గ్రంథముయొక్క లోపము గాని యెంత మాత్రమును కాదు. కనుక గ్రంథము యొక్క నిజమైన రహస్యమును మహత్వమును మనము గ్రహింపవలెననిన మహా మహుడగునొక వ్యాఖ్యాత సహాయము మనకత్యవసరమై యున్నది.

ఇట్టి మహోత్కృష్టమగు గ్రంథము మీద ననేకము వ్యాఖ్యానములు అఱవ భాషలో వెలసినవి. అవియన్నియును బండ్లను పట్టును, అయినను పరిమేలజగరు అనునొక బ్రాహ్మణపండితోత్తముడు, సంస్కృత విద్వాంసుడు, కాంచీపురవాస్తవ్యుడు క్రీ. వె. పదునొకండవ శతాబ్దములో దీనికొక చక్కని వ్యాఖ్యానమును వ్రాసెను. ఇతను తనకు పూర్వము వ్రాసిన నలుబదిమంది

వ్యాఖ్యాతలలోని తప్పుటభిప్రాయములను ఖండించి సరియైన వ్యాఖ్యానమును వ్రాసినాడు. అతని అభిప్రాయములను కాదను శక్తిగాని, యిట్టి వాఖ్యానముతో సరియగు వ్యాఖ్యానమును వ్రాయగల మహిమకాని తరువాతి వారి కెవరికిని లేకపోవుటచేత, దీని తరువాత "తిరుక్కుఱళు" మీద క్రొత్త వ్యాఖ్యానములు పుట్టుట మానివేసినవి. తిరువల్లువరు వారే తమ గ్రంథమును లోకులకు స్పష్టీకరించు నిమిత్తము పరిమేళజగరు యొక్క అవతారమునెత్తి ఈ వ్యాఖ్యానమును వ్రాసి పరమపదించిరని వాడుక. అయినను వీరి వ్యాఖ్యానము పండిత వ్యాఖ్యానమై మూలముకంటెఁగూడ కష్టమగు భాషలో వ్రాయఁబడి పండిత జనసుబోధకమై మాత్రమే వెలయుచున్నది. శంకరభాష్యముల వలె ఇదియును పాఠము చెప్పించుకొననిదే వశీకరణమగున దెంత మాత్రమును కాదు.

అయినను ఇట్టి వ్యాఖ్యాన మొకటి లేకున్నచో తిరుక్కుఱళు అగమ్యగోచరమై, పూర్వాపర సందర్భశూన్యముగ నోటికి వచ్చిన వివేకములనెల్ల నెవడో యొకధీమంతుడువచ్చి కూసిపోయినట్లువలె, నుండకమానదు. అయినను వీరువచ్చి తిరుక్కుఱళు లోని అధికారమునకు నధికారమునకును సూత్రమునకు సూత్రమునకును గల సంబంధమును చూపుకొనిపోయి అది ప్రత్యేక మొక సంకల్పముతో వ్రాయబడిన మహాకావ్యమని నచ్చజేసినాడు. కుఱళులను ముత్యములలోను, కెంపులలోను, పచ్చలలోను, నంతర్గమై వ్యాపించియున్న సూత్రమును మనకు చూపించి గ్రంథము నొక అద్భుతమగు నవలవలె పఠించి సారస్యముగ గ్రహింపజేసిన పరిమేలజగరుగారి ప్రతిభయే ప్రతిభ. వ్యాఖ్యానము చెప్పవలసిన సంగతులు వేనినిగాని విడువక, విడచిపెట్టవలసినవి చాదస్తముగ విస్తరించి చెప్పక, సమగ్రముగను, సూక్ష్మముగను, మహిమాబోధకమునై యలరారుచున్నది. నేను పఠించినంతవరకు ఆంగ్లేయులలో నెచ్చటను నిట్టి వ్యాఖ్యాతలేడు. సమస్తభాషలలోని వ్యాఖ్యాతలకును నిది యాదర్శ ప్రాయమని రూఢిగ చెప్పవచ్చును.

మొట్టమొదట మూలమొక్కటియే నేను భాషాంతరీకరించి యుండియు, యిట్టి వ్యాఖ్యానము యొక్క సహాయము లేకున్నచో, అది అసమగ్రముగను, అబోధకముగను, దుర్గ్రాహ్యముగను నుండునని యెంచి దానిని కూడ

భాషాంతరీకరించినాను. ఆమూలమున కీ మూలమును, ఆ వ్యాఖ్యానమున కీ వ్యాఖ్యానమును భాషాంతరీకరణములైనచో, ఆ మూలమున కీమూల మెంత సరియైనదై యుండవలెనో పండితులు గ్రహించియుండకపోరు. ఇట్టి ప్రఖ్యాత కావ్యములను భాషాంతరీకరించునెడల మూలమునకు సరిగనుండుట మొదటి యావశ్యకతయు జాతీయతయు సౌందర్యమును చెడకుండుట రెండవ లక్షణముగ మాత్రమేయై యుండవలయుననియు, పెక్కురి విశ్వాసమును నా విశ్వాసమునునై యుండుట చేత నట్లే యొనరించినాను. మూలము పెక్కుచోటుల క్లిష్టముగ నుండినను వ్యాఖ్యానమును బట్టియే దానిని పూర్తిచేసుకొనవలెను. గంభీరార్థములను సూక్ష్మసూత్రములలో నిమిడ్చెడి ప్రతి కావ్యమునకును నిది తప్పనిసరి. అఱవములోని వల్లువరువారి గ్రంథమునకును నిట్లే - దీనికిని నిట్లే కాకమానదు.

ఒక్కొక్క కుఱళులోని భావమతి విస్తారమై, ఆ చిన్న ఛందస్సులో నిముడక యిడుమలు పడుచు పాఠకునికి ఊహ్యము మాత్రమేయగుచు సామాన్యులకు "ఇంకను విపులముచేసి చెప్పిన నెంతయో బాగుండును గదా!" యనిపించుచుండును. ద్రవిడదేశ గ్రంథములలో నిది ప్రప్రధానమైన దనియు ముందే చెప్పియుంటిమి. ధర్మజిజ్ఞాసకులెల్లరును ధర్మ భాగమును దినదినమును పారాయణము నొనర్చుచుందురు. రాజులెల్లరును నర్థభాగమును చెప్పించుకొని దానిలో శిక్షితులగుదురు. మంత్రులు మొదలగు వారికదియే యాదర్శము. శృంగార రసాభిలాషులు కామభాగమును పఠించుచు మైమఱచిపోవుదురు. ఈ కారణము చేత అనేక రాజులు తమకు తమకై ప్రత్యేకము ప్రత్యేకముగ నీ సూత్రములను పండిత కవీంద్రులచే విపులీకరము చేయిపించుకొని పఠించుకొని ఆనందించుచుండెడివారు. మన ఆంధ్ర దేశమున నవీన కవిత్వపు పోకడలలో మున్ముందు త్రోవలు తీసిన రాయప్రోలు సుబ్బారావుగారు దీనిని విని ఒక్కొక్క సూత్రమును ప్రత్యేకముగా పెద్ద పెద్ద ఉత్పలమాలలు మొదలగు పద్యములలోనికి విపులము చేసి వ్రాయవలసిన ఆవశ్యకతయున్నదని వక్కాణించి, గ్రంథ మచ్చుపడి తమకు పంపించగానే తామట్లు విపులము చేసి వ్రాతుమని చెప్పియున్నారు. అఱవభాషలో నట్లు చేసికొనినారు. ఈ గ్రంథమహత్వమును గుర్తెరింగి తమ తమ భాషలోనికి తర్జుమా చేసుకొనిన ఆంగ్లేయులు, పరాసులు, గ్రీకులు, లేటినులు, జర్మనులు,

ఇటాలియనులు మొదలగు పాశ్చాత్యజాతుల వారెల్లరును నట్లే పద్యములలోనికిని గద్యములలోనికిని విపులము చేసుకొనినారు. రాయప్రోలు సుబ్బారావుగారు తలచినట్లుచేసినచో, ఇది నిజముగా వ్యాఖ్యానము కాకుండానే చాలా పెద్ద గ్రంథమై, వ్యాఖ్యాన సహాయము లేకుండానే సుబోధకమగుచు నలరారకమానదు.

ఒక విధముగా జూచినయెడల తమిళు తిరుక్కురళుకంటె ఇది మన ఆంధ్రుల కెక్కువ ప్రయోజనకారియని చెప్పకతీరదు. తమిళు తిరుక్కుఱళు పురాతన భాషారచితమై వ్యాఖ్యానము కూడ కఠినశబ్దజాలసముపేతమై పండితజనంబులకు మాత్రమే తప్ప సామాన్యులకు దుర్గ్రాహ్యమై యొప్పుచుండును. ఇది యన్ననో నట్లుకాక బహుజనులకు సుబోధకమగు సామాన్య భాషలో రచింపబడినది. అట్లనుట వలన నిదికేవల వ్యవహారిక భాషయని కాదు. ఈ గ్రంథమును గ్రహించుటకు విస్తారమగు పాండిత్య మేమియు నవసరము లేదు. సామాన్యముగా మన నవలలు నాటకములు చదువుకొనుటకును పత్రికా పఠనమునకును నెంతజ్ఞాన మవసరమో యంతజ్ఞానము దీనిని గ్రహించుటకు గూడ జాలును. అంతకన్న గూడ పేలవము జేయుట నాకు సాధ్యమును గాదు నాతలంపును గాదు. బాగుగా పరిశీలించినచో స్త్రీల పాటలు కంటెను ఏలపదములకంటెను గూడ నెక్కువ కాఠిన్యమిందులో లేదు. నేను మహాపండితుడను కాకుండుట సామాన్య జనుల కొక విధమగు నుపకారమే. ఇది చదువుకొనుటకు గూడ తగినంత భాషాజ్ఞాన మాంధ్రసామాన్య పాఠకునకు లేదన్నచో ఆంధ్ర జాతికే యది కళంకమనక తీరదు.

కుఱళులలో మాత్ర మన్వయ కాఠిన్యమును సంధుల కలయికలును అపరూప పదముల ప్రయోగములును లేవని నేను చెప్పను. కాని ద్రవిడ మూలమున కిది సరియైన తర్జుమాగా నుండి సాధ్యమైనంతవరకు ఆ వ్యాఖ్యానమునకివి అతుకుకొని యుండవలెనని నే నామాత్రము యిబ్బందులు పడక తీరదు, ఆంధ్రుల నామాత్రము కష్టపెట్టకతీరదు. వ్యాఖ్యాన మా కష్టముల ననేకములను పటాపంచలు చేసి మనోహరముగ జేయకమానదు. గ్రంథము కష్టముగనున్నదని భావించువారు కూడ తమిళకుఱళు తమిళులకు కన్న ఆంధ్రకుఱళు ఆంధ్రులకు ఎక్కువ అందుబడిలో నున్నదని గ్రహించి

సంతోషించక మానరని నమ్ముచున్నాను.

ధర్మార్థ భాగములలో నున్న అనేకము సంగతులు మన దేశీయులకెంత మాత్రమును క్రొత్తవి కావు. సంస్కృత సాహిత్యమునందు అంతర్గతములై యుండి ఆంధ్ర పండితుల వలన నాంధ్ర గ్రంథముల ద్వారానూ ఇతర విధములను మన దేశీయుల విజ్ఞానమునకు పరిచితములయియే యున్నవి. అయినను ముఖే ముఖే సరస్వతి యనునట్లు ఒకే ధర్మము ప్రత్యేకప్రత్యేక కవీశ్వరుల లేఖినులనుండియు ప్రవక్తల వాక్కులనుండియు బహిర్గత మగునప్పు డొక్కొక్క విధమగు క్రొత్తతనమును నాజూకును మనకు గోచరమగుచుండును. అట్టి సౌందర్యమీ భాగములలో నెల్ల విదితమగుచునే యున్నదని మా విశ్వాసము.

ఇదియును కాక మన విజ్ఞానము నెల్ల సంస్కృత భాషలో మూసిపెట్టి రాజుగారికోటలోని ధనమువలె సామాన్యజనుల కందుబాటులో లేని దుస్థితిని మన పండితులు కల్పించినారని మన దేశములో ననేకులు ఫిర్యాదు చేయుచున్నారు. ధర్మార్థములకు సంబంధించిన సమస్త సంస్కృతజ్ఞానమును నేదో యొక సందర్భమున నీరెండు భాగములలోను ఫొక్కుగా విరజల్లబడియే యున్నది. మనమించుక కష్టపడి దానిని సేకరించుకొనుటయే తరవాయి. సంస్కృతములోనుంచి వలెనే సంపాదించుకొనుటకు కష్టమైనచో అది మహాజ్ఞానమని మన మంగీకరించియే యుందుము. మిక్కిలి తేటతెలుగుగా జేయబడుటయే దానిలోని జ్ఞానము యొక్క ఔన్నత్యమును ఉచ్చత్వమును మనము బాగుగ నూహించుకొనేటట్లు చేయునేమో అని మాకనుమానముగ గూడా నున్నది. కామ భాగములోని విజ్ఞానము కేవలము ద్రవిడ విజ్ఞానమనియే మనమొప్పుకొనవలెను. ఏలనన దానికిని ఆర్యశృంగార ప్రకరణములకును గల విభేదమట్టిది. ఈ కారణము చేత నిదియొక రీతి భారతవిజ్ఞాన సర్వస్వమని మన మంగీకరించవలెను. ఇట్టి విజ్ఞాన సర్వస్వమగు గ్రంథ రత్నమును, నాయోపినంతమట్టుకు శక్తితో నాయెను. భాషాంతరీకరించి నందుకు నాకొకరీతి ఆనందములేకపోలేదు. ఇట్లే ఆంధ్రులెల్లరికిఁగూడ నీ గ్రంథము వలన నిట్టి యానందమును నేనొనగూర్చ గలుగుదునేని ధన్యుడను.

శ్రీమంతులగు ఆంగ్లేయాధికారి వర్గమువారు నాకు దీర్ఘ కారాగార

కఠినశిక్ష విధించియు చివరి సంవత్సర భాగములో విడిఖైదీని చేసి పుస్తకములను వ్రాతపరికరములను తెప్పించు కొననిచ్చి నాకీ సనాతన భాషను మాత్రమే కాక మఱికొన్ని భాషలను గూడ నేర్చుకొనగల మహాభాగ్యమును కల్పించినారు. హాలస్యమయ్యరు గారును, ఎ.యన్. కృష్ణస్వామి అయ్యంగారును నాకు తమిళ భాషను నేర్పి వారి యుత్కృష్టగ్రంథములను గ్రహించి భాషను గ్రహించి తెలుగులోనికి భాషాంతరీకరణము చేయగల సామర్థ్యమునొసంగినారు. విక్రమదేవవర్మగారు ప్రభల లక్ష్మీనరసింహం పంతులుగారు మారేపల్లి రామచంద్రశాస్త్రికవి గారు రావుబహదూరు తాడేపల్లి వెంకటక్రిష్ణయ్యగారు మొదలగు విద్వత్శిఖామణులు దీనిని విని (నాయల్ప పాండిత్యము వలననేమి భాషాంతరీకరణ సందర్భముననేమి యుండకతీరని పెక్కు నలుసులున్న ప్పటికిని) గ్రంథము యొక్క మహోత్కృష్టతను గూర్చియు నేను పడియుండిన శ్రమను గూర్చియు ప్రశంసించి దీనిని తెలుగుచేయుటలో నేను భాషకు చేసిన క్రొత్త సేవను గూర్చి యుత్సాహ వాక్యములను పలికి అచ్చు వేయించవలసినదేయని యంగీకరించినారు. భోగరాజు పట్టాభి సీతారామయ్య గారు బందరు పెద్దలు కొందరకు నన్ను పరిచయము పరచి పోషకులను చేర్పించి యీ భాగమునకు సరిపడు ద్రవ్యమును జతపరచినారు. నడింపల్లి నరసింహారావు గారు మొదలగు నితరుల సహాయమున కొంతమంది చందాదారులు చేరినారు. శ్రీయుత రావూరి శ్రీశైలపతి గారును శ్రీయుత దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వర రావు పంతులుగారును శాశ్వత రాజపోషకులుగ జేరినారు. ఇట్లు నాముఖమును జూచియేమి నా గ్రంథమును ముఖమును జూచియేమి నాకును నా గ్రంథమాలకును నొకేసారిగ సహాయము చేయుచున్నారని చెప్పకతప్పదు. ఇంకను పెక్కుఱు చందాదారులుగను పోషకులుగను చేరనిచో భాషకును దేశమునకును (కాదననేల నాకును) నభివృద్ధికరమగు ఈయుద్యమము నెరవేరజాలదని ఉదారశీలురును విద్యాభిమానులునునగు దేశభక్తులెల్లరును గ్రహించియే యుందురు. ఈ కాలములో సద్గ్రంథరచనము ప్రచురణము, విక్రయము మొదలగునవి యెల్లయు యెంత కష్ట సాధ్యములైనవో ఆంధ్రులెల్లరును గ్రహించవలసియున్నది. నేనింకను భాషయందుగల అభిమానముచే దేవులాడుచు దానికి ద్రోహమొనర్తు నేమో యను పాతకమునకు వెఱచి తదేకదీక్షతో దానియందు కొట్టుకొను

చున్నాను గాని ఇంతకన్న ధనలాభప్రదములగు వ్యవసాయములను ఉద్యోగము లను చేయనేరక కాదని విజ్ఞానులు గ్రహించవలెను. "వ్యవసాయము చేసుకొన గూడదా? ఉద్యోగములు స్వీకరింపగూడదా? ఉదారుల ఉదారత నెన్నాళ్ళిట్లు పీడించుచు ఈ సోమరివృత్తికై గడంగెదవు. గాంధిమహాత్ముడు ఒడలు వంచి పనిచేయమన్నాడు? గాని యిట్లు పుస్తకముల పేరిట యాచించు కొనుమన్నాడా? ఈ కాలములో డబ్బు తెమ్మంటే గ్రంథము లెవ్వరికి గావలయు?" నని డెప్పిపొడచెడి మహనీయులకిది సమాధానముగ చెప్పవలసి వచ్చినందుకు క్షమింతురుగాక.

"బ్రతుకు వారలు దున్ని బ్రతుకువారలు; పెఱలు
బ్రతుకుదురు వారి నతుకుకొని"

యని మాతిరువల్లువరు నాయనారే యీ గ్రంథము నందు వచించి యున్నారు. నిజముగా నీపుడమిపై బ్రతుకవలసిన యోగ్యరీతిని బ్రతుకువారు వ్యవసాయవృత్తిచే బ్రతుకువారే. తక్కినవారిలో కొందరు వారికి సహాయ కరములగు నితర వృత్తులలోను కొందరు వారిని గురించి లాభము గ్రహించెడి యితర వృత్తులలోను కొట్టుకొనుచు వారు పండించిన యన్నమునే తినుచు ప్రత్యక్షముగ గాకున్న పరోక్షముగనైనను వారిపై నాధారముపడి బ్రతుకు చున్నవారే. ఈ కారణము చేతనే ఆ కవీశ్వరుడే,

"ఆణికృషికుడులోక • మంతకు ఆతడె ప్రోవఁ
బూనె పెరవృత్తివారలను"

అనగా "లోకమనెడి రథమునకు అతనే శీలవంటి వాడు. అతను తన్నుఁదాను పోషించుకొనుటయే కాక తన వృత్తికాని పెరవృత్తికిఁ బూనుకొనిన వారినందరిని గూడ బ్రోచుటకు కంకణము కట్టుకొనినాడు". అని వచించినాడు. అట్టి సర్వోత్తమమగు వృత్తికిపోవుటకంటె నాకు శాశ్వతానందదాయకమగు సంగతి వేఱొక్కటిలేదు. అయినను, అట్టి వృత్తిలోనికిఁ బోవుటఁకు గూడ సర్కారువారి కృపాకటాక్షము వలన సగము వరకు ప్రారంభించిన యీ ధర్మోద్యమమును విసర్జించినచో, నాకు క్షమాపణముండదనే విశ్వాసముతోనే కష్టములకును, నవమాసములకును డెప్పిపోటులకును గూడ వెనుకతగ్గక,

అయిష్టులుగ నుండెడి అనేకులు శ్రీమంతుల అనంత సంపదలపై, చిన్నదైనను ఈ తప్పునిభారమును వైచుటకు సాహసించుచున్నాను. నాలుగైదు వేల రూపాయిలు పోగుకానిదే యీ గ్రంథములు ముద్రణాలయముల నుండి బయటకి రావు. ఈ సహాయము నాకెంత వేగిరము చేకూఱిచినచో నన్నంత వేగ మీసదుద్యమమునుంచి ముక్తుని చేసి భారము తగ్గించి విశ్రాంతి ప్రసాదించిన కీర్తి యాంధ్ర లోకమునకుఁ జెందును. అంతవఱకు నొంటరిగా ఈ యద్యమమును బూని తేనెటీగవలె సొమ్ము కూడపెట్టుకొనుచు, మధ్యంతరములో దానిలో నుంచి నాకును కాక గ్రంథములకును గాక రైళ్ళు హోటలు మొదలగు అగుపించరాని శుష్క ఖర్చుల క్రింద కొంత జారిపోవుచు, రెండేండ్లలో తీరవలసినది పదేండ్లకైనను తీరునో తెలియక, నాలుగువేలలో తీరునది పదివేలతో గాని ముగియక, అంతయును పూర్తికాక సగములో నాగిపోయినచో కార్యముకొనసాగించలేకపోయిన కళంకమునకు ధనమును దుర్వ్యయము చేసిన అపదూఱునకును నెలవయ్యె క్రుంగవలసిన అగత్యము నాకు కలుగును. ఏది యెట్లయినను కార్యము కొనసాగించనిదే విరమించవలెనను నుద్దేశ్యము లేదనియు, అంతవరకు పుస్తకములకు వారు భావించురీతిని నెక్కువ ఖరీదులు పెట్టుచున్నను పోషక రాజపోషక విరాళములు కోరుచున్నను, నేను పొందుచుండు కఠిన దూషణములకు బదులుగా నప్పుడప్పుడిట్టి మృదులములగు సమాధానముల నిచ్చుచున్న క్షమింపవలసిన ధర్మమాంధ్రి పూజ్యులెల్లరి పై నున్నదని మనవి చేయుచు, యిదివరకు సహాయము చేసిన వారికి వందనశతము లర్పించుచు, వారిని నితరులను గూడ ఇక ముందు కూడ ఇంతకన్న నెక్కువగా చేయుచుండ వలయునని ప్రార్థింపుచు, నేను చేసిన యపరాధమునకు క్షమింపవలయునని ఈశ్వరుని గూడ వేడుకొనుచు విరమించుచున్నాను.

అర్థత్రయ సర్వస్వము

*('తిరుక్కురళ్ కావ్యానికి మున్నుడి) 1926.*

# క్రొత్త అనుశాసనము

ఆంధ్ర భాషలో గద్యము యొక్క ఆవశ్యకతయూ ప్రచారమునూ మిక్కిలి హెచ్చుచున్నది. ఆంధ్రశబ్దచింతామణి మొదలగు వ్యాకరణములు పద్య కవిత్వములో నుపయోగింప వలసిన ప్రయోగములను మాత్రమే విశదీకరించి చెప్పునుగాని భాషా శాస్త్రమును గూర్చి గాని మామూలు గద్యమునకు సరిపోయెడి పదములు వాక్యములు సంధులు మొదలగు వానిని గూర్చి కాని అధికముగా చెప్పవు. పద్య గద్యములకు పొదుపుగా ఒక్కటే వ్యాకరణము చాలునని వారు తలచిరేమో! పురాణాదులలో వ్రాయబడెడి వచనములట్లే వ్రాయబడెడివి. కాని మామూలు వచనములు, వ్యాఖ్యానములు, కథలు, శాసనములు మొదలగునవి అట్టి భాషలో వ్రాయబడలేదనుట సువిదితము. సుప్రసిద్ధ వ్యాకరణలక్షణ విరుద్ధమగు నట్టియు, మామూలు మన శిష్ట వ్యవహార భాషకు సన్నిహితమగు నట్టియు భాషలో ఆగ్రంథాదులు వ్రాయబడు చుండెడివి. ఇట్లు వ్రాయబడిన గ్రంథము లెంత మాత్రమును కొంచెము కావు. అట్లయినను వీటికి వేఱే యొక లక్షణము వ్రాయకుండుట బట్టి అవి పద్య భాషలో వ్రాయబడ నక్కరలేదనియు, దానికి విరుద్ధమైన భాషకు ప్రత్యేక లక్షణమంటూ ఉండవలసిన ఆవశ్యకత యొకటి లేదనియు వారు తలంచిరని మన మూహించుకోవలెను.

కేవల గద్య కావ్యములును, సులభ గ్రాహ్యములగు ప్రసంగములు, కథలు, వింతలు, వ్యాసములును, ఈ యుగములో హెచ్చుఁ జొచ్చి నప్పటినుండియు, ఆవ్యాకరణములు వీటి అభివృద్ధికి సరిపడవనియు, వీటి కనుకూలమగు వేఱే వ్యాకరణము వ్రాయనిచో పూర్వ వ్యాకరణ సూత్రబంధితమై గద్యరచన పెరుగకుండుట కాని, నియమరహితమై పేలవమగుట కాని తటస్థించుననియు తలంచి గద్యమునకు వేఱే వ్యాకరణము వ్రాయవలసిన ఆవశ్యకత యున్నదని శ్రీ వీరేశలింగం పంతులుగారే గ్రహించిరి. ఇట్టి భావము నానాటికి ఆంధ్ర గద్యకారులలోను, భాషా పరిణామ శాస్త్రజ్ఞులలోను, వ్యవహారిక ప్రయోగములను సుందరముగా తమ పద్య కావ్యములలోనే జొప్పించిన పూర్వ విఖ్యాత కవీంద్రుల గ్రంథములను పఠించెడి వారిలోను

హెచ్చు జొచ్చినవి. ఇట్టి భావములు పాడమునట్లును అభివృద్ధి యగునట్లును చేసిన శ్రీ గిడుగు రామమూర్తి పంతులు గారి సిద్ధాంతములు, తర్కములు, ప్రచురణములు, ప్రయత్నములును మిక్కిలి శ్లాఘ్యములనుటలో సందేహము లేదు.

గద్య గ్రంథ భాష ఎంతవరకు కేవలము వాడుక భాషగానే నుండవలెను. ఎంత వరకు దానికి సన్నిహితమై యుండవలెను. ఎంతవరకు దాని కీషద తీతమై యుండి "కృతకము" గా ఉండవలెను అను సమస్యలకు విద్వాంసులు వారి వారి అభిరుచులకు తగినట్లు అభిప్రాయ భేదములను కలిగియున్నారు. గ్రంథకర్తలును అట్లే వివిధ శైలులలో వ్రాయుచున్నారు. కాని ఎంతవరకో కొంతవరకు కేవలము వాడుక భాషకు కొంచెమతీతమై యుండవలెననియు, ఎంతవరకో కొంతవరకు కొంచెము సన్నిహితమై యుండవలెననియు, ఇంచుమించుగా అందరును అంగీకరించుచున్నారు. ఇందుకై చేయవలసిన భగీరథ ప్రయత్నము కూడా విస్తారమేమీ లేదు. కొన్ని మాండలికములు కొన్ని దేశ్యములు, కొన్ని అవ్యయములు, సంధులు, విసంధులు సముచ్చయములు పేరు మోసిన గ్రంథములో నున్న వాటిని కొన్నింటిని, లేకుండానే శిష్ట వ్యవహారములో ఉండే వాటిని కొన్నింటిని, వైకల్పికముగానో బహుళముగానో ఆధునిక గద్యములో ప్రయోగింపవచ్చునని అన్ని మండలముల లోని పెద్దలును గలసి ఒక తీర్మానమునకు వచ్చుటయే. దీనికి కావలసిన దంతయు పెద్దలు కొందరు కొంతవరకు తమ అహంకారములను మాను కొనుటయు, కొంతవరకు తమ ప్రతికక్షులను కొనబడు వారి యభిప్రాయముల పట్ల కొంత సహనము చూపుటయూ మాత్రమే. తప్పు అరసున్నలు తప్పు బండిఱాలు ప్రయోగింపకుండా సరియైనవి మాత్రమే ప్రయోగించవచ్చును. మానితే మానవచ్చును అన్న షరతుకు వ్యవహారిక భాషావాదులొప్పుకొనవలెను. తప్పుని ప్రయోగించితేనే కృతకము కాని సరియైనవి ప్రయోగించుట కృతకము కాదు. ఇప్పటి గ్రాంథిక భాషావాదులను కొనఁబడువారు కూడ అఱసున్నలు బండిఱాలు మేము విడువమని చెప్పుదురు మాత్రమే కాని తప్పుగా ప్రయోగించుతామని అనరు గదా! ఈ సరియైన వైనను విధిగా ప్రయోగించుతామని వారిలో కొందరు తర్కకౌశల్యము కొరకు వాదింతురే కాని వ్రాత సమయమున పాటింపలేదని వారి గ్రంథములు చదివిన వారికి

గోచరము కాగలదు. కొన్ని సంధులను సముచ్ఛయరూపకమగు నుగాగమ మును సందర్భానుసారముగా వారును విడుచుచునే యున్నారు. ఇంతవరకు వారు తొల్లింటి కట్టుబాట్లను తెలిసియో, తెలియకయో కోరియో కోరకయో మీఱుచు వ్యావహారిక వాదమునకు సమీపముగా వచ్చుచు, సొపుగా చదువబడుచు వంద్యులగుచున్నారు.

వ్యావహారిక భాషావాదులు పై వాని కొప్పుకొనుచునేయున్నారు. ఇట్లు వ్యావహారిక ప్రయోగములను చేయుటయే చాలునని వారు సంతసింపవలెను గాని గ్రాంథిక ప్రయోగములను చేయనే రాదని పట్టు పట్టుట యవివేకము. వాడుక భాషలో కూడ రెండు వాడుక భాషలున్నవేమో! సరీగా మనము మాటలాడే వాడుక భాషనే మనము ఉత్తర ప్రత్యుత్తరములలో వాడము. సరిగా ఉత్తర ప్రత్యుత్తరముల భాషనే గ్రాంథిక భాషాభిమానులు గ్రంథములలో వ్రాయరు. వీటి కన్నింటికిని భేదములు బ్రహ్మాండ మంతవి కాకుండ దగ్గర దగ్గరవిగా ఉంటే చాలును. అందుచేత సుబోధక సుందర వ్యవహారిక శైలి పై మూడింటి లక్షణములతోను చెన్నలలరారవలెను ఇంత వరకు తెలుగులో వ్రాయబడిన గ్రంథములు చదివి, వ్యాకరణములు చూచి వ్యాసములు మొదలైనవి వ్రాయుట కలవాటుపడిన వారి శైలి నెట్టి వాదము తీసుకొని వచ్చి కాని అప్రమాణమని త్రోసివేయజాలము. అట్టి వారిలో నుండి తప్పు ప్రయోగములుంటే తీసివేయవలెను. తప్పు ప్రయోగములు గ్రాంథిక వ్యావహారికములకు రెండింటికిని కూడినవి. తెలుగులో ఏదైనా వ్రాతాము, నలుగురు మనము వ్రాసినది చదవాలి అని అభిలషించే వారందరూ ఆ మాత్రము పునాది లోటి అయినా రాకుంటే నోటికి వచ్చే అశ్లీలముల దగ్గర నుంచీ గ్రంథస్థములై లక్షణములను కోరవలసిన గతి పట్టుతుంది. వ్యావహారికవాదులైననూ నిరక్షరకుక్షుల యొక్కయు, గ్రంథములు చదువని వారి యొక్కయు, రచన గాని, శైలి గాని అలవడని వారి యొక్కయు నోళ్ళకు వచ్చే ధోరణులు సర్వమూ గ్రంథస్థములు కావలెనని కోరరు గదా! అట్లుకోరినచో దానికి శిష్టత్వ మేర్పడదు. కనుక వారి వాదనకీ అది భంగకరమగును. ఉభయభాషా సిద్ధాంతులకును పొదుపైన ఒక శైలి యేర్పడవలెనన్న ప్రస్తుతపు ప్రసిద్ధ గ్రంథ కర్తలని పేరుమోసిన లక్ష్మీనరసింహం గారు, వీరేశలింగం గారు, కవిరాజుగారు, పానుగంటివారు, తిరపతివారు మొదలగు

వారి యొక్క గద్య రచనలలోని శైలికి సంబంధములేని శైలిని ఒక దానిని తెచ్చి పెట్టగోరిన ప్రయోజనము లేదు. గ్రాంథికమో గంథికమో దాని కొక శైలి యనే పేరు, దానితో అనేక గ్రంథముల వ్రాత, అనేకులు పండిత పామరుల కవి సుబోధకములై చదువుకోవడం, ప్రౌఢకవులు ప్రౌఢ గ్రంథ కర్తలే కాకుండా క్రొత్తగా లేచుచున్న బాలకవులు బాలవ్యాసకర్తలు కూడా దానిలో ఇంచుమించుగా వ్రాయగలగడం చేస్తే, దానిని పిలకట్టుకొని యీడ్చి వేయడము అంత సులభము కాదనిన్నీ అట్లు యీడ్చి వేయవలసినంత మహాపరాదమేమి అది చేపట్టలేదనిన్నీ అందరికీ సుబోధకము కాగలదు. వారు చేసిన అపరాధమంతా ఒక్కటే. ప్రజల భాషలోని యింపితములగు ప్రయోగములకు, అనగా శిష్ట భాషకు, మన పూర్వ గద్యకారులందరూ చోటిచ్చి యుండగా, చిన్నయ్యసూరి గారి దగ్గర నుండి తరువాత వారెవ్వరూ దానికి తగిన స్వాగత మీయక అశ్లీలము క్రింద త్రోసి పారవేయబూనినారు. అదియును వారికి సాధ్యము కాలేదు. వారికిష్టము లేకున్నా వారికి తెలియకుండానే ఇవి కొన్ని వారి వ్రాతలలో తగిన స్థలములు వెతికి చూచుకొని కూర్చున్నవి. అవి అన్నీ దిద్దుకోవడానికి కొందరు ప్రముఖులు గడగడము అవివేకము. వాటి కస్పృశ్యతా దోషము నారోపించి మెడపట్టి గెంటివేయడము మన భాషా సాంప్రదాయమునకు విరుద్ధము. పైగా వారి కర్తవ్యమో అంతకు విరోధమై సవ్యమైనది. అది యేదనగా వాటికిని వాటి వంటి ఇతర వ్యావహారికములకును అనుశాసనము చేసి గ్రంథ భాషకును శిష్ట వ్యవహార భాషకును పొత్తు గూర్చి శైలిని సజీవము చేయుట, వ్యావహారిక వాదులు తమ శిష్ట ప్రయోగములకు వర్తమాన రచనల యందును శైలి యందును తావు దొరకవలె ననియే ఆందోళనము చేయవలెను గాని యేభై సంవత్సరముల నుంచి ఆయెను పండింత గ్రంథకర్తలును, బహుజనులచే చదివి ఆనందింపబడు వారును అగు వారల కలవాటయిన శైలిని సమూలముగా ఒకసారి నిర్మూలము చేయవలెనని కోరుట అసాధ్యపు కోరిక. అనర్థము కూడా నేమో తెలియదు. అది అలవాటై, నిర్దుష్టమైతే, ఇది వ్యాప్తమై మనోహరమైతే రెండునూ చెట్టాపట్టాలు పట్టి తిరుగుతూ ఒక్కటి కావడానికేమీ అభ్యంతరం లేదు. ఉండకూడదు. మన హరికథలు, వీధి నాటకాలు, తోలుబొమ్మలాటలు, జానపదములు, స్త్రీల పాటలు, వేదాంత తత్వములు మొదలగు వానిలోని

భాషలో గ్రాంథిక వ్యవహారికములకు మధ్యన ఎటువంటి యేళ్లు కాని సముద్రాలు లేవు. రెండు రెండుగా వుండక ఒక్కటిగా వుండి పండిత పామరజన సుబోధకములై అందంగా వుండేవి. రెండింటిని వేఱు చెయ్యడం రెండవదానిని ఆంక్ష పెట్టడం క్రొత్త శిష్టులు ప్రారంభించిన పద్ధతి. దీని పైనే రామమూర్తి పంతులు గారు జెండా యెత్తి నారనిన్నీ దీనిని తొలగించుటకును రెండింటికిని పొత్తుకూర్చుటకునే వీరేశలింగము నాటి నుండి నేటి వరకు వచ్చుచున్న గ్రాంథికవాదులయ్యు సంస్కార ప్రియులెల్లరు అభిప్రాయ పడుచున్నారనిన్ని నాతలంపు. ఇట్లయినచో ఇరువురయుచెలిమి కూడుట కష్టము కాదు.

శిష్ట గ్రాంధిక శైలి మీదకు కూడ తిరుగబడి దానిని నిర్మూలము చేయగోరుట వ్యావహారిక వాదులకు సముచితము కాదు. మనదేశములో అనుశ్రుతముగా వచ్చుచున్న సామాన్య జనుల సాహిత్యము కూడా అట్టి కార్యమునకై గడంగక దానికి తగిన గౌరవము చూపుచు వచ్చినది. అందేమాత్రమును తప్పు కాని సంప్రదాయవైరుధ్యము కాని లేదు. వ్యావహారిక వాదులు మరి కొన్ని వాడుకపదములనూ ప్రయోగములనూ శిష్ట గ్రాంథిక రచనలలోకి చేర్చుకోవలసినదని వాటి కనుశాసనము చేయవలసినదాన్ని కోరుచున్నారు. అనుశాసనము చేసినంత మాత్రమున వాటినే తప్ప గ్రాంథికములను వ్రాయనే కూడదను సిద్ధాంత మేర్పడునని వారి యుద్దేశ్యము గాని నాయుద్దేశ్యము గాని కాదు. అవి అలవాటయినవారు వాటినే వ్రాతురు. ఇవి బాగుంటాయి అని తోచిన వారు వీటి నుపయోగించవచ్చును. ఇవి రెండునూ కలసిమెలసియే యుండవచ్చును. అట్లున్నచో ఒకటి నొకటి వెక్కిరించు నట్లుండునని ఆక్షేపించి అటువైపునకో ఇటువైపునకో కోరి దిద్దుకొనుటకు ప్రయత్నించడం నా కంత శ్లాఘ్యముగా తోచలేదు. ఈ విశ్వాసముతోనే నా రచనలనన్నింటిని నేను సాగించుచున్నాను. ఇట్లు చేయుటవలన నేనిరువురి హేళనలకూ పాత్రుడ నగుచున్నానని యెరుగుదును. అయినను నా విశ్వాసము నుండి తప్పుకొనుటకు నాకు సాధ్యమును కాకున్నది, అవసరమును తోచకున్నది.

నే నెన్ని సారులు చర్చచేసి యాలోచించినను ఈ రెండింటిని

సందర్భానుసారముగా సమ్మేళనము చేయుట తప్ప మన భాషాభివృద్ధికి వేరు మార్గము నాకు తోచకున్నది. కనుక వుభయపక్షములలోని పెద్దలకును నానమస్కృతులొనరించి వుభయుల సిద్ధాంతములను సౌందర్యములను నా మనస్సునకు పట్టించుకొని, ఈ సమ్యగ్దృష్టితో నొక శైలి నేర్పాటు చేసుకొని వ్రాయగడంగుచున్నందుకు పెద్దలు క్షమింతురు గాక! తారతమ్యములు కలవన్న మాటకాని గద్యకారులెల్లరు నిట్లే యొనరించుచున్నారు. నేనును నా కలవడిన జ్ఞానాభిమానములతో నట్లే యొనరించుచున్నాను. ఇట్లు చేయుట వలన వాడుక భాషకును గ్రంథ భాషకును సన్నిహితమూ యేర్పడును. ఒక క్రొత్త రీతి సౌందర్యమూ చేకూరును. వచనరచనాకౌశల్యమున కిది యేర్పడక తీరదని, క్రొత్త పద్ధతి యని యెల్లరు నంగీకరింతురని నమ్ముచున్నాను. ఇంతకు ప్రస్తుత వచన రచయితలు అందరు నిట్లే యొనరించుచున్నారు.

ఇందుకు తగినట్లే అనుశాసన మొకటి యేర్పాటు కావలెను. అనుశాసనములకు సరిపడునట్లు రచనలైన నుండవలెను. రచనలకు సరిపడునట్లు అనుశాసనములైన మాఱవలెను. తొల్లింటి అనుశాసనములకు విధేయముగ రచనలు సంపూర్ణముగా నుండుటకు వీలు లేకున్నవి. ఉండకున్నవి, మార్పు కావలెననుట కిది సూచన. పెక్కుఱు కావలెనని కూడా అనుచున్నారు. ఇట్టి సందర్భములో అనుశాసనములను దిద్దుటే కొంత మంచి. ఇట్లు కాలానుసారముగా మన పూర్వులు మార్చుకొనుచుండిరి. మార్చుకొనుట మన హక్కు. మన మేల మార్చుకొనరాదు!

ఈ శాసనపు మార్పు కూడ ఒక పెద్ద భాషా విప్లవ మనంబడదు. పెద్ద పెద్ద గ్రంథకర్తలును అనుశాసకులును అంగీకరించిన వాటిని కూడ మనము కాదనుట మన సంకోచ దృష్టిని తెలియచేయును. అట్లు వారు ఉపయోగించని పెక్కింటికి గూడ అనుశాసనము కావలసినదే. ఇట్లు అనుశాసనములను విపులము చేసినచో ఆపుటకు వీలులేని మార్పు లేలాగుననూ జరుగును సరే గదా, మార్పు కావలెనను వారి గోల కొంత తగ్గును. కొన్ని మార్పులు చేసినచో లక్షణసిద్ధముగ వ్రాతుమను సశాస్త్రీయమైన కోరిక గల వారి అభిలాషయును నెరవేరును. అట్లు చేసిన యెడల పెక్కుఱు పండితుల ప్రాతినిధ్యము వలన రచింపబడెడి ఆ క్రొత్త అనుశాసనమునకు ప్రాతయను

శాసనమునకు గంటె ఎక్కువ అధికారము కూడ సిద్ధించును. అందుచేత యీ క్రొత్త కార్యమునకు గడంగుట పెద్దల యావశ్యకర్తవ్య మనుటలో ఎట్టి సందియమును లేదు.

ఇట్టి పండిత పరిషత్తునొకదాని నేర్పాటు చేసి క్రొత్త సంస్కరణోద్యమములు చేయవలెనని ఉభయ పక్షములలోని నాయకుల మధ్యను కొన్ని రాయబారములును ఉత్తర ప్రత్యుత్తరములును జరిగిన వన్న సంగతి వజ్రాయుధము, సుజనరంజని మొదలగు పత్రికలను పఠించెడి వారికెల్లరకు విదితమే. కాని మేఘములు క్రమ్మి ఉరుములు మాత్రమురిమి పటాపంచలైనట్లు వాటిలో నుంచి కొంత శుష్కధ్వని తప్ప ఫలరూపమగు వర్షమేమియు కురవకనే పోయినది. వాద ప్రతివాదములు, శుష్క సూచనలూ, వీటితో మనకేమి ప్రయోజనము? ఇది అంతయు, వృధాకాలహరణమే అని భయపడి నవీన గ్రంథకర్తలెల్లరును, దేశాభ్యుదయమును, భాషాశ్రేయస్సును ఎట్లు చేకూరునని వారు తలంచుచుండిరో అట్లే గ్రంథముల నప్రతిహతముగా వ్రాయబూనుచున్నారు. సాహితి సఖి, రెడ్డిరాణి, భారతి, ఆంధ్రభారతి, కవిత, లలిత, కృష్ణ తెలగ, సమదర్శిని మొదలగు వానినెల్ల పఠించు వారికిది గోచరము కాగలదు. అట్లా పండితులెల్లరును గూడి అనుశాసనము చేతురుగాక, మానుదురు గాక అంత వరకు మనమేల వేచి యుండవలెను ! భాషకును దేశమునకును అభ్యుదయ దాయకమైన అనుశాసనము నొకదానిని నేనే ముందుగా చేతును గాక, యని పూనుకొని బ్రహ్మ శ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారొక అనుశాసనమును వ్రాయుటకు బూనుకొని కొంతవరకు సఫలీకృత మనోరథులైరని చెప్పుట కెంతయు సంతోషముగా నున్నది.

శ్రీ శాస్త్రిగారు సుప్రసిద్ధ పండితులు. ఆది నుంచియు గ్రాంథిక శైలి యందభిమానులుగా నున్నారు. ఇప్పటికి గూడ అట్లే అయి యున్నారని అతని తలంపు. అయిననూ, వీరేశలింగం పంతులుగారు, సీతారామశాస్త్రి గారు, రాయుడు శాస్త్రి గారు, చెళ్ళపిళ్ల వారు, కీ॥ శే॥ పోలవరం జమీందారు గారు, కొవ్వూరు సభ వారు మొదలగు వారెల్ల వారి శుద్ధ శ్రోత్రియాభిప్రాయముల నించుక మార్చుకొన్నట్లే వారు కూడా కొంత వరకు మార్చుకొన్నారు. వీరు మార్చుకొనుటకు కారణము రామమూర్తి పంతులుగారి వంటి ఆందోళకుల

ధణధణలును ఆవేశములునే యెంత మాత్రము కాదనియు, వీరి తాలూకు సవిమర్శన ప్రాచీనార్వాచీన ప్రసిద్ధ గ్రంథ పఠనము మాత్రమే యనియు, వీరి యనుశాసనపాఠకు లెల్లరకు విదితము కాగలదు. వీరను శాసించిన శబ్దములును రూపములును అనేకము పూర్వకవిగ్రంథస్థములై యుండుట మనకు గోచరము కాగలదు. అయినను వీరి మార్పులకును శ్రీరామమూర్తి పంతులుగారు కావలెననుచున్న మార్పులకును భేదము, పోవలసిన మేఱలో హెచ్చుతగ్గులు కాని, దిక్కులో భేదమెంత మాత్రమును కాదని సువిదితము. రామమూర్తి పంతులు గారును వీరును కూడ సాంప్రదాయ పద్ధతినే అభిలషించుచున్నారు. అతని పద్ధతియూ పరిశ్రమయూ అతనిని మరికొంతదూరమెక్కువగా సాహసించి తీసుకొని పోవుచుండగా ఇతని పద్ధతియు పరిశ్రమయు ఇతనిని కొంచెము దూరము మాత్రమే తీసుకొని వచ్చి నిస్సంశయ మైనట్టియు, నిపుణమైనట్టియు, సౌందర్యవంత మైనట్టియు సుప్రసిద్ధ కవీంద్ర గ్రంథ సంస్థిత ప్రయోగములకు మాత్రము శరణ్యుని చేసి ఆ గంభీర పరిస్థితుల యొక్క ఉలిలోపులను మాత్రమే కాక వాటి పొలిమేరలో గూడ క్రీడించుట కుత్సాహమును పురిగొల్పినవి. ఇందుచేతనే వీరు గ్రంథ ప్రయోగము లేక వాడుకలోనుండు పుచ్చుకు, తీసుకు,కామోసు మొదలగు వాటికనుశాసనమిచ్చియు వాడుకలో ఉండి ప్రయోగ గౌరవము నందిన ఇస్తిని, వచ్చివా, కూర్చొను మొదలగు మనోహర పదములకును రూపములకును అనుశాసన మీయక తాము "ప్రమాణముగా గొన్న "ప్రయోగములం వ్యాకరణ" మను నార్యోక్తి నిప్పటికి మీఱిన వాడనైతిని" అనుటయు "మఱియు ననుశాసించిన శబ్దముల నీయనుశాసనమున నిపుడుపయోగింపక భాషా సంప్రదాయ వేత్తల యనుమతికై దృష్టి నిలిపితిని" అనుటయు సంభవించినది.

అయినను, శాస్త్రి గారి వంటి సనాతన గ్రాంథిక శైల్యభిమానులే అతివాదులనబడువారికంటె ముందుగా ముందంజవేసి, భాషాతత్వమునూ, మార్పు లక్షణములనూ తాము గుర్తెఱింగి అనుశాసన రూపకముగా ఒరులకు చాటుట మన ఆంధ్రభాష యొక్క భావ్యభివృద్ధి సూచకమని నిజమైన భాషాభిమానులెల్లిరి తలపై యున్నది. శాస్త్రి గారు చూపిన ప్రమాణము లెల్లయు లేఖక పాఠక రచయిత ప్రమాదములని తృణీకరించుట వీరగ్రాంథికుల మతమై యున్నది. మార్పేవద్దని కొమ్మమీద కూర్చొను వారికి ఇది ప్రశంసా

పాత్రము కాకుండుటలో వింత లేదు. కాని మార్పు కావలెనని తలంచు వారికిని తలంచుట యెరుగకయే చేసి వ్రాయు వారికిని ఇది చాలా వరకు తృప్తికరముగా యున్నదనుటలో ఆటంకము లేదు. "ఉను" అను సముచ్చయమును "ఇన" అను చేదర్థకమును, "ఎడు" అను విశేషణమును లోపించి వాటి ముందటి అక్షరములకు దీర్ఘములు వచ్చే ఉదాహరణములను చూపించి శాసించినారు. ఉదా:- అంతా, ఇంకా; చల్లాయంబలి, వెన్నా మీగడ, వినీవినని, చూచినా చెప్పినా, వచ్చే, పోయే, మొదలగునవి. మఱియు, జనులవాడుకలో ఉండి, శిష్టుల గ్రంథములలోకి యెక్కి శ్రుతిరమ్యములై పాటలలోను, పద్యములలోను, శతకములలోను గుత్తులు గుత్తులుగా కానిపించు, తెలుసుక, పట్టుక, పుచ్చుక, అనేటి, పోయేటి, కలపడము, చెక్కడము, పుచ్చుకోక, తీర్చుకోక, పడ్డ, పడ్డాడు, పోను, కాను, విందాము, చూతాము, రానేవచ్చితిరి, కరక్కాయ, వెలక్కాయ, ఎలుగ్గొడ్డు, బొట్టెట్టు, కద్దు, పద్దు, చిలక, ఇరవై, అరవై, మొదలగు పదములకును రూపములకును, ప్రయోగములను చూపి అనుశాసనము నిచ్చియున్నారు. రసున్నలు, బండిఱాల విషయమును వ్రాసెడి వారి యధేచ్ఛకు విడచి పెట్టినారు. దేశ్యవిదేశ్యపదముల నుపయోగించుటలో కూడ మన పూర్వులెట్టి స్వాతంత్ర్యమును జూఱగొనిరో మనకును అట్టి స్వాతంత్ర్యమును జాఱ యిచ్చినారు. అనుశాసనములు లేవు గదా యని సాహసాదార్యములు గల సత్కవీంద్రులును గద్యములో నుద్గ్రంథములను వ్రాయువారును ఇంపితములగు నవ్యప్రయోగములను చేసుకొని పోకమానరు కాని, కాలలక్షణమును భాషాతత్వమును గుర్తెఱిగి, వారికందరికిని చేతులు చాచి స్వాగతమొసంగుట ఉదారనీతి గల విద్వాంసులకు సుభూషణము.

ఇకను, వ్యావహారిక భాషను వ్రాయుచున్నా మనుకొనే వారల సంగతి నాలోచింతాము. వారిలో ననేకులు ఈ ప్రయోగములనే కాక, వాడుకలో నున్న ఇంకా అనేకము వాటిని కూడా ఉపయోగించుచున్నారు. వెళ్ళింది, వచ్చాడు, మనం, ఊహిస్తూ, పోతోంటే, నుంచుని, పడతాయి, పడతై, ఇద్దరమూ, మఱిన్ని మొదలైన ప్రయోగాలను చేస్తున్నారు. ఈ ప్రవాహం చూడగా ఎక్కడా ఆగేటట్లు లేదు. శిష్ట ప్రయోగములను, కవి ప్రయోగములనూ, విశిష్ట ప్రయోగాలుగా మాత్రమే వుంచి మన పూర్వులు అనుశాసనం

చెయ్యకపోవడానికి కారణం, ఒక కొంచెం సందు చెయ్యగానే లక్షోపలక్షలుగా ఇట్టి ప్రయోగాలందులో నుంచి దూరి లోపలకు ప్రవేశిస్తాయనే భయమే కాబోలు. ఈ అనుమానంతోటే కాబోలు మన పూర్వపు అనుశాసనకులు ఈ పిశాచాలు లోపలికి రాకుండా ద్వారాలు మూసేశారు. ఏ నలుగురు కిరీట మాంధాతలో మడిగట్టుకొని జన్మానికల్లా శివరాత్రి లాగ ఏ రెండు మూడు పుస్తకాలో వ్రాస్తే లక్షణ బద్ధములై గిరిదాటకుండా లోలోపుల జిలుగులతోటీ నగిషీలతోటి శ్లేషలతోటీ, వ్యంగ్యాలతోటీ, బంధాలతోటి శబ్దార్థాలంకారాల తోటీ అలరారుతూ వుండేటట్లు, ప్రారంభవిద్యలూ, పరదేశనాగరికతలూ, సామన్య జన సంపర్కములూ, అతి పాండిత్యములూ, అల్ప పాండిత్యములూ, నిత్యసంభాషణలూ, వ్యవహారములూ, గ్రంథములలోకి, పత్రికలలోకి సంచికలలోకీ, కథలూ, కవిత్వం, విమర్శన, హేళన మొదలైన రూపాలతో ఎక్కుతూ వుండే సమయంలో, తరతరాలతో కూడుకొన్న విద్యగలవాళ్ళు, ఆశేతు శీతాచల పర్యంతం అక్కడక్కడ చెదరిన్నీ ఒక్కొక్క చోట గుంపులుగా కూడిన్నీ జీవించుతూ వుండే వాళ్లు, మామండలంలోది మంచి భాష అంటే మా మండలంలోది మంచి భాషని విఱ్ఱవీగడం యెఱిగిన వాళ్ళు వ్రాసే భాష సర్వమూ అనుశాసన రక్షితమఉంటుందని భావించడం కూడా వెఱ్ఱే. అయినప్పటికీ, ఇవి అన్ని రావలసినదే. వీటిలోది చాలా మట్టుగ కొంత కాలం వరకైనా అనుశాసనములకు తప్పి ఉండవలసినదే. ప్రారంభకులు వ్రాసినప్పుడు వారి వ్రాతలు దిద్దివాటికి మఱీ శిష్ట ప్రయోగాలు చూపించి ఈలాగుంటే బాగుంటుందని హెచ్చరించవలసినదే; కాని ఇవి అన్నీ అతనికి జ్ఞానం వచ్చి శైలి కుదిరేదాక చేయవలసిన సహాయాలే కాని, తరువాత, అతను గ్రంథకర్త అయిన తరువాత అతను ఒక లక్షణానికి కాని, సలహాకు కాని కట్టుబడి ఉండు. ఇంగ్లీషులో "Style is the man" అంటారు. మనిషి యేలాంటి వాడైతే వాడి శైలి వాణ్ణి అనుకరిస్తూ వుంటుంది.

ఈలాగున అన్నంత మాత్రమున సూర్యనారాయణీయము వంటి అనుశాసనన గ్రంథమొకటి ప్రస్తుత సందర్భములలో అనవసరమని అర్థము కాదు. అది ఒక వైపున భాషాతత్వజ్ఞానమును సంపాదించుకొనుటకు సాధనమై, ఒక వైపున శాస్త్రి గారి ఉదార పాండిత్య విస్తృతికి తార్కాణమై, ఒక వైపున బాలకులకు విద్యార్థులకును సుబోధకమై ఒక వైపున ఆంధ్ర గ్రంథకర్తల

గౌరవమునకు వారికి సలహాకీ పాత్రమై ఆంధ్ర సాహిత్యములో చిరస్మరణీయంగా ఉంటుంది. అచిరకాలములోనే యింతకంటే విపులమైన మరియొక అనుశాసనమును కూడ రచించి వాడుకభాషకును తన్మూలమైన గ్రాంథిక భాషకును గూడ మరింత కృతజ్ఞతకు పాత్రులై శ్రీశాస్త్రిగారు దీర్ఘాయుష్మంతులును సుఖజీవులును నగుదురు గాక యని యీశ్వరుని ప్రార్థించుచున్నాను. పరిషత్తు వారు చేయబూనుటకు సాహసింపలేక పోయిన ఈ మహాత్కార్యమునకు తామొక్కరేయయ్యు గడంగుటచే వారి వందనములకు గూడ వీరెంతయు పాత్రులు.

30.4.27, కృష్ణాపత్రిక

# పల్లెటూరి కథలు

## విమర్శనము

శ్రీయుత శనివారపు సుబ్బారావుగారు వ్రాసి ప్రచురించిన "పల్లెటూరి కథలు" అను గ్రంథముతో "తెనుగు చిన్న కథ" కు ఒక క్రొత్త దృక్పథమును, క్రొత్త సందేశమును, క్రొత్త రంగమును చిక్కినవని చదువరులు గ్రహించకపోరు. ఇదివరలో తెనుగు పత్రికలలోను, మాస ఉగాది సంచికలలోను ప్రచురింప బడుచుండు చిన్నకథలలోని యంశము మహోదయమగుచున్న నవయువక యువతీజనంబుల యుద్రేకములును, ఆందోళనములు, సంఘపు కట్టుబాట్లలో కొన్నిచోటుల బ్రాకిన దురాచారముల యొక్క దూషణలును, స్వేచ్ఛవలె కనిపించు స్వైరవిహార పరతంత్రతలును, విలాసములును, వైరాగ్యములును, మరణములును మొదలగు నద్భుతములు (romances) మాత్రమే అయి యుండెడిది. చిన్నకథయొక్క సంకల్పమును, సార్థక్యమును ఇదియేయని కొందరును, ఇంతియేయని కొందరును తలచియుండుటలో నాశ్చర్యము లేదు. చిన్నకథను చూచీ చూడడములో ముందు దానినే పఠించి, ఆ శృంగారమును, ఆ విలాసమును, ఆ వైరాగ్యమును అనుభవించి దానిని విడిచిపెట్టుట పాఠకుల కలవాటై పోయినది.

ఇట్టి ఆంధ్రసారస్వతలోకమున నీ గ్రంథమును బ్రచురించి ఇంతకంటె సొగసై మనోహరమైన దిశకు ఈ "చిన్నకథ" చూడగలదన్న సంగతిని గ్రంథకర్త ప్రత్యక్షముగ ఋజువు చేసినాడు. ఇతను తొలుదొల్త చేసిన పని నవయౌవన సూత్రాంతమగు మోహమును, దాని పరిణామములను మాత్రమే కథలకు ప్రప్రధానాంశముగ జేయుట మాని, లోక వ్యవహారములను, సంసార కష్టసుఖములను ప్రప్రధానాంశముగ జేసినాడు. పిదప మోహ పరతంత్రులును, శరీర సౌందర్యోపాసకులును నగు నవ యౌవనుల ప్రధాన పాత్రలుగ జేయుట మాని సంసార కష్ట సుఖములు శరీరమునకు నాటి క్రిందమీదులు పడుచున్న గృహస్థులను, గేస్తురాండ్రను ప్రధాన పాత్రలుగా జేసినాడు. ఈ చిత్రించుటలోనే ఆలోపములు మాయమై సుగుణములు వృద్ధి చెంది, అన్యోన్యత కుదిరి సంసారములు చక్కపడు మార్గములను సూచించినాడు.

అయినను గ్రంథము నసపెట్టి నీతి బోధనలు చేయు శిక్షాస్మృతివలె గాక, సుఖసల్లాపములు సలుపుచు సూనృత మార్గమున నడిపించు సుహృత్తమునివలె సహవాస యోగ్యమై ప్రీతి దాయకమై యుండుట గ్రంథకర్త యొక్క రచనా చమత్కృతిని చాటుచున్నది.

ఇక కథలలోని కొన్ని ప్రధానాంశముల బరిశీలింతము. గ్రామ ప్రజల యొక్క మొట్టమొదటి యిబ్బంది ఉద్యోగస్తుల రాపిడి. ఒక ముసలాయన చెప్పినట్లు "ఇప్పటి మునసబు కరణాలకు - పెద్ద చిన్న తారతమ్యము లేకుండా ఏమి చేస్తానో చూడు నీ సంగతి కనుక్కుంటాను అనే బెదిరింపులతో యేడిపించుకు తింటూ" వుండడము పరిపాటి. ఒక వూరి కరణం "అచ్చయ్య క్రొత్తలోగిటి అరుగులు ఆక్రమణము చేశాడు". అని పైకి వ్రాసి రెవిన్యూ ఇనస్పెక్టరుకు బాగా భోజనము మేపి కొలిపించి స్థిరపరచి, తహస్లీల్దారు నోటీసు అమలు జరిపించి వెంటనే యింటి చూరూ, అరుగులూ కొట్టేసుకోవడమో, లేకుంటే నెలకు పదిహేను రూపాయలు చొప్పున అపరాధం కడుతూ సివిలు క్రిమినలు చర్యలకు లోబడడమో జరిగేటట్లు చేయించారు. ఆ వూరు మునసబే అంజయ్య పొలము గట్టుకొట్టి తన పొలములో చేర్చుకొని ఏమయ్యా అంటే రెండు నువ్వుల బస్తాలు అతని గడ్డి కుప్పలో దాచి అతని మీద చోరీ కేసు పెట్టి మూడు మాసములు కఠిన శిక్ష వేయించాడు. వూళ్ళో వెట్టివాణ్ని చాకలివాడ్ని, వడ్రపు పని చేసే బసవలింగాన్ని యేమర్రా దొంగ సాక్ష్యాలిచ్చినారని పెద్దమనిషి కొండయ్య అడిగితే, "లేదు బాబయ్యా గ్రామ నౌకరీకి భంగం వస్తుందని మీకు తెలియదా" యని వాళ్ల జవాబు. గ్రామ మునసబు కరణాలంటే పట్టణములోని వారి పై ఉద్యోగస్తులకు లంచము లిప్పించుచు తాము తింటూ ప్రజలను హింసించు బొటులని అర్థము. మరో మునసబు వెంకటసామి చేత అయిదు రూపాయలు లంచమిప్పిస్తేనే కాని ఒక ఓవర్సీలు త్యాప్లము వూరు కదలలేదు. ఇది గ్రామాధికారుల స్థితి.

ఇక వీరి పై అధికారులనగా పట్టణములో వుండే రెవిన్యూ ఇనస్పెక్టరులు, పోలీసు ఇనస్పెక్టరులు, మేజిస్ట్రేటులు, రిజిస్ట్రారులు. ఓవర్సీలు మాట చెప్పనక్కరలేదు. రెవిన్యూ ఇనస్పెక్టరేది ఆక్రమణమంటే అది ఆక్రమణము.

పోలీసు ఇనస్పెక్టరెవరిని దొంగంటే వాడు దొంగ. మేజిస్ట్రేటు కెటు మొగమాటముంటే అటు తీర్పు. రిజిస్ట్రారు కియ్యవలసిన ప్రయివేటు ఫీజు ముట్టకుంటే "మూడు గంటలై పోయింది. అవతలకు పో" ఓర్సీలుకు రూపాయిలిస్తే నీరువచ్చే సదుపాయం వీలైతే చేస్తాడు. అన్ని తోవలూ సర్కారువే. ఆ తోవంట బండి వెడితే జరిమానా. ఓర్సీలుకు లంచమిస్తే కాని అది తప్పదు. పట్టణములో ఇత్తడి చెంబు పట్టుకుంటే న్యూసెన్సు కేసు.

ఈ ఉద్యోగస్తులు రిటైరైనా కాని వీళ్ళ పీడ పోదు. ఏమంటే అపుడు వీరు బెంచి మేజిస్ట్రేటు లౌతారు. పై ఉద్యోగస్తులందరూ అన్ని డిపార్టుమెంటుల వాళ్ళూ ఒకళ్ళ కొకళ్లు చుట్టాలో, స్నేహితులో ఔతారు. అందుచేత ఒకడికి వచ్చే లంచము ఇంకొక డెన్నడూ తప్పించడు.

వీరికెక్కడికక్కడే వుల్పాలు కావాలి. రెవిన్యూ ఇనస్పెక్టరు వగైరాలు వస్తే కరణం గారింట విందులు. పోలీసు ఇనస్పెక్టరులు, మేజిస్ట్రేటులు వస్తే మునసబు గారింట కోళ్లూ గొఱ్ఱెలూ కొట్టి భోజనాలు. పోలీసు వాళ్లు అనగానే యే కారైనా ఆపేసి అందులో కూర్చొని ఛార్జి యెగవేయవచ్చు. డిప్యూటీ కలెక్టరు గారి కుమారుడి కంటే మేస్టరులు మార్కులు దిద్ది పేసు చేయవలసినదే. మైలుకూలీ ఓవర్సీలు దగ్గరకు పనివుండి వచ్చాడురా అంటే వాళ్ల ఆవులకు గడ్డివేసి కుడితి తాగించనిదే వెళ్లకూడదు. లంచాలు దిట్టముగా ముట్టిపోతే ఆక్రమణలు లేవు, దొంగతనాలు లేవు సర్కారు రోడ్డుమీద బళ్లు తోలడాలు లేవు అంతా రామరాజ్యమే.

పల్లెటూళ్లలో రెండవ అంశము చిలిపి జట్టీలు. తొమ్మిదేండ్ల చంద్రమ్మ నడుస్తున్నపుడు ఏడేళ్ల నరసమ్మ పరికిణీ మీద బురదపడితే నరసమ్మ తల్లి చంద్రమ్మను మోదీసింది. చంద్రమ్మతల్లి నరసమ్మను తిట్టింది. నరసమ్మ తల్లి జగడానికి వచ్చింది. ఎవరింట్లో మగవాళ్లు ఆ యింట్లో ఆడవాళ్ల తరపు. ఎవరి చుట్టాల వాళ్లు వాళ్ల తరపు, నాలుగు రోజులిదో అలికిడి.

మూడవ అంశము సహవాసము. పల్లెటూరి కుఱ్ఱవాళ్లు చెడిపోవడ మున్నూ. వెంకయ్య కొడుకు పురుషోత్తాన్ని చూచి చదువుకొని జ్ఞానం సంపాదించే వారెవరూ లేరు కాని, కోటయ్య కొడుకు రామనాథమును

చూచి క్రాపింగుంచుకుంటకు, అవకతవకగా నాలుగింగ్లీషు ముక్కలు పేలిందుకు, కళ్లజోళ్ళూ, మేజా బల్లలు, చేతికర్రలు కొనిందుకు ఇంట్లో వస్తువులెత్తుకపోయి బోగము వాళ్ల కిచ్చేటందుకు సత్యంలాటి కుర్రవాళ్లనేకులు సిద్ధము.

నాలుగవ అంశము పల్లెటూళ్ల వాళ్లు పడే దండుగలు. పాపయ్య పెళ్లి సరకులు కొందామని యిల్లు బయలుదేరితే రెండు రూపాయిలు పుచ్చుకొన్న టికెట్ల మేష్టరు రూపాయి పావలా టిక్కట్టిచ్చి చిల్లర లేదని తక్కిన ముప్పావలా వుంచేసుకొన్నాడు. ఇత్తడి చెంబు పట్టుకుంటే పట్టణంలో 'బెంచి మేజిస్ట్రేటు రెండు రూపాయీలు జరిమానా వేశాడు. వట్టి బట్టలకీ, జరీ బట్టలకీ, బంగారానికీ, లైటులకీ, సెంటులకీ సుమారు ఎనిమిది వందల రూపాయలు ఖర్చు అయినవి. ఇంటికి వచ్చి చూచుకుంటే పట్టుబట్టలు బరంపురానివి కాక అల్కా చీనావి అయినవి. జరీ రాగిదయిపోయింది. అత్తరులు పులుసు కంపు. పెట్రోలు లైటు మేంటిలు తగులడింది. అరికేను లాంతరుకు వత్తెక్కలేదు. బస్తీలలో అంతా దగే అన్నాడు పాపయ్య మామగారు. అయినా రోజుల్ని బట్టి నడవాలన్నాడు గోపాలం.

అయినా పల్లెటూళ్లను గురించి మనము బొత్తిగా నిరాశ పడనక్కరలేదు. ధ్వజస్తంభము చుట్టూ చేరే పెద్దలలో కొండయ్యలాంటివాళ్లు కొందరిని ధర్మంగా ప్రవర్తించలేరా అని అదమాయించగలరు. లచ్చయ్యలాంటి వాళ్లు దారేపోయేవాళ్లకివీలుగా వుండేటందుకు రోడ్డు కాలువ కలసేమొగలో చిన్నసత్రం కట్టించబూనుకుంటున్నారు. వెంకయ్య యేటా వైశాఖ మాసంలో తన యింట పురాణం చదివించడం మామూలైంది. "ఇంతకీ, మనలో మనకి నీతీ జాతీ లేకపోవడం, అందుకు తోడు మనలో అధైర్యం కలగడాన్ని బట్టీ, నేడు మనమీ స్థితికి వచ్చామని చీవాట్లు పెట్టిందుకు శాస్త్రిలాగు ధైర్యంగా నిలబడగలిగే వాళ్లున్నారు. కరణం యింటికి వేళకి ఎవడు వచ్చినా లేదనకుండా అన్నం పెడతాడు. పురుషోత్తం లాంటి వాళ్లు బి.య్యే పేసయి కూడా బానిస వృత్తిలో చేరక దేశసేవ చెయ్యాలనే కోరికతో ప్రజాసేవక సంఘంలో చేరుతున్నారు. అయినదానికీ, కానిదానికీ యింత డబ్బు పెట్టడం పూర్వ సంప్రదాయం కాదనే పెద్దలున్నారు. చిన్న పిల్లల కోసం రుంజాలు తెంచుకుని దెబ్బలాడుకుంటోన్న పెద్దవాళ్లందరూ వాళ్లలో వాళ్లే సిగ్గుపడుతున్నారు.

తిన్నగా ప్రవర్తించని వాళ్లకి దేముడే శాస్తి చేస్తాడనడానికి, మునసబు కూతురు ముండమోయడం, కరణం కూతుర్ని అల్లుడు వదిలి వేయడమే సాక్ష్యాలు.

ఈ విధముగా పల్లెటూళ్ల తాలూకు కొన్ని చాయలు తీసి గ్రంథకర్త చిత్రించి ప్రచురించినాడు. ఇట్టి వనంతములైన చాయలా గ్రామములపై నున్నవి. అవి గ్రహించి ముద్రించగల చిత్రకారులవసరమైయున్నారు. ఈ గ్రంథకర్త తాను రచయించినంత మేరలో పొందిన విజయమును తానింకను పెక్కు కథలు వ్రాయుటకు ప్రోత్సాహముగా గైకొని తన కృషిని కొనసాగించును గాక యని కోరుచున్నాను.

**– భారతి, సెప్టెంబర్, 1931**

# సాంఘిక నవల

మన ఆంధ్రమున నిప్పటి కొక వేయి నవలలయినను ప్రచురింపబడి యుండవచ్చును. వీటిలో ననేకములు బంగాళీ, హిందీ, మహారాష్ట్రము మొదలగు దేశీయ భాషలనుండి తర్జుమాలై యున్నవి. వీటిలో గూడ కొన్ని మహమ్మదీయ, మహారాష్ట్ర రాజపుత్ర యుగములనాటి చరిత్రాత్మకములై యున్నవి. కొన్ని బ్రిటీషు యుగము నాటి రహస్య పరిశోధకములై యున్నవి. మఱి కొన్ని పౌరాణికములై కూడా యున్నవి. అతి కొంచెము మాత్రము గ్రంథకర్తలు తాము స్వయముగా నాలోచించి వ్రాసినవై యున్నవి. వాటిలో గూడ మరల ఆంధ్రదేశపు టాచార వ్యవహారములకును, ఆంధ్రదేశపు పల్లెలు, పట్టణములు, ఏఱులు, సరోవరములు మొదలగువాటి వర్ణనలకును సంబంధించినవి మఱియు స్వల్పము. ఈ చివర వాటినే తప్ప మఱి వేనిని గాని ఆంధ్ర సాంఘిక నవల యనుటకు వీలు లేదు. అయినను ప్రస్తుత గ్రంథకర్తలలో సాంఘిక నవల వ్రాయుదమను నుత్సాహము మిక్కుటముగా గనుపట్టుచున్నది. ఇట్టి యవసరమున సాంఘిక నవల కుండవలసిన లక్షణము లెవ్వి? అవి యెట్లు మన ప్రస్తుత సాహిత్యమున నచ్చటచ్చట పొడచూపు చున్నవి. వాటినెల్ల సంపుటీకరణము చేసి యందమగు సాంఘిక నవలా నిర్మాణమున కెట్లు దారితీయనగును అను అంశములను కొంచెము విచారించుట యెంతమాత్రమును నప్రస్తుతము కాదు. లాక్షణికులిట్టి నిర్ణయమిప్పుడు చేయనిచో ప్రతి లేఖకుడును ఏ వివాహమునకో వ్యవహారమునకో లేక వింతకో సంబంధించిన యొక కథనల్లి దానికి సాంఘిక నవల యను పేరు పెట్టుట తటస్థింపవచ్చును. అట్లు జరుగుచున్నది కూడాను.

ఐరోపా ఖండములోనేమి భారతదేశముననేమి నవల యనునది పురాణములు, పద్యకావ్యములు, వచన చరిత్రములు మొదలగునవి యెన్నియో వెలువడిన తర్వాత నూతనముగా వికసించిన సాహితీ విశేషమని చెప్పవచ్చును. ఐరోపా ఖండములో అనేక సాహిత్య వికాసములకు లాటిను భాషయు, ఇటాలియను గ్రంథములును మార్గదర్శకము లైనట్లే నవలలకు గూడ ఇటాలియను నవలలే మార్గదర్శకములుగా నుండెను. ఇటాలియను నవలలు తరుచుగా ఉన్నత కుటుంబములకు చెందిన యువతీ యువకులు, నాయికా

నాయకులు కలవిగాను, వారు ఒకరి ప్రేమ నొకరు చూఱగొనుటకు చేయు త్యాగములు, విలాసములు, పరిశ్రమలు మొ॥నవి విషయములుగా గలవిగాను, చాలమట్టుగ చరిత్రాత్మకములు గాను, కొంత వరకు అద్భుతములతో కూడినవిగాను నుండెడివి. అయిరోపా ఖండము ఇటాలియను సాహిత్య పరిచయము వలన బడసిన నూతన భావములతోను, ఉత్సాహములతోను ఉద్భూతలూగెడి సమయమున వివిధ దేశములలో ప్రథమమున వెలువడెడి నవలలిట్టివి గానే యుండెడివి. ఆంగ్లేయ భాషలో స్కాటు నవలలను పఠించు వారికి వాటి లక్షణములు తెలియగలవు. మనదేశములో రసపుత్ర శౌర్యముగా రచించిన విమలాదేవి, రాణి సంయుక్త మొదలగు నవలలు కూడా నిట్టివే.

ఈ నవలలను పఠించుట వలన నవలయను పేరు మోసెడి ప్రతి గ్రంథమునకును కొన్ని పడికట్లుండుననియు, అది లేనిచో ఆ గ్రంథము నవల కాదనియు అభిప్రాయము సాహిత్య ప్రపంచముననల్లుకొనెను. ఆపడికట్లు ఉన్నత వంశమునకు చెందిన నాయికా నాయకులు, వారొకరికొరకొకరు తప్పక త్యాగము చేసి యిడుములు గుడిచి తమ ప్రేమను బుజువుపరచుట, ఇందుకొరకొక యుద్ధమో లేక పోరాటమో కల్పించుట, నవల శుభప్రదమై నీతిదాయకమై నెగడుట, భాష రసోద్దీపకమై శబ్దాలంకార శోభితమై, లలితమై, గంభీరమై యుండుట ఆయాతావుల కథకెంత యవసరమో అంతకు మించియు (కథనడకలో విస్తారము సంబంధము లేకపోయినను సరే) ప్రకృతి వర్ణనములు సలుపుట మొదలగునవి. ఈ విశ్వాసము నవలా ప్రపంచమున నొక మూర్ఖమతము వలె వ్యాపించి యీజాతి నవలలన్నియు స్థల నామములు, పురుష నామములు, మాత్రమే భేదముగా సమస్త దేశముల నవలలు నొక్క తీరుగా నుండునట్లు చేసినది. ప్రత్యేక స్థలముల యాచార వ్యవహారములు గాని, నిరూపణలు గాని, వ్యక్తుల పోలికలు గాని చేజిక్కక యువకజనోచితంబగు నుత్సాహమును మాత్రమినుమడించుచు, అద్భుత చర్యల పఠనమున కాస గొలుపుచు వచ్చినవి. వీటిని నవలలు కావని యెవ్వరును ననజాలరు. అవియొక రీతి నవలలు. సాంఘిక నవలలు కావు.

సంఘజీవనము నందాసక్తి పుట్టి, వారి యాశలు ఆశయముల యందు

మనకభిరుచి జనించి వారి తళుకులు, బెళుకులు, హొయలు, యొయ్యారములు, నవ్వులు, పరియాచికములు, విచారములు, కష్టసుఖములు మొదలగు వాని యందు సానుభూతి జనించి ఆ అచ్చటలను ముచ్చటలను ఆనందదాయకముగా వీలయినంత వరకు వారు మాటలాడుకునే శబ్దార్థాద్యలంకార రహితమగు శైలిలో చెప్పెడి ప్రశంసలకే సాంఘిక నవలలని పేరు. అట్లని శైలి అల్పులు, నీచులు కూడ మాట్లాడెడి రీతిని హేయపద భూయిష్టమై యుండకుండ- సభ్యమై వెగటు పుట్టించ కుండిన చాలును. ఇట్టి నవల కుండవలసిన ముఖ్య లక్షణమేమన కథ యే కాలము నాటిదని మనము చెప్పుచున్నామో. ఆ కాలము నాటి మాటవడుపు, యాస, మర్యాదతీరు స్థలాదుల చిత్రము కళ్ళకు కట్టినట్లగుపడవలెను. ఇట్టివన్నియు పురుషాంతరమున కొకసారియైన నచ్చముగ మారిపోవుచుండును. సాంఘిక నవలయనిన కథ చెప్పుట కాదు కథ చెప్పుటకెట్టి శైలియైనను వొకటే, యెట్లు వర్ణించినను వొకటే. సాంఘిక నవలయనిన కథను చిత్రించుట. ఇట్టి చిత్రమున కెక్కడనుండవలసిన రంగు, నీడ, కాంతి అక్కడ సరిగా నుండిననే చిత్రము సరియైనదగును కాని సంఘమర్యాదలు, వివరములు, స్థలము యొక్క తాత్కాలిక విచిత్రములు, మొదలగు వానియందు లక్ష్యము లేక లేఖకుడు తన కల్పనలతో నవిచ్ఛిన్నముగ విజృంభించినచో ఏదో యొక చిత్రము తయారయి ఏదో యొక వింతగొలిపి మోహింప జేయునే కాని అది సంఘ చిత్రము కానేరదు.

సంఘ చిత్రము సరియైనదై యుండవలెను. అనగా సత్యమైనదై యుండవలెను. సత్యమనగా ఇక్కడ బ్రహ్మపదార్థమును గూర్చిన సత్యము వంటి విశేష సత్యము కాదు. ఆ సత్యము దేశకాల పరిస్థితుల వలన బాధింపబడినది. ఈ సత్యము దేశకాల పరిస్థితుల మార్పు వలన బాధింపబడు సామాన్య సత్యము. స్థలములు నేడున్నట్లు మరి పదియేండ్ల తర్వాత నుండవు. మాట తీరులు, అలవాటులు, మర్యాదలు, ఆచారములు తాత్కాలిక చరిత్రాత్మకమగు విశేషములు మొదలగునవి కూడా నేడున్నట్లు ఒక పురుషాంతరము తరువాత నుండబోవు. ఈ చిత్రమును మనము కన్నులార చూచుచు చిత్రించిననే సరియైన సత్యమైన చిత్రము చిక్కును కాని ఊహాప్రపంచము నుండి కల్పనలను తీసుకొని వచ్చి చిత్రించినచో అది కృత్రిమము కాకమానదు. కనుక సాంఘిక నవల గ్రంథకర్త తన కన్నుల

యెదుట ప్రవహించుచున్న కాలవాహినిని గాంచుచు ఆందలి విషయములను గూర్చి వ్రాసినపుడే సరియైన సత్యము చిక్కును గాని రసపుత్రయుగము నాటిదియు వంగభాష మాటాడు వంగదేశమునకు సంబంధించినదియు రాయచూరు యుద్ధము వలె ఏ విజయనగర సామ్రాజ్యము నాటి ఆంధ్రుల చరిత్రకో సంబంధించిన దియు నగు విషయము నెత్తుకొని వ్రాయగడంగినచో మన చర్మ చక్షువుల యెదుట జరుగు అకళంక సత్యమును గాక ఊహా చక్షువు నెదుట గోచరించు నట్టియు అభూతకల్పనలతో కూడినట్టియు శృంగార, వీర, శోకాద్భుతాది రసంబులతో మన డెందముల నానందకల్లోలినిలో నుంచునట్టియు, విచిత్రకాల్పనిక సత్యమును మాత్రమే చిత్రించినదగును. పందొమ్మిదవ శతాబ్దమున జీవించిన థేకరెయను ఆంగ్ల నవలాకారుడు పదునెనిమిదవ శతాబ్దము నాటి యొక కథను నవలా రూపముగా వ్రాసెను. అందుకొరకా శతాబ్దపు మర్యాదలు, సంభాషణములు మొదలగునవి యెన్నో పఠించి చిత్రముల నెన్నింటినో దర్శించి కష్టపడెను. అయినను అద్భుత కార్యమొనర్చిన యొక ప్రజ్ఞావంతుడుగను, సాధింప సాధ్యము కాని కృత్యమును చాలవరకు సాధించిన యొక వీరునిగ మాత్రమే పరిగణించుచున్నారు. కాని దానిని సంపూర్ణమగు సాంఘిక నవల యని వ్రాయుటకే విమర్శకునకు చేయిరాకున్నది.

సాంఘిక నవల యనగా కథ యే కాలమునకు చెందినదో ఆ కాలము యొక్క సరియైన చిత్రము. గ్రంథకర్తలు తరుచుగా తమ కన్నుల యెదుట జరుగుచర్యలనే సరిగా చిత్రించలేక యేదో ఒక అభాసము చేయుచుందురనిన వేరొక కాలము నాటి చిత్రము నెట్లు సరిగా వర్ణించగలరు? వారు వర్ణించిరని నిర్ణయించగల తీర్పరు లెవరు? జరుగుతున్న కాలమునాటి దానికి సజీవమగు ఆ సంఘమే సాక్షి. ఏ మాత్రమెచ్చుతగ్గున్నను యే యమ్మలక్కలైనను కనిపెట్టగలరు. ఇక విమర్శక విశారదుల మాట వేరే చెప్పనేల?

కనుక సాంఘిక నవలను వ్రాయబూనువాడు తన కాలము నాటియు, తనకు తెలిసినట్టియు, తాను కనినట్టియు జీవితాంశముల నెత్తుకొని వర్ణింపదొడగిననే సఫలీకృతుడగును. కాని 'అనగనగా నొకరాజు' అని యే పూర్వచరిత్రనో గైకొనినచో కేవల పరిహాసపాత్రుడగును. కథ జరిగి తీర

నక్కరలేదు. నిజముగా జరుగుచున్నట్లగుపించిన జాలును.

సాంఘిక నవల కవి వ్రాయుచున్న నాటి కాలముదై యుండవలెను. మన కథ జరుగుచున్న నాటి సమయమున ప్రయోగమందెచ్చటను కానరాదు. కథ యే భాషలో వ్రాయబడుచున్నదో ఆ భాష మాటలాడే ప్రాంతమునకును, జాతికినీ సంబంధించినదై యుండవలెను. ఒక దేశపు ప్రజలు వేఱొక దేశపు భాషను దానికి స్వతస్సిద్ధమగు జాతీయములతోను, సులువుతోను, సౌందర్యము తోను మాటలాడజాలరు. కవి తన స్వభాషలో స్వభాష మాటలాడు వారి జీవనమును ప్రతిబింబింప చేయుటకు ప్రయత్నించిననే సాంఘిక నవల సరియైన చిత్రము కాగలదుకాని లేనియెడల సరియైనది కాజాలదు.

కథ సత్యముగ జరుగుచున్నట్లగుపించ వలెనని సాంఘిక నవల కవి కాలము నాటిదై కవి యొక్క స్వభాషలో రచితమై పాత్రలు తమ మాతృభాషను నవలలో మాటలాడుచుండ వలెనని కథలో నెచ్చటను కృత్రిమ నామాదు లుండరాదు. కృత్రిమ నామములనగా ఆ భాష మాటాలాడే ప్రజలు గల రాష్ట్రములో వాడుకలో లేని స్థలనామములు, పురనామములు, పురుషనామములు మొదలగునవి. భోగవతి, మధురానగరము,ధార్మిక పురము, శ్రీ నికేతనము మొదలగు పుర నామములు, రజతగిరి, కనకాచలము మొదలగు కొండల పేరులు, మందాకిని, మత్స్యవతి మొదలగు నేఱులపేరులు, వీరసేనుడు, విజయసింహుడు మొదలగు పురుష నామములు, సంధ్యావళి, మదాలస, మనోరమ, మొదలగు స్త్రీ నామములు- ఇట్టివి మన తెలుగు దేశములో లేవు. కనుక ఇట్టి పేరులను కవి సాంఘిక నవల యందు ప్రయోగించినచో అంతవరకు అవి కాల్పనికములుగా తోచి కథనంత వరకు సత్యము కానట్లు తోపజేయును. ఆంధ్రదేశపు సాంఘిక నవలను వ్రాయగడగినచో ఆంధ్రదేశములో నున్న నదులు, కొండలు, గ్రామములు, పట్టణముల పేరులును, ఆంధ్రదేశములో వ్యవహారములో నున్న స్త్రీ, పురుష నామములను మాత్రమే ప్రయోగించవలెను.

ఇంతియ కాదు. ఈ నదులను గ్రామములను మొ॥ వానిని గూర్చి వర్ణించునపుడు గాని, వాటి ప్రశంసలు వచ్చునప్పుడు గాని యే నదుల కైనను గ్రామములకైనను సమానముగా వర్తించునట్టియు పురాణ

ప్రబంధములలో తరచుగా గాననట్టియు సమాన గుణములు కురిపించి, విడిచి ఆయా పేరులు గల గ్రామములకు, నగరములకు, పట్టణములకు ప్రత్యేకించి చెల్లునట్టియు, కథనము యొక్క గమనికను, వీలయినంత వరకు ప్రతియక్షరమును సంబంధించునట్టియు విశేషములు చేర్చవలెను. ఇట్లు చేయుట వలన ఇతివృత్తము సరిగా నడచుచున్నట్లు మనదృష్టికి గోచరించుచుండును.

పిమ్మట ఈ దేశములో నున్న కులాచార వ్యవహారములను చిత్రించుచు రావలెను. కాని పల్లె పడుచులకు పట్టణ వాసపు ఫేసు పౌడరులను పూసియు, పట్టణపు కన్యలకు టర్కీ ముసుగులు, ఇంగ్లీషు గౌనులు తొడిగియు, వికారవేషములు వేయరాదు. ఆచారములను మీరి ప్రవర్తించు వారి విషయమై వర్ణించునపుడు మాత్రమే అట్టుల వ్రాయనగును. ఇది కాక ప్రతి జాతికిని జాతి లక్షణముల నొప్పు కొన్ని స్వభావ లక్షణములుండును. ఇవి దేశము నుండి దేశమునకు, రాష్ట్రమునుండి రాష్ట్రమునకు మాత్రమే కాక ఒక గ్రామము లేక నగరములో కూడా ఒక తెగ నుండి మరియొక తెగకూడ భేదముగా నుండును. వారి యిళ్ళు వాకిళ్ళలోనూ వారి వస్తు వాహనముల నుంచుకొనెడి యిమ్ములోను ఒకరినొకరు పలుకరించి ఆదరించెడి విధానములోను, ఇతరులతో ప్రవర్తించునప్పుడు కనబరుచు విధి వినయములు లేక టెక్కు టక్కులలో శుభాశుభ పుణ్యాపుణ్య కార్యములలోను, ద్రవ్యాదుల నాకర్షించునట్టి లేక వెచ్చించునట్టి తెరవులలోను, సరసములు, సల్లాపములలోను ఈ లక్షణములు తమ్ము తమ్ము చూడు మన్నట్లగుపించుచుండును. నిజమైన శిల్పదృష్టి గల కవి వాటినెట్లో పోల్చి వర్ణనలో, ప్రశంసలలో, సంభాషణలలో వాటి ఛాయల నాకర్షించి ముద్రించగలడు. ఈ శిల్పదృష్టి లేని వాడెంత పండితుడయ్యు, ఎట్టి యనర్గళ ధార కలవాడయ్యు ఆ సంఘచ్ఛాయ నాకర్షించలేడు.

ఈశిల్ప దృష్టి స్వతస్సిద్ధముగా పుట్టుకొని రావలసినదే యని యొప్పుకొనుచునే అట్టి శిల్పుల కుండవలసిన కొన్ని సాధారణ లక్షణములు మాత్రమిచ్చట చెప్పవలసి యున్నది. వారు సంఘమునెడ యెడము గాక సంఘముతో కలసిమెలసి తిరుగ నభిలాష కలిగి తిరుగుచుందురు. వారి

కష్టములను, సుఖములను, సరసములను, విరసములను తాము కూడ ననుభవించునట్లు మనశ్చలనములను గలిగి యుందురు. అందరితోను కలుపుగోలుతనముతో తిరుగగలట్టియు, అరమర అభ్యంతరము లేక ప్రవర్తించునట్టియు, అందరికిని హర్షప్రదనమైనట్టియు, జనపరిచయము, సంభాషణతీరు, హాస్యరసము, అనుకూలమగు నడవడి కలిగియుందురు. సాంఘిక నవల వ్రాయగోరువారు మున్ముందెంత వరకీ లక్షణములు తమకు గలవో యోచించుకొని, అలవాటు చేసుకొని, ఛాయగ్రహణ శక్తి నలవరచుకొని గ్రంథరచనకు గడంగినచో బాగుండును. లేని యెడల ఆ గ్రంథము సరియగు చిత్రముగా ప్రచారము కాక గ్రాంథిక శైలి కొరకో, అద్భుతములగు చర్యల కొరకో దీర్ఘమగు కథ కొరకో, నీతిబోధ కొరకో పాఠశాల తరగతులలో పఠనీయమైనదిగా కమిటీ వారిచే నిర్ణయింపబడుట కొరకో మాత్రమే గౌరవము కలిగియుండును.

కవికీ దృష్టి యుండి, స్వభాషణలో రచించుటకు, స్వభాష మాటలాడువారి చర్యలే వ్రాయుటకు, వారి ఆచార వ్యవహారములను, ఆశలు, విలాసములను, కష్ట సుఖములనే చిత్రించుటకు గడగినచో సాంఘిక నవల మనోహరముగా నుండును. సాంఘిక నవల రచించు నాతడింకొక విషయమును గురించి అత్యంత శ్రద్ధ వహించవలసి యున్నది. అది శైలిని గూర్చి. ఈ సందర్భమున గ్రాంథిక, వ్యవహారిక శైలులను గూర్చిన చర్యకు దిగుటకు నాకెంత మాత్రము నిష్టము లేదు. సాంఘిక నవలను గూర్చి ఆలోచించినంత వరకైనను, ఒక శైలి వ్యావహారికమైనంత మాత్రమున గ్రంథస్థమగుటకు తగదనియు గ్రాంథిక మైనంత మాత్రమున సంఘమును చిత్రింపజాలదనియు చెప్పుటకు నేను సాహసింపను. శైలి కవికి నైజమై యుండవలెను. కాని శ్రమపడి పుస్తకములు వెదకి కష్టమై అపురూపమైన ప్రయోగముల నేర్చి గ్రంథములో గాంభీర్యము కొరకు జొనుపబడినదిగా నుండకూడదు. సముద్ర తరంగముల వలె గంభీరమున నుండునుగాన, సెలయేటి కలకలము వలె మంజులముగా నుండును గాన, తేనేసోనల వలె తేటగా నుండును గాన, శైలి కవికి నైజమై యుండవలెను. అతను సృష్టించెడి పాత్ర నోటిలో నది ఔచిత్యము గలిగి యుండవలెను. పాత్రల సంభాషణలో నుపయోగించెడి శైలి పాత్రము నుపయోగించునంత వరకు మాటలాడు కొనే భాషలో,

అరసున్నలు, నెరసున్నలు, లేక అనాయాసకరమైనదిగా నుండక తీరదు. లేని యెడల నా పాత్రలు మనకు వింత గొలుపును గాని నైజత్వమును స్ఫురింపజేయవు. వారి సంభాషణపై విమర్శనములు, వారు సంభాషించుచుండు తరి వారి హావభావ విలాసములను వర్ణించు భావములు కూడా ఆ శైలిలోనే వ్రాయుట యెంతయును యుచితము. కవి తానుగా నొనరించు స్థలాదుల వర్ణనలు, సంఘ సమస్యల చర్చలు, పాత్రల యోగ్యతలను గూర్చి అభిప్రాయములు, వాటిపై విమర్శలు తన కిష్టమైన శైలిలో వ్రాయవచ్చును. అవి కవి అభిప్రాయములు కనుక పాఠకులు శ్రమ తీసుకొని చదవగలరు. కాని పాత్రలే మాటలాడునప్పుడు లేదా వారి సంభాషణలు ప్రక్క ప్రక్కను వచ్చుచు వాటి సున్నితములను మనము గ్రహించుటకు కవి సహాయము చేయవచ్చునపుడు, కవి తన ప్రతిభను, పాండిత్యమును, కల్పనా ప్రాగల్భ్యమును జొప్పించక పాత్రలను తమంతట తామే వచ్చుచు పోవుచు మాటలాడునట్లు చేయవలెను.

చారిత్రక నవలల వలె మోహశౌర్య ప్రధానములగు నద్భుత నవలల వలె, కూపీలు తీసెడి చమత్కారముల చూపు రహస్య పరిశోధన నవలల వలె సాంఘిక నవలలు కథా ప్రధానము లైనవి కావు. వీటికి ఒక మొదలు, ఒక నడుమ, ఒక తుది అని యుండవలసిన ఆవశ్యకత లేదు. సంఘము పోకడయు మానవుల సామాన్య సాంసారిక చర్యలే యొక మనోహరములగు నవల లాంటివి. దానిని చిత్రించుట కెక్కడ నుంచి ప్రారంభించి యెక్కడతో మనమాపినను ఒకటే. మన గ్రంథ ప్రారంభమే ఆ కథ యొక్క ప్రారంభము కాదు. మన మాపిన మాత్రమున ఆ కథ ముగిసినదని చెప్పుటకు వీలు లేదు. కాలశకటములో ప్రయాణము చేయుచు కవి చూపినంత మేరకు మనము చూచినాము. చూపని మేరలను కూడ చూడవలెనని యున్నను మనకు సాధ్యము కాక యూరకొనుచున్నాము. సంఘములో ఏ గ్రామములో లేక ఏయే వ్యవహారంలో ఏయే రంగములకు సంబంధము గలదో ఆయారంగముల నాయా వరుసను చిత్రించు కొనుచు పోయినచో చాలును. కారణాంతరములచే వాటికి ముందుండిన రంగములను విడువ వచ్చును. వాటి తరువాతి రంగమును చిత్రింపక పోవచ్చును. ఈ కారణముల చేత ఇట్టి నవలలను శ్రమపడి ఆలోచించి పన్నవలసిన వ్యూహం లేక చక్రము

(deliberate Plot) ఉండవలసిన ఆవశ్యకత లేదు సరేగదా అది యెంత లేకపోయిన కథ అంత స్వతస్సిద్ధమై యున్నట్లగుపించును.

చిత్ర విచిత్రముగా నల్లిన వ్యూహము (Plot) లేనిదీ, శౌర్య పరాక్రమాది రసప్రధానము కానిదీ, అద్భుతాశ్చర్యములు వెల్లిగ్రమ్మనిదీ, రహస్య పరిశోధకులు వెన్నాడి లోక కంటకుల గుట్టుమట్లు కనిపెట్టి పాఠకుల కుతూహలము తీర్చనిదీ విరహవేదనల తోడి విప్రలంభములు, సుందర పద్యముల తోడి మోహలేఖలు, శబ్దార్థ్యలంకార యుక్తములగు ప్రకృతి వర్ణనలు లేనిదీ నవలయేమిటి అని ఇప్పటి పాఠక లోకమున కచ్చెరువు కలుగవచ్చును. కాని యిట్టి విశేషములు సంఘములో నెప్పుడేని కలుగుచుండును గనుక కథలనియు, సదా సంఘములో నిల్చి జరుగుచుండవు కనుక సాంఘిక నవల కథ కాదనియు, కథకాని సాంఘిక చరిత్రలో నిట్టివి తరచు కలుగుచుండవు గనుక సాంఘిక నవల యిట్టి పై పై తెచ్చుకోలు విశేషము లేక, సాధారణ సంఘము వలె చల్లగా, సాధారణపు టచ్చటలు, ముచ్చటలు, కష్ట సుఖములు కోరికలు, ప్రయత్నములు జయాపజయములు మొదలగు వానితో గూడి సంఘము యొక్క సాధారణ సమయ వాహినీ చిత్రము వలె నలరార వలెను.

*– భారతి, 1932 ఆగస్టు*

# ఆంధ్ర భాషా పరిణామము

మానవులలో ఎట్టి పరిణామములు జరుగుచుండునో వారు మాట్లాడుచుండు లేక వ్రాయుచుండు భాషలలో కూడా అట్టి పరిణామములు జరుగుచుండుట సహజము. భరత ఖండము నందలి ప్రతి జాతియందును నేడు అత్యాశ్చర్యకరమైన పరిణామములు జరుగుచున్నవి. ప్రాత విశ్వాసములపై ఒక వరుసనుండి విరోధము, కొత్త సూత్రములపై నొక వరుసనుండి విశ్వాసము లేచుచున్నది. ప్రాతదే పరమావధి క్రొత్త దెల్లయు నీటిబుడగవలె తాత్కాలికమను భావములు కూడా ఒక ప్రక్కను రేకెత్తు చున్నవి. ప్రాచీన నాగరికత లేని దేశములలో వలె మనదేశమువంటి దేశములలో క్రొత్త పద్ధతులపై దుర్ద్రోహము ప్రబలుట సంభవింపదు. క్రొత్త దానిపై కెల్ల నెగ బ్రాకగోరు కొందరు చపలురుండు చున్నను, అనతి కాలములో వారికే ప్రాచీన చైతన్యతా జ్ఞానముదయించి, వారి భావములను మథించి మరియొక నూతన మార్గమునకు వారలను త్రిప్పివైచును.

అయినను దేనిని కాని క్రొత్తదను నేకైక కారణమున తృణీకరించుట లెస్సయును కాదు; సాధ్యమును కాదు. ఎవరెంత గింజుకున్నను "క్రొత్త ప్రాతల మేలుకలయిక క్రొమ్మెరుంగులు చిమ్ము" చునేయుండును. క్రొత్త దాని నేవగించుకొను వారును అవలంభించు వారును గూడ వాని తత్వము నామూలాగ్రముగా గ్రహించియే గర్హించుటయో. స్వీకరించుటయో చేయుచుందురు. మన భరతఖండమును, అందుగల వివిధ రాష్ట్రములును ప్రస్తుతము ఈ అవస్థయందే తటపటాయించుచున్నవి. ప్రాతవానిని విసర్జించుటకును వీలులేదు. క్రొత్త వాని ననేకమును స్వీకరించకయు తప్పదు.

ఈ విధమైన చైతన్యము వలన మన ఆంధ్ర భాష యెట్లు పలుభంగులుగా పరిణామము నందు చున్నదో గమనించుట యెంతయును అవసరము. ఈ పరిణామముల కన్నింటికి ఈ జాతీయ నూతన చైతన్యమే కారణమని చెప్పుటకు వీలులేదు. జాతులలో విజాతీయ సంబంధమైన నూతన సంచలనములు కలుగుచున్నను, మానుచున్నను కాలగమనమును పట్టి కూడా మార్పులును, పరిణామములును సంభవించు చునే యుండును. వేయి సంవత్సరముల క్రిందటి పదములును, ప్రయోగములును, వ్యాకరణ విశేషములును యెన్ని నేటికి

మాయమైనవో యెవ్వరూహింపగలరు? ఆనాటి వ్రాతప్రతులేవైన దొరికిన యెడల ఇది ఆంధ్రయేనా అను సందేహము మనకు కలుగక మానదు.

అయినను అస్థిరమైన భాషలు మారునంత వేగముగా స్థిరమైన భాషలు మారవు. స్థిరమైన భాషలలోకి యెన్ని మార్పులు వచ్చినను వాని యథారూపము ఒక రీతిని శాశ్వత ముగానే ఉండును. ఆంధ్రభాషకు నన్నయభట్టు కాలమున ఒక మోస్తరు స్థిరత్వమేర్పడినదని చెప్పవచ్చును. అతని తర్వాత సమ సిద్ధులైన కవిద్వయము అతని వరవడిని బట్టి తమ గ్రంథములు వ్రాయుచుండిరి. తరువాత కవులు తమ పదములు కవిత్రయ ప్రయోగములేనా అని ఒక ప్రమాణమును బట్టి కొలుచుకొనుచుండిరి. తరువాత నెందరో కవులు నూతన ప్రయోగములు చేయుచున్నను మహాకవి ప్రయోగముల కున్న గౌరవము అల్పకవుల వ్రాతలకు లేక మాడిపోవుచుండెడివి. మహాకవులు కూడా అనేకులు పుట్టి నూతన ప్రయోగములను నిరసించుచుండుట వలనను భాషకొక క్రొత్త మోస్తరు స్థిరత్వమేర్పడినది. ఇది పద్య కావ్యముల ధోరణి.

గద్య కావ్యములకును, పదకవిత్వములకును ఇట్టి నిర్బంధము లేవియును లేకుండెడివి. సాధారణ కవి మండలులు, వ్యాసకర్తలు, వ్యాఖ్యాతలు వాడుక భాషను విరివిగా ఉపయోగించి మహా కావ్యముల యందలి గూఢార్థములను తేట తెలుగులో ప్రజల కెఱుకపరచుచుండిరి. ఈ వ్యావహారిక భాషా వ్యాఖ్యానములు విరివిగా నుండుట వలన కావ్యభాష ప్రాతగిల్లక, ఏనాటికిని సరిక్రొత్తదగు నూతనత్వముతోనే రాణింపజొచ్చినది. ఈ విధముగా ప్రాతక్రొత్తలు సస్నేహముగా సరళరీతిని మధ్యయుగము లేక రాయల యుగము దాకా వర్ధిల్లినవి. రాయల యుగములో నాంధ్రభాష ఒక మహౌన్నత్యదశ ననుభవించినది. ప్రాత పురాణ కవిత్వములోనికి క్రొత్త ప్రబంధ ఫక్కీలు ప్రవేశించినవి. క్రొత్త కల్పనలు నిరాఘాటముగా సాగుచుండినవి. వీనితో కూడా క్రొత్త ప్రయోగములు విరివిగా దూరినవి. కవులను పోషించుట, కవిత్వములను వినిపించుట, రాజులకు మంత్రులకు, శ్రీమంతులకు పరిపాటియైనది. ఆకాలమున పుట్టిన ప్రబంధములకును, కృతులకును అంతులేదని చెప్పవచ్చును. నేటికి అచ్చుపడిన వెన్నోపడగా మిగిలినవెన్నో తంజావూరు భాండాగారమునందును గృహస్థుల గృహములందును మిగిలియే యున్నవి. ప్రతి గృహస్థునకును తానొక కవి

కుటుంబము వాడనని చెప్పుకొనుటకు గర్వముగా వుండెను. ప్రతి కవియు తన తాత ముత్తాతలెటువంటి కవులో యే యే గ్రంథములువ్రాసెనో గ్రంథాదిని యేకరువు పెట్టుకొనుట సంప్రదాయమైనది. జన సామాన్యములో కవి జనాదరణము హెచ్చిపోయెను. ఎవనికే విద్యయున్నను ఏ విద్య లేకున్నను నోటిలో నాలుగు మాటలుండి పద్యముల్లగల శక్తి యుంటే చాలును. దేశాటనము గౌరవముగాచేయగల ఆధారము లభించుచుండెడిది. ప్రతి మహాకవియు అనేక సాధారణ కవులను తన శిష్యవర్గము క్రింద భావించి తరిఫీదు చేయుచుండెను. రానురాను సాధారణ లేఖలును నిత్య వ్యవహారములును కూడా కవిత్వ భాషలో జరుపుకొనుట యొక విశేషముగ నెంచబడెను. ఇవి నిజముగా ఆంధ్రభాషామతల్లికి అధిక సౌభాగ్యదినములు. దేశములో యెన్ని యుద్ధములు వచ్చి యెందరు ప్రాతరాజులు కూలి క్రొత్త సంస్థానములు క్రొత్త గద్దెలు యేర్పడుచున్నను, కవితా పోషణమును కవితా ప్రసంగములును యధారీతిని సాగుచునే యుండెను. క్షత్రియులు, రెడ్లు, వెలమలు, సమస్త పౌరుష జాతులును కవిపోషణము నేమరకనే యుండిరి. కనుక విజ్ఞానము వేయి చేతుల రేడు వలె దేశము నంతటిని వెలిగించుచునే యుండెను.

ఈ ప్రబంధ భాష యింత విజృంభించి కూడా, కవిత్రయము భాషను వెనుకకు త్రోయలేదు. నేటికిని ఈ ప్రబంధము లెంత సుగ్రాహ్యము లై యున్నవో తిక్కనాదుల భాష కూడా అంత సుగ్రాహ్యమై యున్నదన్న ఆంధ్రభాష యొక మోస్తరుగా స్థిర స్వరూపమును వహించియున్నదని చెప్పుట కాటంకమేమి కలదు? అయినను స్థిరత్వమునే ఒక మోస్తరు దేవతగా భావించి పూజింపమొదలు పెట్టినచో అనుకరణము ప్రబలి అసలు చైతన్య మంతరించక మానదు. పిదప కాలపు ప్రబంధముల కిట్టి దోషమే కొంతవరకు పట్టి పోయినది. ఈ స్థితికి ఆ కాలపు కవుల స్థిరత్వారాధన మొక్కటియే కారణము కాదు. ఆంధ్రజాతీయ చైతన్యమే మందగించిన రోజులవి. ఆంధ్రుల శిల్ప నైపుణ్యము, క్షాత్ర ప్రజ్ఞ, వైదిక దీక్ష, ప్రాచీన గౌరవ సంప్రదాయ పరిరక్షణము మొదలగు సుగుణములెల్లయు వసివాళ్లు వాడినవి. అంతకు ముందుండిన దేశీయ – అల్లకల్లోలము లడుగంటి బ్రిటీషు ప్రభుత్వము వారి వర్తక వాణిజ్యముల కనుకూలమైన శాంతి వాతావరణమేర్పడినది. దేశస్థులందరి ప్రజ్ఞలును ఆ ప్రభుత్వనీతిని పోషించుదెసనే వ్యాపింపజొచ్చినవి. ఆంధ్ర సంస్కృత భాషలలో

పాండిత్యము, బిరుదుల కంటె ప్రభుత్వము వారిచ్చు బియ్యే, ఎమ్మే, టైటిల్సు మీద వ్యామోహము హెచ్చినది. ఆంధ్రభాషోపన్యాస ధోరణి యందు కంటె ఆంగ్లేయ భాషా వాచాలత్వమునందు చపలత హెచ్చినది. గ్రామములలోని పెద్ద మనుష్యుల తీర్పుల యందు కంటె జిల్లాకోర్టు హైకోర్టుల తీర్పుల కెగ్రబాకు ఆసక్తి పెరిగినది. స్వదేశీ వస్త్రములు, బొమ్మలు, కత్తులు, ఆయుధములు, వస్తువుల కంటె విదేశీ వానిపై కులుకు వర్ధిల్లినది. ఆంధ్రభాషయందును, ఆంధ్రాచారముల యందును గల ఆసక్తి యొక మోస్తరు చాదస్తము క్రింద భావించ బడినది. వాని యందింకను దీక్షగల వారికి శ్రీమంతులిచ్చు పారితోషికములు దానములుగా భావించబడుట వలన, వానిని స్వీకరించువారి ఆత్మగౌరవము క్రుంగిపోయినది. ఆంధ్రభాషామతల్లికి దుర్దినములివి. పిల్లల పాఠ్యపుస్తకములు మినహాగా మరియెట్టి యుద్గ్రంథములును ఈ కాలమున పొడమలేదు. అవి తప్ప యితర గ్రంథములు చెల్లలేదు. విద్యాశాఖ వారి పోషణము తప్ప సాహిత్యలేఖాభివృద్ధికి వేరు మార్గము లేదాయెను. క్రమక్రమముగా కవి సంతానము లడుగంటినవి. ప్రతి వానికిని ద్రవ్యాపేక్షయు, ఉద్యోగ పరవశత్వమును నిత్యవిధులైనవి. ధీమంతులకు కొందరికి ఆంధ్రవిజ్ఞానాభిలాష యుండినను అది కేవలము భేషజమాత్రమై యుండెను. స్వజాతీయ చైతన్యము నశించిన జాతికి ఇట్టి దుర్గతి పట్టుట ఆశ్చర్యము కాదు.

ఈ విధముగా 1907వ సంవత్సము వరకు వచ్చితిమి. బంగాళా విభజనము ధర్మమార్గంలో ఒక వినూతన జాతీయ చైతన్యము ఆసేతు శీతాచల పర్యంతమును చెలరేగినది. భారత జాతి జాతులన్నిటికి వలెనే ఆంధ్రులకును మెలుకువ కలిగి ఉదాసీనత వీడినది. ఆంధ్ర భాషయందు, ఆంధ్రజాతీయత యందును, ఒక భక్తి ఉదయించినది. దీనితో ప్రాచీన విజ్ఞాన పరిశోధనము, చరిత్ర స్మరణము, ప్రబంధ పఠనము తలయెత్తినవి. విద్యాధికులు, అందునను విద్యార్థులు కళాశాలలో నేర్చుకొనుచుండు విషయములతో తృప్తిపడి యూరకుండక తీరిక యైనప్పుడెల్లా ఆంధ్ర గ్రంథ పఠనము నవలంబించి అందలి సారస్యమును గ్రహింపజొచ్చిరి. తాము పఠించుచుండిన ఆంగ్ల కవుల విశిష్ట మహత్త్వమును గుర్తించి తమ భాషలో అట్టి మార్పులను తెచ్చుటకై కంకణము కట్టుకొనిరి. ఆంగ్ల సాహిత్య చరిత్రము వలె ఆంధ్రసాహిత్య చరిత్రమును యే యే కాలముల నెట్టి యెట్టి పరిణామములకు పాత్రమైనదో యూహించి వ్రాయజొచ్చిరి. కోటి ప్రబంధములున్నను అందులోని

విషయమును విమర్శించి రసమును వెలిబుచ్చి విమర్శకులు లేకుండుటే ఆంధ్ర భాషా నీరసత్వమునకు కారణమని ఊహించి విమర్శక గ్రంథములను వ్రాయజొచ్చిరి.

పాఠశాలలో ఆంగ్ల భాషకు పట్టము కట్టబడినదనిన్నీ, ఆంధ్రభాష తోడపెళ్ళి కూతురువలె కూర్చున్నదనిన్నీ, అందులో నేర్పబడు విషయములు యేదో వెట్టికై మాత్రమే చెప్పబడుచున్నవనిన్నీ దేశస్థులు గ్రహించినారు. ఆంధ్రభాష కధిక ప్రాముఖ్య మీయవలెననిన్నీ, ఆంధ్రవిశ్వవిద్యాలయము స్థాపించ బడవలెననిన్నీ, ఆంధ్రరాష్ట్రమేర్పడవలెననిన్నీ మొట్టమొదలు ఆంధ్రదేశమునందు జాతీయాం దోళనము ప్రభవించినది. పాఠశాలలోని గద్యపాఠ్య గ్రంథముల భాష సనాతన గద్య గ్రంథభాష కాదనిన్నీ, గద్యభాషలో అనేక వ్యావహారిక పదాలూ రూపాలు అనుశ్రుతంగా వాడబడుచూ ఉండేవనిన్నీ, ప్రజాసామాన్యం సులభంగా గ్రంథాలు చదువవలెనన్నా వ్రాయవలెనన్నా వాడుక భాషారూపాలు జోరుగా గ్రంథాలలో ఉండవలెననిన్నీ, వాడుక భాషపై పూర్వకాలంలో ఇప్పుడున్నంత వెగటూ, ఏవగింపూ లేక అటువంటి ప్రయోగాలు కవులు తమ పద్యకావ్యాలలో కూడా ధారాళంగా వాడుతూ వుండేవారనిన్నీ, ప్రస్తుత గ్రాంథిక భాష కేవలం కృతకభాష అనిన్నీ, దానికి నిజమైన వాడుక భాష కుండే సౌందర్యం రాదనిన్నీ, శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారు, వైగరాలు తమ పరిశోధనలు ఉదాహరణ రూపకంగా అఖండమైన ప్రచారం చేశారు. చెళ్ల పిళ్ల వెంకట కవీశ్వరుని వంటి శతావధాన్లు కూడా ఈ వాదన నంగీకరించి ఈ భాషలో నేడు ధారాళంగా గద్యం వ్రాసేస్తున్నారు. ఆ గద్యం గ్రాంథిక భాషకంటే వేయిరెట్లు అందంగా వుందని కూడా మనము అంగీకరించక తప్పకుండా వుంది. వాడుక భాషమీద నిరసన దండయాత్ర చేయడం ఇప్పుడు అవివేకం, వ్యర్థం కూడాను. అయినా బ్రిటిషు పాఠశాలలు స్థాపించబడినప్పటినుంచీ ఈ కృతకభాషలో వ్రాయడం మన కభ్యాసమయ్యే వుంది. వాడుక భాషలో వ్రాద్దామని కలంపట్టుకున్న మహారథులకు కూడా అప్పుడప్పుడు 'వచ్చింది' అనేదానికి బదులు 'వచ్చినది' అనో ఐతే అనుటకు-ఉదులు అయినను అనో, వచ్చాను అనే దానికి బదులు వచ్చితిమి అనో పూర్వపదం పడుతూనే వుంటుంది. కృతక భాషే అనండి మరే భాషో అనండి ఆ భాషలో ఉండే ప్రయోగాలనన్నిటిని బహిష్కరిస్తూ గ్రంథాలు వ్రాయగల గడుసరి నేటివరకు యెవరూ పుట్టలేదు. బహుశా ఒక్క రామమూర్తి పంతులుగారు వారి వంటి ఒకరిద్దరు మినహాగా.

ఇక శుద్ధ గ్రాంథిక భాషలో వ్రాయగలవారు అసలే శూన్యంగా వున్నారు. ఇదుగో నేను లేచానని యెవరైనా అన్నారా! 'దీనిలోని ప్రయోగాలు శుద్ధ తప్పులు, ఈ పదాలు కేవలం వాడుకలు' అని యెవ్వరైనా చూపించవచ్చును. ప్రస్తుతం మన భాషాస్థితి ఈ రెండింటి మధ్యనా ఉయ్యాలలూగుచున్నది. వ్యావహారిక భాషావాదము నంగీకరించకా తప్పదు. అంగీకరిస్తే దానికి హద్దులు నేర్పరచడమూ కష్టమే. ఉన్నవి అన్న శబ్దానికి ఉన్నాయి, ఉన్నయి, ఉన్నై మొదలగు ప్రాంతీయాలను వాడుతున్నారు. నిలుచుండు శబ్దానికి నిలుచౌను, నిల్చొను, నించొను, నుంచొను, శబ్దములను వాడుతున్నారు. వెళ్ళిన శబ్దానికి వెళ్లితే, వెడితే శబ్దాలను కూడా వాడుతున్నారు. వేళకు జ్ఞాపకానికి రావు కాని ఇటువంటి ప్రయోగాలు వందలూ వేలు పత్రికలలో కనబడుతున్నవి. కొన్నింటిని చూచి రామమూర్తిపంతులుగారే ఆశ్చర్యపడుతున్నారు. అయినా ఏ ప్రాంతంలోనైనా సర్వసాధారణంగా వాడుకలో వుండే ప్రయోగాల్ని ఇతర ప్రాంతాల్లో లేవన్న కారణం చేత యెట్లా విడనాడగలము? బహుశా ఇల్లాగు రెండు మూడు శతాబ్దాలు వెళ్ళేసరికి ఇవన్నీ మనకు ప్రాతగిల్లి ఆశ్చర్యకరంగా వుండక పోవచ్చును. అంత వరకు యెవరెవరే భాషలో వ్రాస్తున్నా ఆక్షేపించడానికెవ్వరికీ అధికారంలేదు. వీనిలో కొన్ని కేవల ప్రాంతీయములు కొన్ని అఖిల ప్రాంతీయములు వుంటవి. కేవల ప్రాంతీయములను కాదని అఖిల ప్రాంతీయములను వ్రాసేవారిని మనము కొనియాడవలసినదే. అట్లు కాదని కేవల ప్రాంతీయాలను వాడే వారిని కూడా మన మభినందించవలసినదే. కలగా పులగంగా వ్రాసేవారిని కూడా మన మభినందించక తప్పదు. రాగా రాగా యేమిటి తోచుచున్నదంటే జనులు వ్రాసే భాషలను బట్టి మనమట్టే పేచీలు పెట్టుకోరాదనిన్నీ, వ్రాసిన విషయము యొక్క ప్రశస్తను గూర్చియే యోచించవలెననిన్నీ తోచుచున్నది. విషయమును బట్టి భాషయొక్క ధోరణి మారుతూనే వుంటుంది. ఒక వ్యాసములోనే రెండు మూడు విషయములలాంటివి యెత్తుకోవలసి వస్తుంది. అటువంటప్పుడు ధరణి కూడా మారుతుంది. ఈ వ్యాసంలోనే భాషల తత్వములు, ఆంధ్రభాష పరిణామములు, మొదలైన విషయములను తీసుకున్నప్పుడు ప్రారంభించిన ధోరణికిన్నీ, వ్యావహారిక భాషావశ్యకతను నిరూపించవలసిన ధోరణి కిన్నీ యెంతో భేదము కనిపించుచున్నది. ఒకే ధోరణిలో వ్యాసమంతా సాగింతామంటే సాధ్యమైనదికాదు. ఈ ఒక్క వ్యాసమునే కాదు, నేనే గ్రంథమును వ్రాతామని

నిశ్చయించుకొని కూర్చున్నా, అది ఒక ధోరణిలో ప్రారంభం కావడం, మధ్యన మరియొక ధోరణిలోకి పోవడం, తరువాత మరియొక ధోరణికి రావడం ఇది మామూలై పోయింది. ఇది నా చేతకానితనమని యైన కొందరనుకోవచ్చును, విషయమును బట్టి ధోరణి అట్లు మారవలసి వచ్చినదని యైనా కొందరను కోవచ్చును. ఇదైనా నాఒక్కని నుదుటనే వ్రాయబడ్డ వ్రాతలాగ కనిపించలేదు. ప్రస్తుత వార్తాపత్రికా సుప్రసిద్ధ విలేఖరులనుకొనబడే అనేకుల వ్రాతలలో యింతో కొంతో యిటువంటి భేదము లగుపించుచున్నవి. తొలిచూపుకు ఇది వెట్టి వెంగళప్ప ధోరణుల వలె కన్పించును. కాని నిదానించి చూస్తే యిది యీ విధంగా యీ కాలంలో వుండక తప్పదు కాబోలు ననిపించుతుంది. కేవలం పాఠ్య పుస్తకములను వ్రాసేవారు కొంచెం పట్టు పూరాగా పూర్వపుధోరణిలోనే వ్రాస్తున్నారు. లేకుంటే అవి పాఠ్య గ్రంథములుగా అంగీకరింపరేమో అన్న భావం చేతను. అయినా వారు ఆ సమయముల యందు తీసుకునే అతి జాగ్రత్త, భయము, అవ్యగ్రత అందులో కనిపించుతునే ఉంటుంది. అయినప్పటికీ కేవల పాఠ్యగ్రంథములు ఆ ధోరణిలో ఉంటే వచ్చే ఉపద్రవం యేమీ లేదు. అవి బాలకులకు పాఠశాలలో ఉన్నంత కాలం గమనించవలసిన కొన్ని సూత్రములను మాత్రమే సూచించును కాని, పాఠశాలలను విడచి పెద్ద వారైన తరువాత వ్రాయగల గ్రంథములే ధోరణిలో వ్రాయవలెనో నిర్బంధించవు. కేవల పాఠ్యపుస్తకములు కాక గణితము, భూగోళము, చరిత్ర సైన్సు మొదలైన విషయములను వ్రాసే పుస్తకములలోని భాష ఇన్ని కట్టుదిట్టములతో ఉండవలెనని నియమించ నక్కరలేదు. ఏ గ్రంథకర్తకు ఏ ధోరణి యే సమయమున బాగుంటుందని తోస్తే ఆ ధోరణిలోనే వ్రాయవచ్చును. ఆ పుస్తకములను విద్యార్థులు పఠించడం ఆ ధోరణి కొరకు కాదు. ఆ విషయ విజ్ఞానము కొరకు. ఏ విషయమైనను సుగ్రాహ్యముగా ఉండవలెనంటే, ఆయా సందర్భములకు తగినట్లు గ్రంథకర్త ధోరణిని మార్చుకొనక తప్పదు. కనుక పాఠ్య గ్రంథ నిర్ణయ మండలులవారు పూర్వపు అధికారములతో విఱ్ఱవీగి, నవీన గ్రంథములను ధోరణుల కారణముగా త్రోసివేయరాదు. విషయము మనోహరమై, ఆవశ్యమై యున్నప్పుడు, గ్రంథము ప్రవీణునిచే వ్రాయబడినప్పుడు వారు దేనినైనను అంగీకరించక తప్పదు. లేని యెడల యేవేవో కొందరికిష్టమైన శయ్యా పద్ధతుల నభివృద్ధి పరచుట కొరకు ప్రశస్తమైన విషయములనే త్రోసిరాజు చేసిన నేరము వారియందు నిలచును.

దుష్ట ప్రయోగం నిర్దుష్టప్రయోగం అన్నశబ్దాలకిప్పుడు పాటించుచున్న అర్థములు తృప్తికరములు కావు మిత్రులు, అదృష్టవంతుడనుటకై అదృష్టుడు, పంథా, క్రుసించుట, కలస్త (కలసి), వ్రాశి, పుస్తుకం, యీ మొదలైనవానిని దుష్ట ప్రయోగము లనవలెను. రాతిరి యనుటకు రేతిరి, లేచియనుటకు లెగిసి, పోతుంది అనుటకు పోతాది, వస్తుంది అనుటకు వస్తాది- ఈ పదములను ఇప్పటివరకు శిష్టులుపయోగించకుండా వున్నారు. గనుక ఇటువంటి వానిని కొంచె మెడబెట్టుట మంచిది. తెలుగు బూతుమాటలను దుష్టములనక తప్పదు గదా! ఇటువంటి వాటిని మినహాగా తక్కిన వానినెల్ల నిర్దుష్టములుగానే భావించవలెను. భారతబొగ్గు, ఇండియన్ భీమా, తపాలాఫీసు మొదలైన మిశ్రసమాసములి నెందరో వ్రాయుచున్నారు. వీనిపై కినిసిన లాభములేదు. ఇటువంటి వన్నీ పాఠకులకు బాగా పరిచయమైతేనే కాని, ఈ సమస్యలను గూర్చి వ్రాయువారు తమ భావములను ధారాళముగా ముందు ముందు ప్రసంగించ గలుగుట కవకాశము లేర్పడవు. ధోరణులు మార్చుకొనుట కెట్లు లేఖకులకు స్వాతంత్ర్య మీయబడుచున్నదో మిశ్రసమాసములపట్ల కూడా అట్లే స్వాతంత్ర్యము నీయవలెను. కాల కొల్త, వేద పంట మొదలైన సమాసములనే నేను కొన్ని సందర్భముల యందు వ్రాసితిని. ఇటువంటివి అపూర్వములని చెప్పి విడచి పెట్టితే చాలును.

ఇక పదములను ప్రయోగములను విడచిపెట్టి వాక్యరచనా పద్ధతికి వత్తము. కొందరు వ్రాయు వాక్యములలో కర్తృవాచకమును పోల్చుకొనుట కష్టము. తరచుగా అది క్రియకు చాలా దూరమై యుండును. కర్త్రర్థకములో ప్రారంభించబడిన వాక్యములు కర్మార్థకములోను, కర్మార్థకములో ప్రారంభించబడిన వాక్యములు కర్త్రర్థకములోను, ఏకవచన కర్తకు బహువచన క్రియము, బహువచన కర్తకు యేకవచన క్రియము ఈ మోస్తరు లోపములుండుచుండును. వ్రాసిన వ్యాసమును పునః పఠన మొనరించినచో ఇవి యన్నియును తొలగగలవు. విశేషణములకు విశేష్య మొకప్పుడు దూరమై వేరొక విశేష్యమునకు సంబంధించి నట్లగుపించును. కామాలు, సెమికోలనులు, హైఫనులు, అడ్డుగీతలు మొదలగు వానిని పెట్టుటలో కొందరే సూత్రమును కాని యాదస్తులో పెట్టుకొన్నట్లు కనిపించదు. ఇటువంటి వాని నన్నింటిని భాషా సంస్కరణములనిన్నీ, నవీన పంథాలనిన్నీ సమర్థిస్తున్నో, అలక్ష్యం చేస్తున్నో విడచిపెట్టుటకు వీలులేదు.

చిన్న చిన్న వాక్యములు వ్రాస్తే ఇట్టి చిక్కులనేకము తొలగి పోవును కాని కొన్ని భావములను చిన్న చిన్న వాక్యములుగా త్రుంచివేయుటకు వీలులేని సందర్భములలో వాటిని వ్రాయక తప్పదు. శాసనములలోని క్లాజులు, తీర్మానములలోని వాక్యభాగములు (Phrases) విడ దీయుట కెట్లు సాధ్యము? కనుక వీనిని వ్రాయునప్పుడు లేఖకులు జాగ్రత్తగా ఉండవలెనని ఉషారు చెప్పుటకంటే మన మధికము చేయజాలము.

ఇవికాక విభక్తుల ప్రయోగములలోనే మునుపటికిని, ఇప్పటి వాడుకకును భేదము కనిపించుచున్నది. నా వల్ల కాదు అనుటకు అతి తరచుగా నా చేత కాదనుచున్నాము. దాని యందు లేక వాని యందు కున్ను దానిలో లేక వానిలో అనువిభక్తులకున్ను భేదము చేయక కలగాపులగముగా వాడుచున్నాము. వానికి చెప్పితిమి అనుటకు వానితో చెప్పితిమనుచున్నాము. ఇటువంటి సందర్భములలో సరియైన విభక్తిని ప్రయోగిస్తేనే వికారముగానూ, వాడుకలోని విభక్తిని ప్రయోగిస్తేనే సబబుగాను కనిపించును. బహుళములు, ఆదేశములు మొదలగు వాని మూలకముగా చిన్నయసూరిగారు ఇటువంటి మార్పులు కొన్నింటికి శాంక్షను ఇచ్చి యున్నారు గనుక వానిలో ఈ మొదలైన వానిని నవవ్యాకరణవేత్తలు చేర్చవలసి యుంటుంది.

ఇంతవరకు పదములు వాక్యములను గురించియే మన మాలోచించి యున్నాము. ఇక విషయమునకు వత్తము. కేవలము సాహిత్యమును గూర్చిన శ్రద్ధ ప్రపంచమునందే నానాటికిని సన్నగిల్లుచున్నది. కేవల సాహిత్య పరిజ్ఞానమును చర్చలకును యెవరెవరో రసికుల యొక్క విలాసములకు విడచి పెట్టవలసినదిగాను, విషయ పరిజ్ఞానమే మానవులకు పరమావధిగాను నేడు తలచబడుచున్నది. ఏదో హిస్టరీయో, జాగ్రఫీయో, సైన్సో, రాజకీయ గ్రంథమో, అర్థశాస్త్ర ప్రసంగమో, కో ఆపరేషను భోగట్టాయో, లేబరు సమస్యయో, రైతుల బాధలో అయితే జన సామాన్యము దానివైపునకు దృష్టిని పరపుచున్నారు. కవిత్వమో, కళయో అయితే దానిని మూజూచి విడచుచున్నారు. అధవా అట్టివానిని వంటికి పట్టించుకున్నను, కాస్త తీరిక సమయ విలాసముగా మాత్రమే భావించుచున్నారు. పద్యాలను, పాటలను తమ పత్రికలలో ప్రకటింపనొల్లని అనేక ఆంధ్ర ఆంగ్ల పత్రికాధిపతులు నేడు వేనవేలున్నారు. ఆఖరుకు చిన్న కథలకు గూడా ఒక మూల తావివ్వని పత్రికలు కొన్ని ఉన్నవి.

పత్రికలు బహిష్కరించినంత మాత్రమున వాని ప్రతిభ కొరత పడదనియు, వాని యెడల జన సామాన్యమునకు నిజమైన ఆసక్తి ఉండుచునే యుండుననియు మనము ఖచ్చితముగా చెప్పవచ్చును. కాని వానికి తీరిక సమయములందలి విలాసములకు తగినంత స్థానమును మాత్రమే యివ్వవలెననుటయు సమంజసమే. నేడు జాతులభావము లెల్లయు మహాందోళనముతో తల్లడిల్లుచున్నవి. ఆంధ్రజాతి భావములును నట్లే యున్నవి. పంటలెంత యెక్కువైతే కాటుక యంత యెక్కువగుటకు విజ్ఞాన (Science) మెంత యెక్కువైతే అజ్ఞానమంత యెక్కువగుటకు, కోర్టులెంత యెక్కువైతే నేరములన్ని హెచ్చుచుండుటకు, బోధలెంత యెక్కువైతే అనాచారము లేక అనాచరణ మంత వృద్ధి పొందుటకు, సైన్యములెంత వృద్ధి యైతే అశాంతి అంత వర్ధిల్లుటకు కారణము లెవ్వియో ప్రజలు తెలుసు కొనుటకు తల్లడిల్లి పోవుచున్నారు. ఈ మహా రహస్యములు బట్ట బయలు కానిదే ప్రపంచవాసులందరికినీ నిజమైన శాంతి కాని సౌఖ్యముకాని కలుగనేరదు. ఒక్కొక్కరొక్కొక్క సిద్ధాంతమును పట్టుకొని యుద్ధమునకు వచ్చుచున్నారు. ఈ మహాకల్లోలములో శాంతి నెలకొనగలదా యను ఆశకూడా అంతరించుచున్నది. ఈ కల్లోలమెంత వృద్ధి యైతే విప్లవ వాదులంత మంచి దంటున్నారు. దీనిని చూచీ చూడడములో శాంతివాదులు బెగ్గిలిపోయి తమ పురాతన పద్ధతులను మరింత కట్టుదిట్టము చేసుకొనుచున్నారు. ప్రతీవాదము నందును పైకి యెంత మేలు కనిపించితే లోపల నంత గుల్ల యున్నట్లు స్పష్టముగ కనిపించుచునే యున్నది. అయినా, సిద్ధాంతాలు ఆ మాటకు ఒప్పుకొనకున్నారు. ఈ విషయములను గూర్చి నిష్పాక్షికముగా ఆలోచించి ప్రజలకు సత్యమును నిరూపించవలసిన బాధ్యత ప్రతి విద్యార్థికుని యందును గలదు.

అయినను ఈ ప్రచారము కూడా అంత సులభ సాధ్యమైనట్లు కనబడదు. ఒక ప్రక్కన ప్రభుత్వముల నుండియు వేరొక ప్రక్కన ప్రతిపక్షములనుండియు అట్టివారిపై దోషపరంపరలైన శిక్షణలో దూషణలో కురియుచునే యుండును. ఎవ్వరి విశ్వాసము లెట్లాటి వైనను, తీరా నోరు విప్పేటప్పటికో, కలము తీసేటప్పటికో, పూర్వాపరసంశుద్ధి కొరకో, కొందరికి అహితముగా ఉండకుండుట కొరకో, తద్వ్యతిరేకమైన వాక్యములను తెలుపవలసి వచ్చుచుండును. మనసులో ఉన్న మాటంతా పైకి చెప్పితే చాలును, అనేకులకు తమ రాజకీయ

నాయకత్వములు గాలిలో నెగిరిపోవునోయని భయము. ఉద్యోగములూడి పోవునో అని భయము. నిజమైన సత్యాన్వేషు లెప్పటికిని ఉండనే ఉందురు. ఒకప్పుడు తామేదో మాట అన్నాము కదా అని ఊరుకొనక, భావము మారినప్పుడు క్రొత్త దానిని చెప్పుచునే యుందురు. రాజకీయ నాయకత్వమును పాటింపరు, ప్రపంచ ప్రశంసల కొరకు తూగులాడరు, ఉద్యోగములు పోయినను సరకు చేయరు. నిదానము మీద అట్టివారి మాటయే నిలుచును.

ప్రస్తుతం, ఆంధ్రదేశము నందుగల ప్రతీసమస్యను ఈ రీతిని తర్జన భర్జన చేసి నిజమును నిరూపిస్తూ బోధించగలవారు అవసరం. ఇందుకై వారు ఒక రాజకీయములేమి, ఆర్థికములేమి, సాంఘికములేమి, శాస్త్రీయములేమి, ఆధ్యాత్మికము లేమి, సమస్త సమస్యలను పరిశోధనము చేసి తేటతెలుగులో వారి భావములను వ్రాయుచుండవలెను. ఆంధ్రదేశమిప్పుడీ యుగములో తేలుచున్నది. కవీశ్వరులీ గీతములను పాడుచున్నారు. వక్త లీ ప్రసంగముల నల్లుచున్నారు. విద్యాశాలలు వీనిని తమ ప్రణాళికలో చేర్చుకొనజూచుచున్నవి. రాజకీయ వాదులీ మార్పుల నాచరణములో పెట్టుటకై ప్రయత్నించుచున్నారు. ఈ మహాకల్లోలములో ఉత్తములైన వారందరికిని యే పదము, యే ధోరణి సులువైనట్లు కనిపించితే దానిని వాడి తీరుదురు.

ఇది కాక మనమిప్పుడు నేర్చుచున్న ఈ ఆధునిక విజ్ఞానమున కంతకును మనకు మాతృక ఆంగ్లభాష. దాని పోలికలు, వాసనలు, పదములు, పరిభాష వద్దన్నను మనకు తప్పదు. అదే యిప్పటి రాజకీయ భాష, ఎలక్షనుల భాష, వైద్యభాష, సహకారుల భాష, శాసనకారుల భాష. జనులందరికిని దీనిని గూర్చిన ఆంగ్ల పదములు నోరు తిరుగునట్లు తెలుగు, సంస్కృతం తర్జుమాలు నోరు తిరగవు. ఆంధ్రదేశము బహువిశాలమైనది. కన్నడ భాషా ప్రాంతీయులకు అనేక కన్నడ పదములు ప్రయోగములు, అరవ భాషా ప్రాంతీయులకు కొన్ని ఉరుదు మర్యాదలు, తమ స్వంత భాషలోని వానివిగానే అల్లుకొని పోయినవి. ఇది కాక మండల భాషకును, యాసకును భేదమెంతో కొంత ఉండనే ఉన్నది. రెయిళ్లు లేని కాలములో, పరిచయములు తక్కువైన కాలములో ఇవి ఒక దాని కొకటి సవతి బిడ్డలవలె కనిపించుచుండవచ్చును. బ్రిటిషు గవర్నమెంటు ధర్మమంటూ, కాంగ్రెసు ధర్మమంటూ, ఆంధ్రనాయకుల ధర్మమంటూ, ఆంధ్రమంతా ఒకే

రాష్ట్రము, ఒకే భాష, ఆంధ్రులు ఒకే జాతి అను భావము బాగుగా పాదుకొనినది. నేడు మనము దూరదూరపు బంధువులవలె మాచీ మాడనట్లు కాలక్షేపము చేసుకొనుటకు వీలులేదు. ఇంతకుముందు మనకిట్టి పరస్పర సంబంధములు తక్కువగా ఉండుట వల్లనే ఒకరికొకరము దూరస్థులవలె కనిపించితిమి. కాని రాకపోకలు, ఉత్తర ప్రత్యుత్తరములు, సంబంధబాంధవ్యములు యెక్కువయై యుండినచో ఆంధ్రభాషలో ఇట్టి ప్రభేదము లుండకపోయెడివేమో?

ఈ భేదములను చెరుపుకొని మనమందరము నేకకుటుంబము వారమని గ్రహించవలసిన తరుణమిది. కనుక మీ ప్రాంతముమాట మాకు తెలియదు, కనుక దానిని వ్రాయకూడదు అని ఒకరినొకరమనుకొనకూడదు. ఏ మండలమునందలి పెద్దలు అక్కడి పరిభాషలో తమ సమస్యలను గూర్చి వ్రాయుచు ప్రసంగించుచు ఉండవలెను. తక్కిన మండలముల వారెల్లరును వానిని ఆనందముతో పఠించి గ్రహించుచుండవలెను. ఇట్లు ఒక పది సంవత్సరముల పాటు జరిగినచో ఆంధ్రుల పదబాహుళ్యము, విజ్ఞానము, పరస్పర స్నేహము, సంపద, సౌభాగ్యము వర్ధిల్లును. మనము తోడి జాతుల వారందరితో సమానులమై, భారతీయ నాగరికతకు పెట్టని కోటలము కాగలుగుదుము. గుజరాతీ, బెంగాలీ, హిందీ, మహారాష్ట్ర భాషల వారందరును ఈ రీతిగానే తమ విజ్ఞానమును, భాషలను, సమస్యలను, సర్వమును పరిష్కరించుకొని సత్వరాభివృద్ధిని పొందుచున్నారు. మనము కొన్ని పెడబోధనలు వినియో, వేరు చింతనలు చొక్కియో పాతిక సంవత్సరముల క్రిందట ప్రారంభించిన ఈ శుభ ప్రదాందోళనము యొక్క ఫలితమును నేటివరకును అనుభవింపజాలకున్నాము. ఈ విధమైన సర్వతోముఖాందోళనము జరుగుటకు భాషయొక్కటియే ప్రశస్త సాధనము. కనుక ప్రతిభాషాసేవకుడును తన చాకచక్యమును, ప్రతిభను, విజ్ఞానమును ప్రకటించుకొనుటకై భాష కెన్ని విధములగు చక్కని మార్గములను గూర్చవలెనో అన్నిటిని గూర్చగడంగును గాక! వచ్చీరాని జ్ఞానముతో తెలిసీ తెలియని పదాలను ప్రయోగించి ఇదంతా భాషా సంస్కారమే అని భావించుకొను వెర్రితనము లేకుంటే చాలును. భాషా పోషకమైన, ప్రతీ విధమైన మార్పునకున్ను స్వాగతం! సుస్వాగతం!!

**— ఏప్రిల్, 1938. భారతి.**

# ప్రపంచమంతా అక్షరాలు – అంకెలే

*(25–10–1938వ కేశవరంలో ప్రోగ్రెసివ్ రైటర్ల మహాసభ – ఆంధ్ర రచయితల సభాధ్యక్షులు – గరిమెళ్ళ సత్యనారాయణ ప్రసంగం)*

## లేఖకులంతా ఒకే కుటుంబము వారు

లేఖకులందరూ ఒకే కుటుంబమునకును, సోదర వర్గమునకును చెందిన వారనుటలో నాకెట్టి సందేహమును లేదు. కొందరు పురాణములు వ్రాసినా, కొందరు ప్రబంధములు వ్రాసినా, కొందరు నవలలు వ్రాసినా, కొందరు నాటకములు వ్రాసినా, కొందరు దేశచరిత్రలు, భూగోళశాస్త్రము, విజ్ఞాన విషయములు, రాజకీయోపన్యాసములు వ్రాసిన కొందరు వ్యాకరణ, సాహిత్య, శాసన, వైజ్ఞానిక పరిశోధనలు చేసినా వీరందరి ఆశయమును నొక్కటే. లేఖకునికి కలిగే రెండు శక్తులు ప్రోద్బలము చేయుచుండుట వలననే వారు లేఖనమునకు గడంగుదురు. వీనిలో మొదటిది ఆత్మతృప్తి. రెండవది పాఠకుల నుత్తేజింప జేయవలెనను ఆసక్తి. ఈ రెండు సంకల్పములలో నేదియు లేని వ్రాతలు వ్రాతలే కావు. అవి కేవలము అక్షరముల ప్రోవులు.

## లేఖకులకు ఆత్మతృప్తియే ప్రధానం

వీనిలో మొదటిదే లేఖకునకు ప్రధాన ప్రోద్బలము. మేఘములు వర్ష ఋతువులలో వర్షము కురువకుండా యెట్లూరుకొనజాలవో, నాటబడిన బలిష్ఠ బీజములు ఫల వృక్షములు కాకుండా యెట్లు తప్పించుకొనజాలవో, భానుడు ఉష్ణమును, శశి శైత్యమును, మారుతము హాయిని యెట్లు ప్రసరించకుండా ఉండజాలవో, ఉత్కృష్ట భావస్థ గతులైన లేఖకులు తమ భావములను చాటకుండా ఊరకొనజాలరు. దుర్విమర్శనలు వారికి జంకును కలిగించవు. దుష్ట శాసనములు వారి కలములను విడువజాలవు. వినువారును, చదువువారును ఉండరన్న చింత వారిని నిరోధించజాలదు. ప్రకటనము కాదన్న బాధ కూడా వారిని బాధింపనొల్లదు. వారి ఆత్మగత భావాలను వారు గ్రంథ రూపేణా కాపాడుకొనుచునే ఉందురు. మనం వినకపోతే వారి ఆవేశమేమైనా అరికట్టబడుతుందా! లేఖకులకు కలిగే

మొట్టమొదటి ప్రోద్బలము వారి ఆత్మల నుండియే వచ్చుచున్నదనుటకు సందేహము లేదు.

## ప్రబోధం కలుగ జేయవలెననే ఆసక్తి

అయినను రెండవ ప్రోద్బలమును కూడా మనము ఈసడించ వీలులేదు. ఇదియే పాఠకుల నుత్తేజింప చేయవలెనను ఆసక్తి ఆత్మప్రోద్బలము వలన లేఖకునకు సగము తృప్తియే తీరును. రెండవ దాని మూలముగానే పూర్తిగా తృప్తి కలిగి జన్మ సార్థక జ్ఞానముదయించును. తన దేశస్థ సోదరులు చదివి ఆనందించ వలెనని తన దేశము పురోభివృద్ధికి రావలెనని, భారతదేశము ప్రపంచదేశముల నెల్ల కిరీట తుల్యము కావలెనని ఆందోళనపడకుండా వ్రాసే లేఖకుడు ముఖ్యముగా ఈ యుగములో భారతదేశమందు లేడనియే చెప్పవచ్చును. రెండు పంక్తులో వేయి గ్రంథములో వ్రాసినంత మాత్రముననే కృతకృత్యుడైనట్లు భావించుకొనేంత పిచ్చివాడు యీ యుగములో లేడు. వ్రాసేదాకానే మొదటి ప్రోద్బలము తొందరపెట్టుచుండును. కాని వ్రాసినది ప్రజలెల్లరును చదివి ఉన్నతాశయ పూరితులై దేశము నూతన కళాసంకలితమై, పరిణమించేదాకా రెండవ ప్రోద్బలము లేఖకులను అల్లరి పెట్టుచునే యుండును. అప్పటికి కాని, వారికి సంపూర్ణ పరితృప్తి చేకూరదు.

## లేఖకుల పట్ల నిరాదరణ

అయితే ప్రజల హృదయముననే విజ్ఞానము నెక్కించి వారి నుత్తేజింప చేసి, దేశమును నూతన ప్రభాభాసమానముగా చేయడమనేది, కలము, కాగితము పట్టి వ్రాసుకునేటంత సులభమైన పనికాదు. ప్రస్తుతం మన దేశములో ఎందరోకవులు, లేఖకులు, వ్రాయుచున్న పాటలు, వ్యాసములు, తయారుచేసిన గ్రంథములు, వారి వ్రాతప్రతులను దాటి వెలుపలకు రానేరకున్నవి. అథవా, అచ్చయిన గ్రంథములు కూడా, తమ స్వంత బీరువాలను దాటి వెలుపలకు కదలక వారి ననేక కష్టముల పాలొనరించుచున్నవి.

ఇంటింటికీ, సభకు సభకు వెళ్ళి చదివి వినుపించుకువే వారికి ఆ మాత్రముగా నైనను ప్రకటించుకొనే యదృష్టము పట్టుచున్నది. కాని వారు

అందుకు కూడ బాహ్యులగుచున్నారు. వీరికి చేయూత నిద్దామనే ఆసక్తి ప్రజలకు గాని, ప్రభుత్వమునకు గాని కొంచెమైనను నేటికిని కలుగకుండుట పూర్తిగా శోచనీయము. ప్రభుత్వము వారికి సంగతి నివేదించుకొన్నచో ఇది ప్రభుత్వ ధర్మము కాదు. ప్రజల బాధ్యత అందురు , ప్రజలకి సంగతి నివేదించుకొన్నచో, ఇది ప్రభుత్వ కర్తవ్యము కాని, ప్రజలను పీకుకొని తింటే యేమి పుష్టి అందురు. మన రాష్ట్ర టెక్స్టుబుక్కు కమిటీ వారు డా॥ పట్టాభి సీతారామయ్య, డా॥ జె.సి. కుమారప్ప గార్లు వ్రాసిన గ్రంథములనే త్రోసి వేసిరి. దానిని బట్టి సామాన్యులకు ప్రోత్సాహమెక్కడ ఉండగలదో గ్రహింపుడు.

## ప్రజాయత్త ప్రభుత్వ ధర్మము

మన రాజులు, చక్రవర్తుల పరిపాలనములో, సాహిత్యమునకును, విజ్ఞానమునకును రాజాదరణము ద్వారా విస్తారమైన తోడ్పాటు కలిగిందన్న సంగతిని మనము మరువరాదు. రోజుల నాదర్శముగా చేసుకొనియే, అమాత్యులు, జమీందార్లు, శ్రీమంతులు, సర్వులు సాహిత్య విజ్ఞానములకు నిరుపమానమయిన చేయూత నిచ్చుచుండెడివారు. ఇపుడు వారికి ధోరణి లేదు. నేడు సర్వ దేశములు భారతదేశము కూడ, ప్రజా ప్రభుత్వ మయము లేక ప్రజాప్రతినిధుల ప్రభుత్వమయములై క్రొత్త వన్నెల నీనుచున్నవి. ప్రజలకే రాజత్వము సిద్ధించుచున్నది. పూర్వము వలె కాక, నేడు ప్రజలు తమ విద్యను, సౌభాగ్యమును, సంపదను, బలమును, సర్వమును ప్రభుత్వము నందే కేంద్రీకరించుకొని, ఆ ప్రభుత్వమిచ్చెడి సహాయ సంపర్కమున్నంతవరకు వర్ధిల్లుచు లేనంతవరకు వెనకపడుచున్నది. ఈ వైజ్ఞానిక యుగములో కేంద్రీకరణ యుగములో యిది తప్పని సరి యగుచున్నది. ప్రభుత్వాదరణము, కేంద్రీకరణము తీవ్రముగా ప్రారంభమయినప్పటి నుండియు ఆ ఆదరణము గల సంస్థ లెవ్వియో వర్ధిల్లు చున్నవి. లేని వెల్లయు క్షీణించుచున్నవి. వీనికి సాయము చేయవలసిన పని మీది కాదని ప్రభుత్వమువారు వెనుకకు తగ్గుట దేశమునకు శ్రేయమే కాదు. ఎన్నో విధములయిన నూతన సంస్థలను ప్రస్తుత ప్రభుత్వములు నెలకొలిపి చేయూత నిచ్చి, స్వయం ప్రవర్ధమానముల య్యే దాకానైనా సహాయం చేస్తున్నారు. విద్యా సంస్థల యెడల, అందులోనూ నవయోజన విద్యాసంస్థల యెడల వారి ఆదరణము మరీ యెక్కువగా ఉన్నాయి. అని ప్రపంచ చరిత్ర తెలియజేయుచున్నది.

## ప్రయోజన విద్య

విద్య యొక్క మహత్తు నెరిగిన వారెవ్వరు కాని ప్రయోజన విద్యా సమస్యను ప్రస్తుతం భారతదేశంలో ఉన్న స్థితిలో విడిచి పెట్టజాలరు. నూటికి తొంబది మంది నిరక్షరాస్యులై అక్షరాస్యులెందరో, యెప్పుడో చదువుకున్న స్వల్పవిషయముల నతి వేగం మరిచి పోవుచు, ఆధునిక విజ్ఞానములో వెనుకబడి ఉన్న యెడల భారతదేశము ప్రపంచములోని యితర దేశములతో తుల్యమైన అంతస్థునకు ఏనాడు రాగలదు? మన ప్రధాని రాజాజీ, మద్రాసులో విద్యార్థి సభలో చెప్పినట్లు, మన భారత జాతీయులు ఆ తీర్మానాలలో మన పూర్వపు విజ్ఞానము యింకను జీర్ణమై యున్నది. కనుకనే మనకు చదువులు రాకున్నా, లోపము లేకుండా సంసారపక్షంగానైనా ప్రపంచయాత్రలో కష్ట సాధ్యం మీద నెగ్గుకొని వస్తున్నాము. కాని లేకుంటే ఈ యుగధర్మమును బట్టి చదువురాని వాడికి శవమునకు కంటె ఎక్కువగా గౌరవం లేకుండా పోతున్నదన్న సంగతి మనము మరువరాదు.

## ప్రపంచమంతా అక్షరాలు, అంకెలే

కనువిప్పి విప్పడంతో మన కళ్ళ యెదుట అక్షరాలు, అంకెలు, బొమ్మలు, భోగట్టాలు ప్రత్యక్షమగుచున్నవి. చదువురాని వాడికి, అంకెలు తెలియని వానికి, కళ్ళున్న ప్రయోజనం కూడా లేకుండా పోతున్నది. రైలు, బస్సు టిక్కెట్ల మీద పేర్లు, అంకెలు, ఇంట్లో వుందామంటే తలుపుల మీద అంకెలు టైము తెలుసుకుందామంటే వాటి మీద అంకెలు, నాణెమైన బట్ట కొందామంటే మిల్లు చీటి ప్రత్యక్షం. పట్నంలో నాలుగు వీధులు తిరగాలంటే పేర్లు చదువుకోవాలి. కాంగ్రెసు మంత్రివర్గం వచ్చి మద్యపాన నిషేధ, గ్రామ పునర్నిర్మాణ ప్రచారములను చిత్ర చిత్రమైన నీతి వాక్యములు అంకెలతో సాగిస్తున్నారు. సాగించబోతున్నారు. వాని సారమును గ్రోలవలెనన్నా అక్షరాలు, అంకెలు తెలియాలి. చదువురాకుంటే అరక్షణమైనా కళ్ళు విప్పుకొని నడవలేని పరిస్థితులేర్పడుచున్నవి. ఇప్పుడు కూడా మనపూర్వుల నాటి జ్ఞాన వైరాగ్య పద్ధతిలో మునిగి ఆ మత్తు మరిగి సారస్యము గ్రహించ లేక ఈ ప్రపంచ జ్ఞానములో తేలదామనే సమస్య మనము నిర్లక్ష్యం చేసే లాగుంటే (మనకు జ్ఞానం సరిపోతుంది కదా), ప్రపంచంలో మరు

దినం కూడా వెళ్ళరు.

## కనిష్ఠ పరిణామ జ్ఞానం

అయినా విజ్ఞానమంటే అక్షరాలు, అంకెలు, తెలుసుకోవడం పంచి పెట్టబడే సినిమా అడ్వరుటైజుమెంటు పేపర్లు మొదలగు వానిని కూడబలుకు కోవడం మాత్రమే అని నా ఉద్దేశ్యం గాదు. ప్రపంచములో మానవ తుల్యంగానైనా నివసిద్దామంటే మనకి మాత్రం జ్ఞానమైనా మొట్టమొదట అత్యావశ్యకమని నా భావము. మానవ విజ్ఞానమునకు, ఇది పుట్ట గీటు. ఆ కనిష్ఠ పరిణామజ్ఞానముంటే ఆ తరువాత మెట్టు ఏదైనా మనకు అందుకు వస్తుంది. లేకుంటేనే ఈ మెట్టుకు కూడ క్రిందుగా మనము ప్రాకుతూ వుండవలసిన వారమే. ఇందుకోసమే నిరక్షరాస్యత క్రూర పిశాచముల కంటె కూడ ఘోరమై తక్షణమే తరిమి వేయవలసిన పెనుభూతము వలె నేడు మనకు కనిపించుచున్నది. విద్యలో ఒక రహస్యమున్నది. మానవులకు ఆరుచిని మప్పే దాకానే కాస్త కష్టం కావచ్చును కాని, ఒకసారి రుచిని మరిగిన వారు మరి దానిని విడువజాలరు. అక్షరజ్ఞానం నేర్పి చిన్న చిన్న పాఠములు చదివించి ప్రాథమిక విద్యను ప్రజలకు ఉత్సాహవంతముగా ఒకసారి నేర్పే దాకానే కాస్త కష్టం కావచ్చును. కాని, తరువాతను వారే స్వయం కృషి వల్ల పత్రికలను, గ్రంథములను చదివి ప్రపంచ పరిణామము నంతటిని గుర్తించుదురు.

పరిపాలనము మన చేతులలో పెట్టబడినది. ప్రభుత్వ ధర్మమును ప్రజలు గుర్తించి తదనుకూలురైన వారికే ప్రజలు వోటు నియ్యవలసి యున్నది. తగాదా కలుగకుండాను, అధవా కలిగినా, కోర్టునెక్కకుండా గ్రామాలలో పరిష్కార మయ్యేటట్లుగాను ప్రజలు వర్తింపవలసియున్నది. పంచాయితీలను, సహకార సంఘములను వారు నడిపించుకోవలెను. సభలలో వర్తింపవలసిన సూత్రము లెరుగక సంతలలో వలె గోలచేసి పోట్లాటలకు దిగుచో పోలీసు సహాయము పిలువవలసి వచ్చునేమో. ఈ విషయము లన్నింటికి సంబంధించిన విజ్ఞానము వారిలో ప్రచారం కాకుంటే బండి నడవగలదా!

## నూతన సంస్కరణం సిద్ధించవలెను

సంఘమున కంతటికిన్నీ ఒక నూతన సంస్కరణము సిద్ధించవలెను. ఇందుకై వయోజన విద్య తప్ప రెండవ మార్గం లేదు. ఇందుకై వలసిన బలగమింతా అంతా కాదు. విజ్ఞానవంతులగు యువకుల సహాయము మనము చూరగొనవలెను. రాష్ట్రీయ ప్రభుత్వ మీ యుద్యమమునకు సంపూర్ణ దోహదము చేయవలెను. ఇంతమందిమి కలిసి పోరాడకుంటే ఈ అజ్ఞాన పిశాచమును మనము సంహరింపజాలము. దానిని సంహరించనిచో మన మీదాస్యాంబుధిని తరింపజాలము.

## అన్ని ఉద్యమములకు విలేఖకులు ప్రాణము వంటివారు

ఏదేశమునకైనను, ఉద్యమమునకైనను ప్రాణములు లేఖకులే. వారి వ్రాతలను చదివియే, వక్తలు ఉపన్యసించుచుందురు. వారి గ్రంథములను పఠించియే, యువకులు, బాలురు, విద్యావంతులగుచుందురు. వారి బోధల నాలకించియే సంఘములు సంస్కరింపబడుచుండును. లేఖకుల తోడ్పాటు లేనిదే ప్రపంచములో నే యుద్యమమును ఇంతవరకు విజృంభించలేదు. ఇకముందు విజృంభించ బోదు. ఫ్రెంచి విప్లవమునకు వాల్టేరు, రూసోలు, బ్రిటిషు విజ్ఞానమునకు బర్కు, రస్కిను, కార్లయిలు, మిల్లు మొదలగు వారి వ్రాతలు, రష్యా ఉద్యమమునకు అనంతకోటి లేఖకుల సిద్ధాంతములు, కథలు మన దేశములో కాంగ్రెసు యొక్క అఖండ విజయమునకు తిలకు, గోఖలే, అరవింద, మజుందారు, దాసు, బోసు, నెహ్రూలు, గాంధీజీ, రాజాజీ, పట్టాభి మొదలగు వారి వ్రాతలు పునాదులు వేసినవి. మనకు ఆంధ్ర దేశములో ఈ నవీన విజ్ఞానమును వెదజల్లుచున్న కవులు,గాయకులు, కథకులు, చరిత్రకారులు, పత్రికాధిపతులు, విలేఖరులు, విమర్శకులు, ప్రకాశకులు, మనలో నెందరో వున్నారు. వయోజన విజ్ఞానమునకు మన అందరి వ్రాతలును ఎంతో పోషకములయినందున నేనెంతయు వారిని అభినందించు చున్నాను.

## ప్రోగ్రెసివు రయిటర్లు

మనమందరమును లేఖకులము. రసము లేని లేఖనము లేఖనమే కాదు.

కనుక రసవంతులని కూడా చెప్పవచ్చును. రసమును స్ఫురింపజేయునదే కళ. కనుక కళావిలాసులని కూడ చెప్పవచ్చును. మనమే విమర్శకులము కూడ గనుక సకల కళల యందును అనుభవము కలవారని చెప్పవలెను. అయితే మనకును కేవలం సాహిత్య లేఖకులకును గల వ్యత్యాసమేమనగా వారు పరిశుభ్రమయిన సోపానకులును, కళాభిమానులును అయివుండగా మనము ఆ రసములను, కళలను ప్రజాసేవకు విజ్ఞానమునకు, దేశపురోభివృద్ధికి వినియోగపరుచుటకై తయారై యున్నవారము. ఇట్టి వారికే (Progressive Writers) అనునామము తరచుగా ఉపయోగించు చున్నారు. ఈ పదమును సరిగా మనం తర్జుమా చేస్తే పురోభివృద్ధి లేఖకులని పిలువవలెను. ఇతరుల వ్రాతలు కూడా పురోభివృద్ధికి హేతువులవునా కాదా అను చొప్పదంటు ప్రశ్నల చర్చల కెవ్వరును పోక మొదటి వారిని సాహిత్య సేవకులనిన్ని మనలను పురోభివృద్ధి లేఖకులనిన్ని ప్రస్తుత ప్రపంచాచారము చొప్పున పిలిచినంత మాత్రమున ప్రమాదము లేదని నేను భావించుచున్నాను. ఇంత మాత్రమున మన వ్రాతలకు సాహిత్య ప్రపంచంలో స్థానము లేకపోనూ లేదు. వారి వ్రాతలు దేశపురోభివృద్ధికి హేతువులు కాకపోవడమునూ లేదు. అన్ని భేదముల వలె ఈ భేదము కూడా కాల్పనికమును సులువు కొరకు చేయబడినదియు అంగీకృత మైనదియు నై యున్నది. ఇంతకూ ఎవరి కర్తవ్యమును వారెరుంగుట ప్రధానము. మన కర్తవ్యము మనకు తెలుసును. మనమింక ఇట్టిపనికై గడంగ వలయును. దేశమును, ప్రభుత్వమును, మన ప్రయత్నములకు సహాయకరమైనచో అనతి కాలంలో మన దేశము విజ్ఞానమున అమితవృద్ధిని పొందగలదనుట ముమ్మాటికి నిశ్చయము.

*– ఆంధ్రపత్రిక, 27.10.1938.*

# భ్రమపెట్టని వారెవరు?

స్వరాజ్యవాదులు తమ ప్రతిఘటన, ఉద్యోగ తిరస్కరణ నినాదములతో వోటర్లను భ్రమపెట్టుచున్నారు. కనుక వారికి వోటు లీయవలదని సముచిత సహకారవాదుల కేకయై యున్నది. ప్రభుత్వము వారు మన నేషనలు డిమాండు నూకొట్టనిదే వారి సహకార పరిరంభణము లోనికి మనముఱకుట నీచతరమగు సహకారమే కాని సముచిత సహకారము కాదనియు, సముచిత సహకారము శబ్దము వలన మోసపోక మీ బిగువు సడలించుకొనవలదని స్వరాజ్యవాదుల మందలింపై యున్నది. శాసనసభలలోనే మన మోక్షమెల్లయు నున్నది. కనుక వాటి మూలమున ముక్తి దేవతను మేమారాధించి ఉద్యోగ పట్టాభిషేకముల నంది బలవజ్జాతుల యాగడముల నుండి బలహీన జాతుల నెల్ల మేము కాపాడెదమని జస్టిసు పక్షమువారి యాక్రందనమై యున్నది. ఈ కళలలోను, ఈ మందలింపుల లోను, ఈ యాక్రందనలోను భ్రమపెట్టుట యెంతవరకున్నదో, నిజమెంత వరకున్నదో మనమాలోచించవలెను. ఈ సూత్రములు వారి వారి విశ్వాసమును ఆశయములను మాత్రమేయైయున్నంతసేపు వారి విశ్వాసములను ఆశయములను వారుగ్గడించుటలో భ్రమయేమియును లేదు. లేక వారు వారి వారి సూత్రములను శాసనసభలలో నెరవేర్చుకొనగలమని ఆశపడుచున్నచో ప్రజలను భ్రమపెట్టుట మాట యటులుల నుంచి తామే ముందు భ్రమపడుచున్నారు. ఇవి వారికే భ్రమలై యున్నంతసేపు ప్రజలను భ్రమపెట్టి మోసగించు చున్నారనుటకు వీలు లేదు. కాక ఈ సూత్రములను తా మమలులో పెట్టజాలమను రూఢియగు భవిష్య జ్ఞానముండియు, పెట్టగలమని కోరి యబద్ధములాడుచు ప్రజల నుండి వోటులు తస్కరించవలెనని చూచుచూ ప్రచారములు జేయుచున్నచో మువ్వురును ఆనేరమునకు పాత్రులగుచున్నారు. ఇవి వారిలో కేవలము ఆశయములు మాత్రమే యై యున్నవో లేక తామే భ్రమపడి మోసపోవుచున్నారో కాక వోటులను పట్టుటకే సూత్రములను గాలములుగా నుపయోగించుచున్నారో నిర్ణయించుకొనగల విచక్షణము చదువరులకే విడచి పెట్టుచున్నాము. అయినను ఈ విచక్షణము సరిగా జేసుకొనుటకు శాసనసభల తత్వమును బాగుగా గ్రహించవలసి యున్నది. గనుక వాటిని గూర్చి యించుక ఆలోచించక తీరదు.

శాసనసభలు ప్రభుత్వము వారి నిర్మాణ సంస్థలు కాని ప్రజల సౌకర్యములను నిర్మించు సంస్థలు కావనియు, వాటికిని కలెక్టరు కచేరీలకు భేదము లేదనియు, కలెక్టరు కచేరీలో ప్రయోగించవలసిన చట్టములనే అక్కడ నిర్మించు చుందురనియు, వాటిలోనికి యెవరు వస్తే వారి చేతనే ప్రభుత్వమువారా చర్యలను చేయించు కొనుచుందురనియు, శాసనసభికత్వము జీతములేని సేవకా వృత్తియనియు, ప్రాత చట్టముల పరిణామములను చదివి గుర్తుపెట్టుకొని జ్ఞాపకముంచుకొని క్రొత్తపరిస్థితులకు సరిపెట్టుకొని ప్రభుత్వము వారిచే శాంక్షను చేయించుకొనగల రీతిని వారికి నచ్చ జెప్పు కొని వారు తిరస్కరించినచో తొందరపడి తిరిగి రాజాలని సహనశక్తి కలవాటు పడిన గుమాస్తా పని చేయగల యోధులకే కాని యితరుల కందులో లాభము లేదనియు స్వచ్ఛమగు ప్రజాహిత జీవనము కొరకై మాత్రమే వాటిలోనికి వెళ్ళి అచ్చట వారు పెట్టిన ప్రశస్తములగు బిల్లులొకటియును ప్యాసు కామిచే విఫల మనోరథులై వాటిని శపించి బెదరించి యుండిన గోఖలే, వెంకటపతిరాజు, ఈ రామచంద్రరావు మొదలగు వారల ప్రాత చరిత్రములే విశదము చేయుచున్నవి. మహాత్ముని కార్యక్రమ మాసంగతిని స్థిరపరిచి ప్రజలకు నచ్చఁజెప్పి వాటిపైని విముఖత్వమును గల్పించినది. వాటిలోనికి అధిక సంఖ్యాకులుగా దూరి ముట్టడించి వాటిని నులిబెట్టి తత్వము మార్చి తమ కార్యములను నెగ్గించు కొందమను స్వరాజ్యవాదుల ఆశయములును అనేక కారణముల చేత సఫలీకృతములు కాఁజాలకున్నవి. వాటిని మార్చుటకు గా నేగి తామే మారవలసిన స్థితి తటస్థించుచున్నది.

ఇంతలో స్వరాజ్య పక్షమే పాయలును, చీలికలునై అట్లు తామును మాఱిపోయి తొంటి నౌకరీ వృత్తి చేయుచు చేతనయినంత మట్టుకు గీకుకొనుటయే శాస్త్రోక్త కర్మమని వాదించు శిష్టలోక ప్రక్కను మన బిగువు సడలించ కూడదనియు మనము కొంతకాలమాకలిని నిగ్రహించుకొన్నచో యీ యెమికలే కొంచెము కండ కట్టి మాంసమెక్కి పంటినిండా వచ్చునని ఆశా స్వప్నములను గను చున్న దీర్ఘదర్శులొక ప్రక్కను ఈ యెన్నిక లనెడి వంతెన యంచున నిలబడి పోరాడుచున్నారు. కాంగ్రెసు ప్రతిఘటన వాదులను తల్లివలె కౌగిలించుకొని కాపాడుచున్నది. కాని తల్లీపిల్లల నందరిని తన్ని యేటిలోనికి త్రోసివేయగల యావేశమునందును సాహసము నందును జ్ఞాన శీల సంపత్తుల యందును, మహిమాదీక్షల యందును, మాతృనామ జపము నందును, దేశాభి

హానము నందును, ప్రభుత్వ సేవయందును, రెండవ పక్షము కొఱవడి యుండలేదని అభినవ కాంగ్రెసు పక్ష చరిత్రములను పఠించు వారల కెట్టి యనుమానమును లేదు. ఇట్టి మహా యజ్ఞములో (యథోచిత) సహకార పక్షమువారికి స్వతంత్రులు మితవాదులు మొదలగు నెల్ల పక్షముల వారును తమ ఆశీర్వాదములనే కాక సహాయబలమును గూడా నిచ్చుచున్నారు. స్వరాజ్య పక్షము కూడను మార్పునకు ప్రతికూలముగా లేదు. భారము నెల్లియు తల్లి కాంగ్రెస్సు మీదనే పెట్టి యున్నది.

ఈ మారు తల్లి పెద్ద కొడుకు పక్షమున నిలచునో, ముద్దు కొడుకుల నాడిలో పెట్టుకొనునో చెప్పజాలము. ఆదర్శజ్ఞానము వాత్సల్య రసము నేనాటికిని జయింపజాలదు. లాలాజీని, మాలవ్యాను, జయకారును మొదలగు వారినెల్ల ఆలింగనము చేసుకొనుటకై, (కంట తడి పెట్టుకొనుచునే ఆయెను) ఈ పెద్దకొడుకును విడిచిపెట్టక ఆమెకు తీరదు. ఆదర్శజ్ఞానమే వాత్సల్యరసమును జయించినప్పుడు గాని, లేక పెద్ద కొడుకు నిజముగా బలవంతుడై తల్లిని తన చిన్నారి పుత్రుల దగ్గరకు (వివేకులే కావచ్చును. అవివేకులే కావచ్చును) వెళ్ళనీయకుండా గదిల్లో పెట్టి తాళము వేయగల సమర్థుడైనప్పుడు కాని, గృహములో మాత్రము శాంతియుండదనియు, వ్యవహారమును గార్డియను గారు తన కిష్టము వచ్చినట్లు తన దగ్గరకు వచ్చిన ఉద్యోగస్థుల చేత చేయించు కొనుననియు చెప్పుట కాటంకము లేదు.

తల్లి తమ పక్షము రాకున్నచో చిన్న కొడుకులు గార్డియను పక్షము చేరి వ్యవహారములు చేసుకొనుచు పెద్దన్నయ్యను తల్లిని ఆదర్శముల పాలు చేయుదురు. పెద్దన్నయ్య కేవలము ఆదర్శజీవియేకాక రాజనీతి పరుడు, వివేకవంతుడు, కాలలక్షణములు తెలిసి మెలగగలవాడు. ప్రతిఘటించుటకే యనుకొనుడు శాసనసభలకై వ్యామోహమును కండూతియు గల వాడును నగుటచేత, తల్లిని తోడుకొనిపోయి తమ్ముని పక్షములో చేరి తల్లి యాజ్ఞయను పేరిట సముచిత సహకార పక్షములోనికి దిగక తప్పదు. లేదా శాసన సభలను మానుకొని గాంధి ప్రక్కలో దూరిపోవలెను. మొదటిది మానలేడు. రెండవది చేయలేడు. ఇంతలో కాంగ్రెస్సే అతని సహాయమునకు వచ్చి అతని చర్యను దేశసమ్మతమేయని చెప్పి ఆశీర్వదించినచో తృప్తచిత్తుడై వారితో కలసి పనిచేయును. అట్లని తన ఆశయములలో తనకు విశ్వాసమున్నన్నాళ్లు, తన తల్లి ఆశీర్వచనము తన

నెత్తిపై నున్నంతసేపు, సాధ్యాసాధ్యముల మాట నట్టేపెట్టి, యథోచిత సహకారవాదిని తానెదిరించుటలో వెనుక తీయవలెనని మేమెన్నడును నొప్పుకొనము. ఇది కొంచెము రాబోవు పరిస్థితులలోనికి తొంగి చూచుటయేకాని, వారిని విరమింపవలెననుట కాని, వారికి జయము కోరకుండుట కాని, వారికి ప్రతికూల పక్షములలోనికి దిగుట కాని యనిపించుకొనదు.

"మేము రేపు ప్రొద్దున్న వేఱేగతి లేకపోయినచో సహకారమే చేతుముగాక, సముచిత సహకారమే చేతుముగాక, ఇదివరలో సముచిత సహకారమే చేసియుందుముగాక, మాకు సంపూర్ణ ప్రతిఘటనములో విశ్వాసమున్నది. మమ్మును మీరధిక సంఖ్యలుగాబంపినచో మేమట్లు చేసెదము. మేము కాంగ్రెస్సు ఆజ్ఞలకు సర్వదా బద్ధులము" అని చెప్పుచు వోటులు ముష్టెత్తుకొనుట "మేము సంపూర్ణ ప్రతిఘటన వాదులముకాదు. అయినమట్టుగ శాసనసభల నుపయోగ పరచుకొనుటకే మేము పోవుచున్నాము. అవసరమైనచో ప్రతిఘటనము చేస్తాము- మా విశ్వాసమిది. మేము చేయజాలని సంగతులను బట్టి గొప్పలు చెప్పము- అసహాయము, ప్రతిఘటనమును చచ్చి చితికిపోయినాయి. చూసేరుకదా! అవి సాధ్యముకాని ఆదర్శములు, మేమాదర్శవాదులముకాదు. మా దగ్గర నున్న దెల్లయును నిజాయితీ. అందుచేత ప్రభుత్వమును కొనసాగింప జేయుసహకారమునకుగా మాకనుజ్ఞ యీయవలసినది" యని చెప్పుచు వోట్లు ముష్టెత్తుకొనుట కంటె యెక్కువ మంచి ఆదర్శమని యెవరు కాదనగలరు? ఇందులో వీరిర్వురికిగల దృష్టిభేదము విశదమగుచునేయున్నది.

సామాన్య దృష్టితో చూచినప్పుడు యథోచితసహకారవాదులే యెక్కువ సత్యవంతులైనట్లును స్వరాజ్యవాదులు దగాకోరులైనట్లును కనిపించకపోరు. కాని, సాధ్యము కానివైనను గొప్ప ఆశయములను, ఉత్తమ సంకల్పములను చూపి ప్రజలదృష్టి నున్నతాశయముల వైపునకును, పరమావధి వైపునకును నెత్తి యుంచుటను అసత్యమనియు, దగాకోరుతనమనియు, భ్రమ పెట్టుట యనియు చాటుట, బ్రిటిషు ప్రభుత్వమువారితో సహకారము చేయుటకై యువ్విళ్ళూరుచు పరుగెత్త గోరువారు వెలయుచుండిన యీ కాలమునకు మాత్రమే సలలిత లక్షణమై యలరారుచున్నది. తమపక్ష మితర పక్షములకంటె నేవిధముననైన నున్నతమైనదని చాటుకొనుటకు ప్రతివారికిని యేవో కొన్ని

సుప్రసిద్ధ కూతలుండవలెను. "మేము ఒక మాట చెప్పి మరియొక పని చెయ్యము. మేము భ్రమ పెట్టము- మేము సహకారమును చేతుము. ఇది మా నిజాయితీ" యని చెప్పుకొనుట సముచితవాదుల శంఖనాదమైయున్నది. ఇందులో సత్యములేదని మేమనఁజాలము. జస్టిసు పక్షమువారి "ఉద్యోగములు- సహకారము"లో కూడా ఇంతకన్న ఎక్కువ సత్యమున్నది. వారికేకలలో నున్న దెల్లయు సత్యమే.

కాని కేవలము ఇట్టి హ్రస్వ సత్యముపై దృష్టిని నిల్పుకొనువారు స్వరాజ్య వాదుల ఆదర్శ సత్యమును గుర్తెరుంగలేక వారిని దగాకోరులని చాటవలసిన నేరమునకు పాత్రులుకాక తప్పదు. దేని సత్యము దానిలోనే యున్నది. దేశ మందరును చేరిపోయినంత మాత్రముననఁగాని, సంతకములు పెట్టినంత మాత్రముననఁగాని ఒకటి మరియొకటి కంటె నెక్కువ సత్యవంత మైనదియు, దేశహితైక మైనదియు, కాఁబోదు. అయినను కాంగ్రెస్‌లో పేసయిన స్కీము తిరిగీ ఆ కాంగ్రెస్సులో రద్దు కాబడు వరకును దేశీయులకును వోటర్ల కును అనుసరణీయము. కాంగ్రెసులో సంతకము పెట్టి, ఆ పేరు మోచుకొన్నందు వలన గలిగెడి లాభములను భుజింపఁగోరుచు గూడ ఆ సంస్థ ఆజ్ఞలకు వ్యతిరేకముగ పనిచేయుట తత్సంస్థకును తన్మూలమున దేశీయ పురోభివృద్ధికిని గూడ ద్రోహ మొనర్చినట్లే- ఈ సమయమున సాధ్యాసాధ్యములను గూర్చికాని, వివేకావివేకములను గూర్చికాని తాత్కాలిక లాభాలాభములను గూర్చి కాని సంశయము లుండును గాక. జాతీయ ధర్మా ధర్మములను గూర్చి సంశయములను పెంచి తన్మూలమున పార్టీల బలములను వృద్ధి చేసుకొనగోరుటకంటె దైవద్రోహముకూడా వేఱేలేదు. సముచిత సహకార వాదులు కాలోచితమైన కార్యక్రమమును తీసుకొని వచ్చినామన్న కీర్తిని గైకొనఁగోరుచో, స్వరాజ్య వాదులకు సదాశయ సంకలితమగు కార్యక్రమమున నవలంబింప గోరు చున్నారన్న యీషత్కీర్తి నొసంగక తీరదు. కాంగ్రెసు, వారి మీద తన చేతినుంచినంత సేపు వారి విధానము దేశీయుల కనుసరణీయమగు చున్నదని సముచిత వాదులు కినుక పొందరాదు. వెంటనే కాంగ్రెస్సు పెట్టించుకొని కార్యక్రమమును పునర్విమర్శనము చేయించుకొని తమ కార్యక్రమమునే దేశమున కనుసరణీయముగ చేసికొన వచ్చును. కాంగ్రెసు వారిని ప్రతిఘటించు ననుటకు వీలులేదు. వారు మాత్రము సామాన్యులా, బుద్ధిహీనులా? కాంగ్రెసును మెప్పించి ఒప్పించలేరా?

అట్లు చేయలేకున్నచో తమ సిద్ధాంతములను తమలో నుంచుకొని కాంగ్రెసు ఆజ్ఞలకు బద్ధులు కావలెను. లేదా, విడిపోయి జస్టిసు పార్టీవలె వెలుపలనుండి తల్లి సంస్థను దూషించుచు వారియిష్టము వచ్చినట్లు ప్రవర్తించుకొనగల హక్కును సంపాదించుకొనవలయును. కాలమాన మెల్లయును యధోచిత సహకార వాదులకే అనుకూలముగ నున్నదని పెక్కురి యూహ. గౌహాతీలో వారి స్కీమే నెగ్గను. స్వరాజ్య వాదులు తల నొగ్గుదురు. ఈలోగా కొన్ని లాభములు పోవుచున్నవని తొందర మాట అనుకొనుట సముచిత వాదులకు సముచితముకాదు.

ఇట్లు స్వరాజ్యపక్ష ఆశయముల గతి యెట్లు పట్టుచున్నదో చూచినాము. యధోచిత వాదులగతి యెట్లు పట్టునో ఊహింప సాహసించు చున్నందుకు క్షమింతురుగాక! వారి స్కీమువలె వీరి స్కీమును నిరర్థకమే. ప్రతిఘటనము సముచితము లోనికి మారి పోయినట్లే సముచితము. సంపూర్ణము లోనికి మారిపోక తీరదు. ఈ సంగతి తత్పక్ష నాయకులకు తెలియకపోలేదు. అందుకు సిద్ధపడియే వారును పోవుచున్నారు. "Responsive" శబ్దము ప్రజలకు "భ్రమపెట్టుట" కొరకే కాదాయని మాకు సందేహము లేకపోలేదు. దేశము శాసనతిరస్కారమునకుగాని, ప్రభుత్వమువారు మన డిమాండులను తీర్చనిచో చర్య తీసుకొనుటకు గాని తగిన స్థితిలో లేదని యీ పార్టీ లెల్లయును నంగీకరించు చున్నవి. ఈ సందర్భములో శాసన సభ్యుల చేతిలో నున్న చర్య యెల్లయు నొక్కటియే. అది నిర్గమనము (Walk out). ఆ చర్యను రెస్పాన్సివిస్టులును, లాలాజీ మొదలగు వారును యెట్టి అవకతవక హేళనతో రాజద్రోహ మనియు దేశద్రోహమనియు సిద్ధాంతీకరించుచున్నారో మనము చిత్తగించుచున్నాము. మన మాట వారు చెల్లించనిచో పౌరుషమును రోషమును చంపుకొని, యేవగింపునైన పొందక, సిగ్గు ఇంతకన్నను విడచిపెట్టి సహకారము నకు సంసిద్ధమగుట Responsive లేక సముచిత సహకార మెల్లగును. మనలో శాసన తిరస్కరణ శక్తి లేనంతసేపు ప్రభుత్వమువారు మన డిమేండులకు నూకొందురో? అట్లు విశ్వసించిన వారు విశ్వసింతురుగాక!

నిజమేమనగా దేశము శాసన తిరస్కారమునకు సిద్ధము కానంతసేపు పైవారి యిర్వురి సిద్ధాంతములకు తావేలేదు. వారి సిద్ధాంతముల

వలన వారైన మోసపోవుచుండవలెను లేదా వారు మోసపోకుండా కృత్రిమముగా ప్రజలను మోసపుచ్చుచునైన యుండవలెను. కుత్సితులు కాకున్నచో వారు రెండవపని చేయరు. అయినను రాజకీయములలోని నాయకుల చర్యల కట్టి కళంకములు పెట్టుట.యపచారము, అది కేవలము రాజనీతి విశేషమే. అయినను పార్టీలెక్కువై రాజనీతినెక్కువ ప్రయోగించుకొని ఒకరి నొకరు దూషించుకొనుటకు దిగగానే రాజనీతిమీది ముసుగు తొలగిపోయి దాని యాదార్థ్యమగు కపటము గోచరించక మానదు. సంపూర్ణ శాసన సభా బహిష్కారమునకు సంపూర్ణ సహకారమునకు మధ్యన మెట్టలు లేవని లాలాజీ యే వ్రాకుచ్చి జాతుల సంఘటనము లేమిచే మొదటిది సాధ్యము కాదు కనుక రెండవదానినే చేయవలసినదని హెచ్చరించలేదా? సముచిత సహకార వాదులు తమ కిష్టములేని బిల్లుల నెదిరించి యోడిపోవుచు కావలసినవి ప్రవేశపెట్టి యోడుచు గింజుకొనుచు సహకారము చేయవలసినదే. వారు ప్రజలను భ్రమపెట్టకుండవలెననెడి నిజాయితీ కోరుచో సముచిత శబ్ద మును తీసివేసి సంపూర్ణ శబ్దమును పెట్టుకొనవలెను.

ఇట్లయినచో వీరికిని జస్టిసు వర్గము వారికిని భేదమే లేదు. వారు ప్రతిఘటనమును సముచితమును రెండును సాధ్యము కావు కనుక సంపూర్ణ సహకారము చేయుచు రాజభక్తితో తోకనాడించుకొనుచు అబ్బినన్ని ఉద్యోగములన్యుల కెవ్వరికి పోనీయకుండ తామే బొక్కుచుండుటయే శ్రీ త్యాగరాజ శెట్టి వారి సిద్ధాంతమనియు ఆ మహనీయుడు గాంధి దాసు తిలకుల కంటె కూడా దివ్యదృష్టి కలవాడనియు చాటుచున్నారు. వారు పెట్టుచున్నది కూడా భ్రమయే. ఏలనన వారి పక్షమువారి కందరికైనను వారుద్యోగముల నెట్లిప్పించగలరు? నిరుద్యోగ సమస్య జస్టిసు ప్రభుత్వములో నేమైన సుముఖంగా పరిష్కారం కాగలదా? యెవరో నోరుగల కొందరు స్వార్థపరులు మాత్రమే రొట్టె విరుచుకు తింటున్నారు. తక్కిన కోటానుకోట్ల యెం.యేలు. బి.యల్‌లు,బి.యేలు వారివైపునకు చేయిచాచుకొని యేడ్చు చున్నారు. దేశమంతా కొలువులకు పోతే వీరికి కచేరీ లెక్కడ కట్టగలరు? స్వరాజ్యము వచ్చి వీరికి కొలువుకు పోయే విద్యనేర్పకుండా స్వతంత్రముగా బ్రతికే ఉపాధులను తెరచి పెట్టవలెనేగాని, ఎన్నికల రంగములో ఈ పార్టీ యొక్కటియే అయినను యిన్నాళ్ల ప్రచారములు చల్లగా జరిగిపోయినవి. కాని పోటీదారు లెక్కువ కాగానే ప్రతిపక్షము వారును వీణెలు పట్టుకొని పరస్పర జాతి మత ద్వేష గీతములను

ఆలాపించవలసి వచ్చినది. జస్టిసు వర్గము వారికిది త్యాగరాజుల వారి నుండియే అలవాటైయుండుట చేతను ఇదివరకు తాము కోరుకు కొనుచున్న ఉద్యోగము కండల మీదికి మారుపేరులు పెట్టుకొని పీకు కొనుటకై వచ్చుచున్న ఈ పగటి వేషగాంధ్రను చూడగానే మఱియును యెదరి యెక్కువ గట్టిగా ఆ పాటలను పాడఁదొడగిరి.

ఇట్లు యెల్ల పక్షములను నెదిరిపక్షమును దూషించుచు, తమ పక్షమును కీర్తించుచు ఎక్కడ యేలాగున వీలయితే అక్కడ ఆలాగున వోటులను కాకులవలె తన్నుకొని పోవుచుండటయే వోటుల ప్రచారమై, దేశీయుల శాంతపరిశుద్ధ జీవనములెల్ల కుచ్చిత రణరంగములుగా మారిపోయినవి. వాటినుండి మన చిత్తవృత్తులను మరలించుకొని, ప్రజలకు సత్యమును చూపించగల నిగ్రహశక్తికి మనము సమకొననిదే మన జాతీయాభివృద్ధి ప్రారంభముకాదు. ప్రస్తుతము దేశమందుకు సంసిద్ధముగ లేదు- జాతీయ నాయకులెల్లరును శాసన సభలను ముట్టడించి వాటి ద్వారా యేవో యొకటి సాధింతుమని గోరుచున్నారు.వారు యేదో యొక పక్షమున వోటర్లకు వోటు నీయక తీరదు. ఆ వోటు కాంగ్రెసు కేండిడేటున కీయవలెననుటకన్న సదుపదేశము నెవ్వరును చేయజాలరు. విశాల ఆశయములతోను, స్వేచ్ఛాపరత్వము నందును, ప్రభుత్వ ప్రతిఘటన ధాటీయందును, అచంచల విశ్వాసమునందును కాంగ్రెసు పార్టీ తక్కిన సముచిత జస్టిసుపార్టీ నాయకులకంటె నెక్కువ యున్నతమైన స్థానము నాక్రమించుకొనుట కభ్యంతరమున్నదా?

– *కృష్ణాపత్రిక, 25.9.1926*

# గాంధీ కాంగ్రెసు యుగమునకుద్యాపన

సమస్త స్వతంత్ర ప్రపంచదేశాలలోను కాంగ్రెస్సు అనేది సార్వజనీన సంస్థ రాజకీయ ప్రణాళికలను పరిశీలిస్తూ, ఆమోదిస్తూ సర్వాధ్యక్షుని యెన్నుకుంటూ అది దూరము నుండి పనిచేయునే కాని, ఏ పార్టీతోను లీనము కాదు. అయినా అధికారములో ఉన్న పార్టీ దాని ఆమోదము ప్రకారము తప్ప పని చేయడానికి వీలులేదు. ఈ లక్ష్యమే వివిధ దేశములలో వివిధ రూపములుగా సాధించబడుచున్నది.

పరాధీన దేశములలో కూడా కాంగ్రెస్సు సార్వజనీన సంస్థయే అది దేశ స్వాతంత్ర్య సిద్ధి నొక్కటినే లక్ష్యముగా పెట్టుకొని ప్రజాప్రబోధము చేయుచు పోరాడుచుండును. కాంగ్రెసు అధ్యక్షుని తప్ప పరిపాలనాధ్యక్షుని యెన్నుకొనుటకు దానికి పరప్రభుత్వము అవకాశమియ్యదు. అట్టి అవకాశము కొరకును, ప్రభుత్వ ప్రణాళిక లెల్ల తన ఆమోదము కొరకును, ప్రభుత్వ ప్రణాళికలెల్ల తన ఆమోదము లేనిదే సాగనీయకుండుటకును అది సర్వదా ప్రయత్నించుచుండును.

భారతదేశపు కాంగ్రెస్సు ఈ దేశము పరాధీన స్థితియందున్నప్పుడు జనించినది. ప్రజలలోని జ్ఞానమును పౌరుష శక్తిని ప్రబోధించుటయే దాని లక్ష్యముగా ఉండెను. కాంగ్రెస్సు నాయకులు కొందరు శాసన సభ్యులుగానో ప్రభుత్వోద్యోగులుగానో పనిచేసినను, కాంగ్రెసు హెూదాతో గాక తమ వ్యక్తి బాధ్యత మీద అట్లు వర్తిస్తూ కాంగ్రెస్సు లక్ష్యములు సార్థకములగుటకై ఇతర పార్టీలవారితో సహకరించుచు పోరాడుచు ఉండేవారు. వారికి ప్రజలలో గల ఆదరమునకు కారణము వారికి గల ప్రభుత్వ సభలలోని పదవుల వల్ల కాక, కాంగ్రెస్సు లక్ష్యముల కోసం పోరాడే ఘనతను బట్టి నిర్ణయించబడేది.

కాంగ్రెస్సు ఒక రాజకీయపార్టీ అయితే దాని కట్టి ఉత్తమ గౌరవము దక్కదు ఒక రాజకీయపార్టీలో దేశస్థు లెల్లరును ఎన్నడును సభ్యులు కాజాలరు. ఒక్క కాంగ్రెస్సులో మాత్రమే సర్వులును సభ్యులగుటకు సంపూర్ణావకాశ ముండును. కాంగ్రెస్సు నాయకుల బలాబలములను బట్టి

తాత్కాలికముగా దాని వ్యవహార నీతి మారుచుండు గాక. కాంగ్రెసు అంత మాత్రమున ఒక రాజకీయ పార్టీయై ప్రభుత్వములో పాల్గొని దానిని దిద్దబూనుచున్నదని చెప్పజాలము. అది ఒక రాజకీయ పక్షము కాగానే దాని సార్వజనీన తత్వము క్షీణించి సకల ప్రతినిధి కాకపోవును. చాలా కాలము వరకు భారతదేశపు కాంగ్రెస్సు అట్టి సర్వజన ప్రాతినిధ్యగౌరవమును గోలుపోలేదు.

1921లో గాంధీజీ కాంగ్రెస్సు నాయకత్వమును వహించుటకు ముందుకూడా కాంగ్రెస్సు, సంస్థారూపకముగా ప్రభుత్వముతో నెట్టి సంబంధమును పెట్టుకోకుండానే, అనేక వీరపోరాటములను జరిపినది. అనంతజ్ఞాన పౌరుషములను ప్రదీపించినది. అయినా ఆ రోజులలో ప్రజా సామాన్యానికే కాక విద్యాధికులకు కూడా ప్రభుత్వమంటే ఒక గుండె భయం వుండేది. ప్రభుత్వం కూడా నిర్విచక్షణంగా ప్రధాన పురుషుల నందరినీ ఘోర శిక్షల పాలుచేసి, ప్రజలలో భీతిని పుట్టిస్తూ ఉండేది. ఎవరో మహావీరులు తప్ప కాంగ్రెస్ మాట రాజకీయాల మాట తలపెట్టే వారు కారు. అట్టి మహాకొద్ది మంది వీరుల త్యాగాల మూలముననే దేశమేమైనా ముందంజవేసేది లేకుంటే అక్కునక్కున భయపడి సాధారణ క్రిమికీటక జీవనమును జరిపేది.

కాని గాంధీ మహాత్ముని ప్రవేశముతో కాంగ్రెస్సు మూలకంగా దేశానికంతటికి ఒక నవచైతన్యము కలిగినది. ఎవరో కొందరు మహావీరులు మాత్రమే కాక సామాన్య జనులు కూడా రాజకీయ ప్రసంగములు చేయడం,జెండా ఉత్సవములు జరుపుట. ప్రభుత్వ ప్రతిఘటన చర్యలలో పాల్గొనుట, శిక్షలకు వెఱువకుండటమే కాక వానిని వలచుట మొదలైన కార్యక్రమం ప్రారంభమైనది. అంతకు ముందు కాంగ్రెస్సు కేవలం తత్వంలో మాత్రమే సార్వజనీన సంస్థ గా వుండేది కాని, నాటి నుండి కొంత కాలము వరకు ప్రత్యక్ష సార్వజనీన సంస్థగా కూడా వెలిగినది.

విజ్ఞానములో, ప్రతిఘటనా పరాయణత్వములో గాంధీ కాంగ్రెస్సు మునుపటి కాంగ్రెస్సు కంటే యొక్కువ విశాలమైనను, సభ్యత్వము కొందరికి మాత్రమే అంగీకరింపబడినందువల్ల ప్రత్యక్షముగా సార్వజనీనసంస్థ కాకపోయినది. నాలుగణాలు రుసుము చెల్లించని వారలందరూ కాంగ్రెస్సు సభ్యత్వమును

గోల్పోయినారు. కాంగ్రెస్సు సభ్యత్వము కొన్ని పదవులకు ఆధారమైనందున కొందరు పావలాడబ్బులు చెల్లించి సభ్యులయ్యేవారు. గడుసరులు కొందరు కొన్ని వేల పావలాలను ఖర్చు పెట్టి అంతమంది అనుకూల సభ్యులను చేర్పించుకొని వారి మూలకముగా తమ కనుకూలములగు పదవుల నెక్కగలిగినారు. మునిసిపలు కౌన్సిలు ఎన్నికలు, శాసనసభల యెన్నికలలాగే కాంగ్రెసు యెన్నికలు కూడా కశ్మలములైనవి. క్రమ క్రమముగా అది ఒక ప్రత్యక్ష రాజకీయ పక్షమై కాంగ్రెస్సు హోదాతో సర్వవిధములయిన పదవుల వేటకు దిగి, సంస్థ పేరు బలమువల్లను, అందరి సభ్యులు చేసిన త్యాగముల మహిమ వల్లను ఇతర పక్షములవారిని ఇట్టే సులభముగా ఓడించగలిగినది. ఈ విధముగా కాంగ్రెస్సు బలము యెక్కువ యైన కొద్దీ దాని సార్వజనీన ప్రాతినిధ్య ప్రభ వెనుకకు తగ్గినది.

అయితే నాలుగణాల డబ్బులు చెల్లించుమని కోరడం కాంగ్రెస్సు విధానము తప్పా అని కొందరు అడుగవచ్చును. నిజంగా చూస్తే సంవత్సరానికి ఒక నాలుగణాలు డబ్బులు చెల్లించడం ఒక కష్ట కార్యం కాదు. ఊరికే కాంగ్రెస్సు సభ్యుడనిపించుకొనుట కంటే, ఒక పావలా డబ్బు లాయెను చెల్లించి అట్లు అనిపించుకొనుటలో ఒక విశిష్ట చైతన్యము కూడా ఉంది. ఎన్ని చెప్పినా కాంగ్రెస్సు సభ్యత్వమునకూ డబ్బుకూ ముడిపెట్టుట వల్ల చెల్లించినవారు కొంచెం మంది కావడం, చెల్లించని వారు పెక్కుమందియై కాంగ్రెసు సభ్యులు కారనిపించుకోవడం తప్పనిసరియైనది.

నేటికిని కాంగ్రెస్సుకు తొంటి మహాగౌరవమింకా ఉన్నదంటే, పావలా డబ్బులు చెల్లించని వారు కూడా తాము కాంగ్రెస్సు సభ్యులమే అనుకొని తదా దేశములను ఆచరించి సానుభూతి చూపుచుండుటవల్ల మాత్రమే కలిగినది. ఉప్పు సత్యాగ్రహములో పాల్గొనిన మూకలలో, 1942 విప్లవములో పాల్గొనిన జనసామాన్యములో పావలా డబ్బులు చెల్లించిన వారికి కీర్తి దక్కినది. తక్కిన వారు విస్మృతులైనారు. వారేదో ఉత్సాహములో పనిచేసిన వారే కాని కీర్తి కాశించి చేయలేదు. పావలా చెల్లించకపోయినా, చెల్లించిన వారికంటే కూడ తత్వతః వారెక్కువ యోగ్యులైన కాంగ్రెసు వారని మనము నుండవవలెను.

గాంధీ మహాత్ముడు చాలా కాలము క్రిందటనే పావలా రుసుము లోని లోపమును అసభ్యత్వమును గుర్తించి యుండవలెను. అయితే దీపారాధనకు డబ్బు లేకపోతే తాను సృష్టించిన క్రొత్త కాంగ్రెస్సు సంస్థ వర్థిల్ల నేరదని తలచి కాబోలు అప్పటిలో తానేమియు మాట్లాడలేదు.

దేశానికి పోరాటము వల్ల స్వాతంత్ర్యం వస్తే అది సర్వజన సహకారం వల్ల వచ్చినదని చెప్పుకొనుటయే కొంత ఉత్తమము కాని, ఎంత త్యాగము చేసిన యేదో ఒక పక్షము మూలముగా మాత్రమే వచ్చినదని చాటుకొనుటకు లక్షణము కాదు. నేటి ఉత్తమ కాంగ్రెస్సు నాయకులలో కొందరైనా అట్లు ప్రకటించని వారున్నారు. అదియే నిజమైన వినయ లక్షణము.

అయితే ఒక్కొక్క విజయమువంటిది సమకూరుతూ వుంటే, కాంగ్రెసు రాజకీయ పక్షముగా వ్యవహరించిన వారిలో వినయము తగ్గుచు అది కేవలం తమ యొక్కరి ప్రజ్ఞాఫలమే యను అధికారము వ్యాపించినది. దీనికి సాయము గాంధీ కాంగ్రెసు రాజకీయపక్షమువారు తమ చర్యలనన్నింటినీ, బ్రిటిషు ప్రభుత్వము నెల్లాగో ఒక లాగా మెడ గెంటడానికి బదులు దానిని నిలువదీసియో సమాధాన పడియో రాజకీయాధికారమును పిండుకొందామనె సంకల్పముతో ప్రవర్తించినందువల్ల, బ్రిటిషు ప్రభుత్వమునకు తాను నిలువగలనను హామీ యొక ప్రక్కన చిక్కుటయే గాక, కాంగ్రెసు పక్షము బలమును సన్నగిల్ల చేయుటకై ఇతర పక్షములను దువ్వి కాంగ్రెస్సును ప్రతిఘటింపచేయడానికి మంచి అవకాశము కూడా చిక్కినది. అవతల ముస్లిము లీగు పక్షమును, ఇవతల షెడ్యూల్డు తరగతుల పక్షమును, ఇంకొక ప్రక్క ఇండియన్ క్రిష్టియన్ పక్షమును ఈ విధముగా ఎన్నో పక్షాలను లేవనెత్తి వారి వారిని ప్రత్యేక నియోజక వర్గాలు, ప్రత్యేక పదవీ స్థానములు, ప్రత్యేక సౌకర్యములు తక్షణ ప్రత్యేక రాష్ట్రాలు మొదలగు ఎఱలను చూపి దేశమును ఛిన్నాభిన్నముగ చీలికలు చేయగలిగినారు.

ఈ మహారణ్యములో కాంగ్రెస్సు తాను సార్వజనీన సంస్థనని శోకిస్తే యేమి లాభం? ప్రత్యేక నియోజకవర్గాలను ఆక్షేపిస్తే యేమి ఫలం? దేశం యెల్లాగా చెల్లా చెదరవుచున్నది. కాంగ్రెసు వ్యాపించిన రాజకీయ చైతన్యం కూడా ప్రజా గణములకు ఈ తప్పు త్రోవలలో పోవడానికే సాధనమయింది.

చెదరిపోయిన పూసల నన్నిటినీ యెలాగో ఒకలాగ తిరిగీ దారములో చ్చుటకు, బ్రిటీషు ప్రభుత్వమవలంబించిన కృత్రిమ పద్ధతియే కాంగ్రెస్సుకును రణ్యమైనది. ముస్లిము, క్రిస్టియను ప్రత్యేక నియోజక వర్గాలను కాంగ్రెస్సు గాడా ఆమోదించినది. ఇరువది యొక్క రోజులు ఉపవాసము చేసి నిమ్న ాతుల ప్రత్యేక నియోజక వర్గం నెట్లో గాంధీ ఆపగలిగినారు.

ఈ విధముగా కొందరికి ప్రత్యేక నియోజక వర్గాల నామోదించినందున గారి వారిని ప్రత్యేకజాతులుగా భావించిన దోషము కాంగ్రెస్సుకు పట్టినది. కైస్తవులు తాము భారత జాతి వారమని యే పుణ్యము వల్లనో ఒప్పుకొన్నారు. కనుక సరిపోయినది కాని, మహమ్మదీయులవలె తామొక ప్రత్యేక జాతివారమని డి వాదనచేస్తే స్వయం నిర్ణయ సూత్రం ప్రకారం వారి కొక "క్రాసు స్థాను" ను కాంగ్రెసు అంగీకరించక తప్పేది కాదు. ఈ విధముగా భారత "జాతీయ" కాంగ్రెసు బ్రిటిషు వాని తంత్ర మహిమవల్ల "విభిన్న జాతీయత"లకు ఆలవాలమైనది. ద్రావిడ స్థానాది ప్రత్యేక స్థానాలవాదము రైతు, కార్మిక, చేనేత మొదలయిన వృత్తి వర్గవాదములు ఒక మోస్తరుగ విభిన్న జాతీయతలకే దారితీయుచు జాతీయ దేశీయ ఐక్యతకు భంగం కలిగించుచున్నవి. బ్రిటిషువాడు పోయిన తరువాత కూడా ఈ అల్లకల్లోలము నుండి గాంధీ కాంగ్రెస్సు తప్పించుకొనజాలకున్నది.

కనుక కాంగ్రెస్సును సంస్కరించక తప్పదని గాంధీజీ గ్రహించినాడు. మొట్టమొదటి మెట్టుగా పావలా రుసుం బాధ్యతను తొలగించి, దేశమునందలి సర్వ పౌరులను కాంగ్రెస్సు సభ్యులుగా భావించుకొనునట్లు అతను యేర్పాటు చేసినాడు. దేశంలో అనేక రాజకీయ పక్షాలుండవచ్చును గాని యే పక్షమును తాను కాంగ్రెసు పక్షము ననుకొని తత్కారణముగా తక్కిన పక్షముల కంటె గొప్ప దానినని గర్వించుటకు వీలు లేకుండా చేసినాడు. కాంగ్రెస్సు ఈ విధముగా స్వతంత్ర దేశాలలో ఎల్లాగ సార్వజనీన సంస్థ గా వుంటున్నదో అవిధముగానే ఇక్కడ కూడ వుండుటకు ఆధారము కలిగించినాడు. సర్వజన సమాధాన సమ్మోదములను బడయవలసిన ఏయొకటి రెండు ఉత్కృష్ట సమస్యలో తప్ప తక్కిన రాజకీయ ప్రణాళికకు దానితో సంబంధం లేకుండా రాజకీయపక్షముల చాకచక్యములు బలంప్రాశస్త్యంతో మాత్రమే సంబంధ ముండేటట్లు చేసినాడు.

గాంధీ మహాత్ముని సూచనలను అతని మరణానంతరము కాంగ్రెస్సు కమిటీ ఆమోదించినది. కాంగ్రెస్సు కూడా త్వరలో ఆమోదించగలదు. కాంగ్రెస్సు బాధ్యత ఇకముందు సర్వజన సమాన శ్రేయోదాయకములైన సమస్యలను గురిచి విజ్ఞానము దీక్ష ప్రజలలో వర్ధిల్ల చేసి శాంత పౌరుష జీవనము జరుపుటకు సాధనములు కలిపించుటే. గాంధీజీ సూచించిన "లోక సేవక సంఘా" లీ పనినే ఇక ముందు ప్రజల చేత చేయించగలవు. కాంగ్రెస్ సభ్యత్వపు హోదాతో ప్రజానీకమున కింతకంటె యెక్కువ ప్రమేయం లేదు.

అయితే సర్వులును కాంగ్రెస్‌లో సభ్యులే గాక, దేశంలో వోటరులై కూడా యున్నారు. వోటర్లుగా వారికి రాజకీయ బాధ్యతలున్నవి. వివిధ రాజకీయ పక్షముల వారు తమ ప్రణాళికలను తత్వములను వారికి బోధ చేసి వశీకృతులుగా చేసుకొనగడంగుదురు. వారికి యీ విధముగా నవ్యమైన రాజకీయ జ్ఞానం పట్టుబడును. వారికే పక్షము ప్రణాళిక బాగా నచ్చితే, ఆ ప్రణాళిక అభ్యర్థులకు వారు వోటుల నత్యధికముగా నిత్తురు. ఆ పక్షం వారును తమ ప్రణాళికలను సవ్యముగ నడుపుదురు.

ఏ ప్రణాళికయైనా పనిచేయడం ప్రారంభిస్తేనేగాని దానిలోని లోటుపాటులు విశదం గావు; గెలిచిన పక్షం వారు సవ్యంగా పనిచేసి దేశ శ్రేయస్సును కూర్చగలిగితే, తిరిగీ యెన్నికలలో వారినే ప్రజలు బలపరుస్తారు లేకుంటే అప్పుడింకొక పక్షము వారి ప్రణాళిక వోటర్లకు మనోహరముగా కనిపించితే, ఆ పక్షమునకు వోటర్లు పట్టం కట్టుదురు. ఈ విధంగా ప్రజాప్రభుత్వ విధానం సాగుచుండును.

నిజంగా ఏ దేశంలోనైనా మత విషయము పైన రాజకీయ పక్షాల కెట్టి తావును లేదు. నిజమైన మతం వారెవ్వరూ అట్టి దురాశకు పోరు. బ్రిటిషు వాడి మహిమ వల్ల ముస్లిముల ఆవేశం వల్ల వారొక మత రాజకీయ పక్షమైనారు. కాంగ్రెస్ ఆ పక్షం అంగీకరించి అది కోరిన వరముల నన్నింటిని అర్పించుట ప్రారంభించినది. అందువల్ల సిసలైన జాతీయ పక్షమగు హిందువుల పస అడుగంటి పో జొచ్చెను. మహా సభవారు దీనిని సహించలేక ముస్లిం

లీగుకు ప్రతి కక్షగా తమ సంఘ బలమును బలిష్ఠం చేసుకొనుటకై తాపత్రయము పడినారు. కాంగ్రెసు చెప్పుచున్న ఆశయమునకును మహాసభ ఆశయమునకును ఎట్టి భేదమును లేదు. అయితే కాంగ్రెసు అవలంబించిన విధానమునకు మహాసభ విధానమునకును కృత్రిమ జాతీయతకు నిజమైన జాతీయతకు గల యంత తేడా యున్నది. అయినా మహాసభను కుటిలత్వ సంస్థయని కాంగ్రెస్ నిరసించుట కాంగ్రెస్ జాతీయతకే కళంకమైనది.

ముస్లిము లీగర్లు మేము భారతీయులము కామని వాదించి బ్రిటిషు సహాయం వల్ల పాకిస్థానమును నిర్మించుకునివేరే కాపురం పెట్టుకున్నారు. మిగిలిన ముస్లిములకు ప్రత్యేక నియోజక వర్గాది కృత్రిమ సౌకర్యాలను తొలగించి భారత రాజ్యాంగ పరిషత్తువారు సాధారణ వోటర్ల అంతస్థుకు దించేశారు. మహాసభ ఆశయమును ఇదియే కనుక అది తన తొంటి కార్యక్రమ ప్రణాళికను కట్టిపెట్టి మత సంస్థకు బదులు పౌర సంస్థలలో నొకటియై నిలచినది.

ముస్లిము లీగు పాకిస్థానముల తుఫాను ఇప్పటికి కొంత మాత్రమే చల్లారినది. ఏ క్షణములో ఏ రూపముగా ఎవరి సహాయంవల్ల అది యెట్లు విజృంభించి భారత జాతీయతను నిర్మూలించి మహమ్మదీయ మత జాతీయతను నిలబెట్టి, హిందూ శిక్కు సంఘములపై దాడి తీయునో ఊహింపజాలము. భారతదేశ ప్రభుత్వమును అందలి సమస్త సంఘముల వారును ఇప్పటికంటె వేయిరెట్లు బలిష్ఠులై యీ యుప్పెన నెదుర్కొన సంసిద్ధులై యుండవలెను.

*– ఢంకా, మార్చి, 1948*

# భారతదేశమునకు కావలసిన సోషలిస్టు విధానము

అశేతు శీతాచల పర్యంతం ఇప్పుడు సోషలిజమ్ అనే శబ్దముతో మారు మ్రోగుచున్నది. ప్రతివార్తాపత్రిక యొక్క "పాలసీ" అదే అయి వుంటున్నది. మిల్లు యజమానియగు డాల్మియా మొదలు సాధారణ కార్మికుని వరకు, వార్తాపత్రికా సంపుటీ చక్రవర్తి యగు గోయెంకా మొదలు సాధారణ కాంపోజిటరు వరకు, జమిందారులు నాయకుడగు సుబ్బరాయన్ మొదలు రైతు కూలీ వరకు, జవహర్లాలు మొదలు పటేలు వరకు; జయప్రకాశ మొదలు కృపలానీ వరకు యెల్లరును అ శబ్దమును గైకొనియే తమ ప్రమాణములను చేయుచున్నారు. ఇంకే సిద్ధాంతముపై నైననువ్యతిరేక భావమున్న దేమో కాని నేడా శబ్దముపై నెవ్వరికిని విరోధమేలేదు. యూనియన్ కేంద్రప్రభుత్వ మీ సిద్దాంతమును స్థయిర్యముతో అవలంబించినచో అది విజయవంతము కాగలదేమో అన్న ఆశ యెల్లరకును జనించుచున్నది.

ప్రస్తుతం మట్టుకు పెద్దలందరూ ఏ సోషలిజములో నైనా తమ ఆస్తులకు దర్జాలకు యేమీ భంగమురాదని భావించుచున్నారు. చిన్న లందరూ తమ స్థితి మనుపటి కంటె వేయిరెట్లు బాగుగా నుండుననిన్నీ తమ స్వల్ప ఆస్తులకెట్టి భంగమును కలుగదనియు భావించుచున్నారు. కాని సోషలిజము దినాదినాభివృద్ధిని పొందుచున్న కొలది ఇట్టి స్వప్నములు చెల్లా చెదురు కావలసియున్నవనియుచు, అందుకై వలసిన యెట్టి త్యాగములనైనను వారు చేయవలసి యున్నదనియు, సర్వజన శ్రేయస్సే, దేశాభ్యుదయ పురోగమన మొక్కటే తమ అందరి యేకైకాశయమై అలరారవలెననియు వారు గ్రహించగలరని నమ్మవచ్చును.

_ సోషలిజము యొక్క ప్రప్రధమా శయము సర్వులకు సమానముగా అత్యావశ్యక భోగములెల్లియు సమకూడుటొక్కటే కాక, అవి తీరగా వారెంతో కొంత ధనమును తీరికను మిగుల్చుకొనుటకును, ఎల్లరు మిగుల్చుకొన్న ధనమును తీరికను యేదో యొక విధముగా దేశాభ్యుదయ కార్యముల కొరకగు ఖర్చులకై ప్రభుత్వము ఆకర్షించగలయట్లు ఉండవలెననియే. ఏ

సంవత్సరపు టాదాయమును లేక లాభమును లేక మిగులును యెల్లరును యెప్పటికప్పుడు ఖర్చుపెట్టేసుకుంటే, దేశాభ్యుదయ సంస్థలకు కళావర్థనమునకు, పాండిత్య ప్రకర్షలకు, దేశరక్షణకు ఆస్కారముండదు.

మానవజన్మ తిని కూర్చోడానికి భోగించి చచ్చిపోవడానికి కాక కొన్ని ఉత్తమాశయాల సంసిద్ధికోసమను మాట నెవ్వరూ మరువకూడదు. సాధారణ ఆహార నిద్రాభయ భోగాదులను జంతువులు కూడా అనుభవించి నీల్గుచున్నవి. వానికంటె మానవునిలో ఉన్న విశేషము జ్ఞానము. ఆజ్ఞానవాహినిని విజృంభించుటవకాశములు కల్పించకున్నచో మానవజీవితమే వ్యర్థము. క్యాపిటలిస్టు ఆధ్వర్యం క్రింద జనితమైన జ్ఞానం లోక కళ్యాణం కొరకు కంటే, మానవ విధ్వంసం క్రింద ఎక్కువ ప్రయోజనపడ్డది. సోషలిస్టు ఆధ్వర్యం క్రింద, అజ్ఞానమును భవిష్యత్పరిశోధనా ఫలితజ్ఞానమును విశ్వప్రపంచ మానవకళ్యాణము కొరకు వినియోగించవలసి యున్నది.

నిజమైన సోషలిజములో ఆస్తులకై తగవులాట లుండరాదు. సమస్తమైన ఆస్తి సర్వులదిన్ని. సర్వులకు ప్రతినిధి ప్రభుత్వ సంస్థ - సర్వుల శ్రేయస్సు కొరకు ఆ ప్రభుత్వమే యాస్తినైనను అవసరమైతే తాత్కాలిక హక్కుదారునకు తగు పరిహారమిచ్చి స్వాధీనము చేసుకొని వినియోగించవచ్చును. ఇందుకు జమిందారు మొదలు రైతు వరకు సంతోషముగా అంగీకరించి, తత్పురోభివృద్ధి కొరకును, తమ పురోభివృద్ధికొరకును శాయశక్తులా శ్రమ పడుట నేర్చుకోవలెను. ఆస్తినిమిత్తమాత్రమనియు, శ్రమ, భోగము, తృప్తి, తీరిక విజ్ఞానముల నిమిత్తమది సాధనమాత్రమనియు, సర్వమునకును హక్కుదారు అందరికిని ప్రతినిధియగు ప్రభుత్వమే కనుక యెక్కువ తక్కువలని కీచులాడుట ఒక మోస్తరు నేరమనియు యెల్లరును భావించవలెను.

కమ్యూనిజములో కూడా ఆస్తి సర్వమూ ప్రభుత్వముదే. ప్రభుత్వ మొక్కటే సర్వమునకు యజమానియై తన తాబేదారులకు ఉద్యోగుల ద్వారా సర్వుల చేత పని చేయించి అందరికీ ఇంచుమించుగా సమాన సౌకర్యములు కలిగించి అందరి ప్రేమను జూరగొన చూచుచుండును. ఇది ఒక మోస్తరు ఉత్తమరకం క్యాపిటలిజమ్ పద్ధతి వంటిది. ప్రజలకు ప్రభుత్వాజ్ఞా నిర్వహణము తప్ప మరెట్టి బాధ్యతయు ఉండదు. తమ సంతృప్తిలో వారు

సర్వమును మరచి ప్రభుత్వ విధానమును కీర్తించుచుండుటలో పరవశులగుచుందురు.

నిజమైన సోషలిజములో ప్రభుత్వము సర్వాధికారియైనా, భారము నంతటినీ తన నెత్తిపైని పెట్టుకొని మోయనొల్లక, ప్రజలకు వారి వారి ఆర్థిక, నైతిక, వైజ్ఞానిక, శ్రామిక స్థాయిలను బట్టి బాధ్యతలను ఉచితరీతిని పంచి, వారు సక్రమముగా నిర్వహిస్తూ వుంటే ప్రశంసిస్తూ, అక్రమ సూచన లేమైనా కనిపిస్తే నివారిస్తూ, పై పెత్తనము మాత్రము చలాయిస్తూ ఉంటుంది. " ఏ ప్రభుత్వము అతి తక్కువగా పరిపాలిస్తు వుంటుందో అది ఉత్తమ ప్రభుత్వము" "That Government is the best which governs the least" అని ఒక సామెత ఉన్నది. కమ్యూనిజము తానే సర్వము వహించి ప్రజలను అబాధ్యులుగా చేయడానికి పూనుకొనుచుండగా, సోషలిజము సర్వమును ప్రజాసంస్థల కొప్ప చెప్పి తాను పై అజమాయిషీ మాత్రము చెలాయించుచుండును. ఇంక ప్రస్తుతపు క్యాపిటలిజము లేక ఇంపీరియలిజము లోనా, ధనవంతులును పెట్టుబడిదారులును ప్రభుత్వమును తమ పిడికిటిలో పెట్టుకొని, ఉద్యోగస్థులకు లంచాలు, వర్తకులకు పెద్ద కమీషనులు యెర వేసి వారి నీతులను చెరపి, ప్రజల కష్టాల వల్ల కలిగే ఫలితాల నన్నింటిని తామే హరించుకుని, లోకమంతా యేడుస్తూ వుంటే తాము మాత్రము బంగారపు తూగుటుయ్యాలలో ఊగుచుందురు.

కనుక కడపటి దానికంటే, మొదటి రెండింటిలో యేదైనా నయమే. ఆ రెండింటిలో సోషలిజము శ్రేష్ఠమైనదని, భారతదేశ తత్వమునకు అనుగుణమైనదనీ చెప్పవచ్చును.

మానవులలో సమాననైతిక, ఆర్థిక, వైజ్ఞానిక, శ్రామిక సంపదలు నెలకొల్పడము ఉత్తమ ఆశయమే కాని తక్షణ సంప్రాప్యముకాదు. వారి వారి మానసిక శారీరక తత్వములను బట్టి వారు కొందరు ఉత్తమ వ్యవసాయకులుగా, ఉత్తమ యజమానులుగా, మేనేజర్లుగా, ఆర్గనైజర్లుగా, కవులుగా, గాయకులుగా, వీరులుగా, పాటకులుగా, పరోపకారవ్రతులుగా, యోగులుగా ఆ పరిణామములు పొందుతూ వుంటారు. అందరినీ యేక మట్టముగా చేదామనే సంకల్పము సాధ్యమూ కాదు. వివేకము కాదు. అందరి వల్లా అందరికి లాభము కలుగుతున్నదా

లేదా అని మాత్రమే చూచుకోవలెను గాని, యెవరిది యెక్కువ యెవరికేది తక్కువ అను పితలాటకములోనికి దిగితే లోకమున కెన్నటికిని శాంతి గాని పురోభివృద్ధి గాని చేకూరదు.

కనుక రానున్న భారతదేశపు సోషలిజములో కవులకు గాయకులకు నిర్మాతలకు శ్రామికులకు పత్రికా సంపాదకులకు పండితులకు అందరికి స్థానం ఉంటుంది. ఎవరి స్థాయికి సరిపడునట్లు అందరికి ప్రతిఫలములు భోగములు చిక్కి వీలయినంత తీరిక ధనము మిగులునట్లు యేర్పాటులు ఉంటవి. ఎవరి తీరికను గాని మిగిలిన ధనమును గాని దుర్వినియోగము చేయకుండా సద్వినియోగము చేయడానికి సత్సంస్థలు సదవకాశములు నిర్మించబడుతవి.

ఒకరి వద్ద యెక్కువ ఆస్తి, జ్ఞానము, శక్తి, లేక శీలము వున్నదని యితరులు యీర్ష్య పొందనక్కరలేదు. అందరి శక్తుల ఫలమును అందరికిని పంపకమగునట్లు సత్సంప్రదాయములు నెలకొల్పబడును. ఇది మన భారతదేశపు సనాతనఘాతలు కలిగించి, నిర్వీర్యము చేసి, మనలనందరిని అర్థదాసులుగను, పరప్రభువుల బానిసలుగను దాస్య పదవులు, బిరుదులలో కుళ్ళుచు గరించు బానిసలు గను మార్చి వైచినది. మన వైజ్ఞానిక సంప్రదాయములు మనకు వెగటు అయినవి. నవనాగరికతా పిశాచపు ప్రళయ తాండవము మనకు ఆనంద సినిమారంగమైనది. శ్రమపడడము నీచమని, దొంగదారుల శ్రీమంతులమై భోగములలో కుళ్ళడము గౌరవమని భావించుకొనే దురవస్థలకు వచ్చినాము.

కొంతమంది మిల్లు యజమానులు, జమిందారులు, వర్తకులు, పైక్యాపిట లిస్టు విధానములో పూర్తిగా కుళ్ళిపోయినారు. వారిని దారిలోకి తీసుకొనిరావడం దుస్తరము. వారికి కూడా అట్లు వచ్చి, మానసేవ చేదామనే సంకల్పం శూన్యమైనది. వారికి జీవనభృతులను పారవేసి విసర్జించడమే తగిన పద్ధతి. అట్లుగాక ఇంకా సంప్రదాయములకు, నీతికి, మానవసేవా పరాయణ త్వమునకు హత్తిపెట్టుకొని పనిచేయగోరువారు వారిలో కొందరు గలరు. పోయినవారు పోతే మిగిలిన వారు ఆదర్శప్రాయముగా వ్యవహరించగల అవకాశములు కుదురును.

ప్రస్తుతం భూమిలేక వ్యవసాయం సమస్య మనకు గండమై వుంటున్నది. జమిందారీలలో నేమి గవర్నమెంటు జిరాయితీలలో నేమి చిన్న చిన్న చీలికలే కాని, యే కాండ భూములెక్కడా కానరాకున్నవి. కలెక్టివు ఫార్మింగుకు యేమి, ట్రాక్టర్ల ద్వారా దున్నించడానికేమి, ఇట్టి భూస్వామ్య పద్ధతి చాలా ఆటంకకరమైనది. భారీ యెత్తున వ్యవసాయం సాగించకుంటే, ధనం పంటలమీద కంటె ఆహారం పంటల మీద యెక్కువ శ్రద్ధ నిగిడింపకుంటే యిప్పటి కరువు తీరదు. తిండికిగుడ్డకు యితర దేశాల మీద ఆధారపడిన ప్రయోజనం లేదు.

ఇకముందు యేస్టేటులను ట్రాక్టర్ల వల్ల దున్ని, కలెక్టివు విధానముగా పండించాలి, వాటిమీద యే పంటలు పండించాలో యే పంటలు వేయకూడదో ప్రభుత్వం వారి ప్లానింగు కమీషనులు నిర్ణయించాలి. కనుక రైతులందరూ ఒక ఫారం యావత్తూ తమ అందరిదీ అనే దృష్టితోనే వర్తించాలి కాని, యీ చీలిక నాది, ఆ చీలిక నీది అనే తగాదా దృష్టితో వర్తించరాదు. కొంతకాలం వరకు వారి ప్రస్తుతపు టాస్తుల మొత్తములను బట్టి వారి ఫలసాయముల నిర్ణయం జరుగుతుంది. తరువాత వారి కుటుంబ సభ్యుల సంఖ్య, వారి శ్రమల యొక్క తరగతి, వారి అవసరముల యొక్క ప్రాభవములను బట్టి ప్రతిఫలములు మారుతూ వుంటవి. ప్రస్తుత పరిస్థితిలో గడుసువాళ్ళకు కంచం నిండా అన్నము మెత్తని వాళ్ళకు ఉత్త ఆకులు లభ్యమగుచున్నవి. వుండాకోరు తంత్రగాంధ్రుడు కోటీశ్వరులవడము, ధర్మాత్ములు వారికి దాసులవడము తటస్థించుచున్నది. దేశ ద్రోహులకు బిరుదులు దేశభక్తులకు లాటీ ఛార్జీల దినములు గతించినా పై అరాచకము లింకా పోలేదు. ఇదే యిప్పుడు తారుమారు కావలెను.

క్రొత్త వ్యవసాయక విధానములో యిష్టమైతే యిప్పటి జమిందారులలో కొందరిని వారి జమిందారీలలోని ఫారములను తనిఖీ చేస్తూ, పరిశీలిస్తూ యెక్కువ అభివృద్ధి కారకముగా వర్థిల్లుటకై నిలబెట్టవచ్చును. వారిపని మునుపటి వలె, యింట్లో కూర్చోవడము శిస్తులు వసూలు చేయడము, పేష్కషు కట్టడము మిగిలినది దుర్వ్యయము చేయడము కాకుండా, ఫారముల వ్యవహారమునంతటినీ స్వయముగానో, తమ తాబేదారుల ద్వారాగానో పరిశీలిస్తూ

వుండడము, ఫారముల వల్ల వచ్చే శిస్తులను వసూలు చేస్తు వుండడము పేష్కషులు కడుతూ వుండడము. మిగిలినది ఆ ఫారముల అభివృద్ధి కోసమో, యితర సంస్థల పోషించుట నిమిత్తమో వ్యయయు చేస్తూ అదర్శజీవనము జరుపుతూ, ప్రభుత్వపు టంగములలో ముఖ్యములగు అంగములగా నుండుటయే ఇట్టి భారమును వహింపగల ఆవేశము వుత్సాహము పుట్టించి కొందరిని శోధన చేయడం మంచిది.

పూర్వ వాసనలు కొంత దులుపుకుంటే, వారీ కార్యములకువుత్సాహముగా దిగగలుగుతారు. వారు దులుపుకోలేకుంటే, వారిని వెంటనే తొలగించవచ్చును. కందకు లేని దురద బచ్చలికి అవసరము లేదు.

ఇట్లే మిల్లులను కంపెనీలను బ్యాంకులను కూడా సంస్కరింపగడగవలెను. ఆర్గనైజర్లుగా, తనిఖీదార్లుగా,మేనేజర్లుగా వ్యవహరిస్తూ ఒక నిష్పత్తి ప్రకారం తమ ఫలమును అనుభవిస్తూ మిగిలినది వాటి వృద్ధి కొరకును యితర సత్సంస్థా ప్రవర్ధానము కొరకును వారు వినయోగింప సంకల్పించుకొంటే మంచిది. అట్లుకాక మునుపటి త్రోవనే వర్తిస్తామంటే వారికి కూడా స్వస్తి చెప్పవలెను.

కాగా, అప్పటికి మనకు కమ్యూనిజము మాత్రమే గతి అవుతుంది. సోషలిజమును యీ విధముగా నడిపించలేని మనధీరులు కమ్యూనిజమ్ము నేమాత్రము నడిపించగలరు? రష్యా మనకు సాయం చేయవస్తుంది.. మనకూ, దానికి పుస్తె అవుతుంది. మన జాతీయతత్వమునకు సంప్రదాయమునకు తర్పణామవుతుంది. రానున్న అమెరికా రష్యా యుద్ధములో మన మొక్క పక్షంలో పడి నలిగిపోతాము. కనుక పై చెప్పిన సోషలిజము విధానమును దేశీయు లెల్లరను బలపరుతురు గాక.

– *ఢంకా, సెప్టెంబరు, 1947*

# భారతదేశానుగుణమగు కమ్యూనిజము కావలెను

ఇది యొక విచిత్రమైన కాలము. చెప్పేవి శ్రీరంగనీతులు, చేసేవి అబద్ధపు చేతలు, చేసేవి గంగా స్నానాలు, దూరేవి దొమ్మరి గుడిసెలు పైకి కనిపించేది ధర్మావతారం, లోపల వెలసినది కుటిలతా కుహరం. ఈ కళలలో ఆరితేరినవారికి మూర్ధాభిషేకాలు, అవి యెరుగని ధర్మాత్ములకు అథఃపాతాళాలు.

ఇటువంటి మహాసామ్రాజ్యాని కంతటికీ మకుటము ఐక్యరాజ్య సమితియు దాని చెలిమికత్తెయగు భద్రతామండలియు దాని పాలనలో నలిగేవి అనంతకోటి మానవజీవరాసులు. దానికి అప్పులు కానివారికైనా దాని మీద ఆశపెట్టుకోకపోతే గతి లేదు. దాని అప్పులకు తప్ప దానిని నమ్ముకున్నందువల్ల లాభము లేదు. దాని శాఖలనంతములు – ప్రపంచ ఆహారోత్పత్తి సరఫరాశాఖ, ప్రపంచ పరిశ్రమాభివృద్ధి శాఖ, ప్రపంచ కార్మిక శాఖ, ప్రపంచవిజ్ఞాన శాఖ, ప్రపంచ శాంతి సుహృద్భావ శాఖ – అన్నీ విశ్వ ప్రపంచశాఖలే.

ఈ సమితి వల్ల ఈ మండలి వల్ల ఈ శాఖల వల్ల ఎవరికేమి మేలుకలుగుచున్నదో ఈశ్వరుని కెరుక కాని ఎవ్వరికినీ దండుగలు, పరాధీనతలు, నిస్సహాయతలు తప్ప లేదు దీని కంతటికిని అధిష్టాన దేవత అమెరికా, ఉప దేవతలు బ్రిటను, ఫ్రాన్సు మొదలైన వర్గాల వారు ఏ తగాదా తీరాలన్న ముఠాలు తీర్పు చెప్పాలి. ఆ ముఠాలు అమెరికా ఆజ్ఞలను పాలించి తీరాలి. అట్లు కానినాడు అమెరికా సహాయము వారికి చిక్కదు, అమెరికా పగ వారికి నిక్కము. వారికి కావలసిన సరఫరాలు అందవు సరే గదా, స్వయం సహాయము కూడా సాధ్యము కాదు. నవరంధ్ర నిర్బంధమై త్రాహి త్రాహియని అవి మాడవలసిందే జర్మనీ, జపాను ఫ్యాసిస్టులు తమ చుట్టపట్ల వారి నెవరినో భయపెట్టి దిగ మ్రింగిరేమో కాని, నేడు అమెరికా విశ్వ ప్రపంచమును అతి తమాషాగా దిగమ్రింగి పాదాక్రాంతము చేసుకొనుచున్నది. బట్టగాని లేకుంటే ఈ భేతాళుడు ఈపాటికి విశ్వ ప్రపంచమును తన వలలోకి ఆకర్షించుకొని యథేచ్ఛాతాండవ మొనరించేవాడు.

రష్యా కూడా అమెరికాకు సరియైన ఉజ్జీయే. తన చేతిదొక కాసు దండుగ

లేకుండా ప్రతి దేశములోను యెక్కడకక్కడ కమ్యూనిస్టు సమ్మెలను రేకెత్తించి జెకోస్లేవాకియా, ఫిన్లండు, రోమేనియా మొదలగు తూరు ప్ర యూరపు దేశములను జీర్ణించుకొన్నది. గ్రీసుమీదికి పంజాను చాచినది. తన వంతు జర్మనీని దిట్టము చేసుకొన్నది. ప్రతి ప్రాచ్య ప్రతీ చీ దేశమునందును తన కమ్యూనిస్టు పార్టీలచేత వీలయితే యుద్ధాలు కాకుంటే సమ్మెలు చేయించున్నది. చీనాలో దాని చారలు పారుచున్నవి. పాలస్తీనా యూదులలో దాని చారలు కనిపించుచున్నవి. తనవంతు కొరియాను గుప్పిట పెట్టుకొని అమెరికా వంతును టక టక లాడించుచున్నది. అమెరికాది కేవలము అర్థనీతి కాని,రష్యాది జటిలమగు రాజనీతి. అర్థనీతి పారినన్నాళ్లు పారి బెడిసి కొట్టవచ్చును కాని రాజనీతికి అపజయము రాదు.

ఈ మహా ప్రపంచములో నేడు భారతదేశము చిక్కుపడియున్నది. బ్రిటిషు వాడు తానిక్కడ ఉన్నప్పటికంటే వెళ్లుతూ వెళ్లుతూ ఈ దేశమును రెండు ఖండములు చేసి తన పగను తీర్చుకున్నాడు. వెళ్ళిన తరువాత ఐక్యరాజ్యసమితి చర్చలు పాకిస్తాన్ సహకారముల ద్వారా హిందుస్తాన్‌పై వేయి రెట్లెక్కువగా పగ సాధించుకుంటున్నాడు. ఇప్పటి మన కష్టాలన్నిటికీ కీలకము వాడే, అయినను తన వయోముఖము ద్వారా తనంత ఉదారుడు మనకు దొరకడని మన కేంద్రాది ప్రభుత్వములనుండే సన్నుతులను, తన సామ్రాజ్యమును వీడమనీ, తనకు వర్తక సౌకర్యములు చూపుతామని వాగ్దానములను గొనుచున్నాడు.

బ్రిటిషు పిశాచము ఉండినప్పటికంటే కూడా ఊడిమరీ పీడించుచున్నది. దేశము పొడుగునా ఆట పట్టులను నిర్మించుకొని, కాచుకొనుచు, అదృశ్యముగానే అణగి అనేకము పితూరీలను రేబెట్టుచున్నది. ఈ మాయతెర విప్పడానికి కాంగ్రెసు వశము కాదు; ఏల ననగా కాంగ్రెస్సే కోరి కోరి యీవలను కొనుక్కొని అధికార స్వీకారము చేసుకొని పడరాని అనుభవములు పడుచు, పరువుకోసం మాత్రం తాపత్రయము పడుచున్నది.

భారతీయులు, వారిలో ముఖ్యముగా హిందువులు బ్రిటిషు వాడికేమి కీడు చేశారో చెప్పజాలము. తమ బుద్ధి బలము నెల్లయు ఎరువిచ్చి, సామ్రాజ్య నిర్మాణములో వానికి సహాయ భూతులవడమే ప్రథమ తప్పిదము. అ యుగమహాత్మ్యమట్టిది. అది విధికృతము, దానికిప్పుడు వగచిన లాభము లేదు.

ఆ తప్పిదము యెడల కన్ను తెరచిన వారు గూడ వారే. దాసులై నలుగు చున్న వారెవరో నలుగుచుండినా, విప్లవ జ్వాలలను రేకెత్తించి భారతీయ పౌరుషమును ప్రజ్వలింపచేసి, వీర సమరములొనరించిన వారు కూడా వారే. ఈ దేశములో హిందువుడన్న వాడొకడు లేకుంటే, తన సామ్రాజ్యమెంత లాభకరముగా సాగేదిరా అని బ్రిటిషువాడు భావించాడు. కాని కొందరు హిందువులు లేకుంటే వాని జెండా యేలాగ యెగురదో, అందరు హిందువులను రెడ్డిండియన్లలాగ హతమార్చడం కూడా వానికి తరమైనది కాదు. కనుక హిందువులమీద వానికి ప్రత్యేకం పగ పట్టుకొన్నది.

హిందువుల నెంత దుర్బలులను చేస్తే తన ఆట అంతబాగా సాగుతుందని నిశ్చయించాడు. ఇందుకొరకు హిందు ముస్లిము క్రిష్టియన్ భేదాలా, హిందువులలో తిరిగీ బ్రాహ్మణ అబ్రాహ్మణ పంచమ రెడ్డి కమ్మ తెలగ మాలమాది గాది భేదములా, విషబీజములను వాడు విచ్చల విడిగా వెదజల్లినాడు. అయినా హిందువుల ప్రభావం వల్ల ఈ దేశములో జాతీయ కాంగ్రెసు ఉద్యమం ప్రబలి, వాడిక్కడ నిలువలేక తహతహలాడిపోయేడు.

ఏలాగా పోక తప్పదని తెలసి అందులో కూడా యేమో ఒక ఘనత ఉన్నట్లు ప్రపంచాన్ని నమ్మించ యత్నించి పలాయానం చిత్తగించాడు. వాడు వెళ్ళినా వాడి లాభాల కిప్పుడెట్టి తకరరును లేదు. వాడు పెట్టిన విషబీజం మూలముగా పాకిస్థాన్ వేరే ఖండమై వాని కండయై మన గుండెల మీద కుంపటియైనది. దాని ప్రతినిధులు జిన్నా, హైదరాబాదు నైజాములు.

జిన్నా తన పాకిస్థానముతో తాను తృప్తుడు కాక, అక్కడ, ఉండిన హిందువుల నెల్లరిని వధించుటతో తనివి తీరక, కాశ్మీరము, నాక్రమించి, తన్మూలమున హిందూస్థానమున నొక్కొక్క యంగ వైచి బ్రిటిషు వాడి యేజంటుగా నిలచి, బ్రిటిషు వాడు చేయలేక వెళ్ళిపోయిన హిందూ హత్యాకాండను తాను పూర్తి చేదామని సంకల్పము పెట్టుకొన్నాడు.

నైజాము జిన్నాకు అన్న కాని తమ్ముడు కాడు. బ్రిటిషువాడికి జిన్నాను మించిన దాసుడు కనుక ఆప్తమిత్రుడైనాడు. అనర్గళ సలహా సహాయముల నందు కొంటున్నాడు. వారి అండ చూచుకొని ప్రజలెల్లరు భారత యూనియనులో

చేరమంటున్నా వినక తన పారమౌంటసీని నిలబెట్టుకొని స్వతంత్రంగా నిలచి భారతదేశముపై కుట్రలు పన్నుచున్నాడు. ఇందులో అతనికి తన పక్షీయులగు రజాకార్లు అంగరక్షకులు. ఆ రాజ్యములో వారడినది ఆట, పాడినది పాట, ప్రజానీకపు ధనప్రాణమానములు గడ్డిపోచలలాగ యెగిరిపోవుచున్నవి.

నేడు జిన్నా కాశ్మీరు పైకి పఠానులను దండయాత్ర పంపి కావలసిన సహాయాల నన్నింటినీ అర్పిస్తున్నాడు. ఇది అంతర్జాతీయ సమితి సూత్రానికి విరుద్ధ చర్య. అందులో ఇండియా పాకిస్థానులు రెండూ సభ్యదేశములు, ఈ నేరమునకు గాను ఇండియా పాకిస్థాన్ పై ఫిర్యాదు చేస్తే భద్రతా మండలి ఆ విషయమును అసలే చెవి పెట్టక, భారతదేశమును కూడా ఒక నేరస్థునిగానే భావించి తన తీర్పును దేనినో ఈ దేశముపై రుద్దచూచుచున్నది. ఇట్టిపక్షపాత చర్య అట్టి అంతస్థు గల సంస్థకు సిగ్గుచేటని కూడా అది భావించలేదు. సిగ్గులేని వానితో యే ధర్మదేశము సాగ గలదు? అయినా భారతదేశం ఒక చూపు చూచి తన ప్రతిష్ఠను నిలబెట్టుకోకపోతే దాని భవిష్యత్తు కంతటికీ యిప్పుడే ముప్పు మూడును. ఈ సందర్భమున కాశ్మీరు ప్రధాని చూపుచున్న ధీరత్వమెంతయు అభినందనీయమై యున్నది. భద్రతా మండలిపప్పునక్కడ ఉడకనీయనని అతను కంకణము కట్టుకున్నాడు.

ఇంక మిగిలినది హైదరాబాదు. అది తప్ప తక్కిన సంస్థానములన్నీ భారత యూనియనులో చేరి బాధ్యతాయుత ప్రభుత్వములను నెలకొల్పుకొన్నవి. కాని నైజాముకు అట్టి చర్య అవమానకరముగా కనిపించుచున్నది. ఆ సంస్థాన ప్రజలలో నూటికి 80 వంతులైన హిందువులకు అటు చేరకపోవడం అవమానకరముగా నున్నది. సంస్థాన కాంగ్రెస్సుకును అతనికిని ఇప్పుడు లడాయిగా నున్నది. ప్రస్తుతం మట్టుకు సైన్యాలు, ఉద్యోగస్థులు తన ప్రభుత్వాధీనములో నున్నవి కనుక ప్రజలనతను చావచంపి చెవులు మూయగలుగు చున్నాడు. లక్షలకొలది జనులు భారతయూనియను రాష్ట్రాలలోకి రక్షణ కొరకు పరుగిడుచున్నారు. సరిహద్దులలో ఉభయ బలాలకు పోరాటములు జరుగుచున్నవి. ఏ సమయమునన్నైన ఇది యుద్ధముగా పరిణమించవచ్చును.

భారత యూనియను గర్భములో హైదరాబాదిప్పుడు రాచకురుపుగా పరిణమించింది. పై పైని యథాతథపు ఒడంబడికలు, రాయబారములు,

ఉదారములనుకొనే ఫర్మానాలు మొదలైన కపట నాటకాలు, లోలోన ఆయుధ సేకరణలు, సైనిక కవాతులు, దోపిడులు, హత్యలు, శిక్షలు మొదలైన చర్యలు.

భారత యూనియన్ ప్రభుత్వమునకు ఓరిమి పట్ట గల దినములు గతించితిని. నైజాము చిత్తవృత్తి మారి, బాధ్యతను గుర్తించి నామమాత్ర పాలకుడైతే సరే లేకుంటే చర్యతీసుకోక తప్పదు. ఈ అంశమీనాటికి సుస్పష్టమైనట్లు కనిపించుచున్నది.

అసలు రహస్య మొకటి చూచుకోవలసియున్నది. పాకిస్థానును గాని నైజామునుగాని ఉభయులను గాని ఓడించడం భారత యూనియను కొక కష్టము కాదు. అయితే ఆ ఉభయులకు మన బ్రిటిషు జాతి వారు, ఐక్యరాజ్యసమితి వారు ఎట్టి సహాయము చేయుచున్నారో మన మెరుగుదుము. ఇంకా చేయగలరో మన మూహించుకోవచ్చును. మనము వీరి తిరుగుబాటుతో పాటు రహస్యముగాను బహిరంగముగాను వారికి అండాగావుంటున్న ఆంగ్లో - అమెరికను విమాన దాడులను ఫిరంగి గుండ్లను ఎదుర్కొనవలసి వచ్చునేమో!

అట్టి దొసగు రాకుండుటకే భారత యూనియన్ ఎంతో ఓర్పు వహించుచున్నది. కాని మనమెంత ఓర్చినా సరే, కాశ్మీరంలో వలె హైదరాబాదు విషయంలో కూడా వారు జోక్యం కలిపించుకొని మనను నేరస్థులుగా చేసి హైదరాబాదుకు దన్నగుటకు సిద్ధమవుతారు. హిందవులంటే ఈ దేశములోని యీ ముస్లిము వర్గములు మొదలు పశ్చిమ దేశములలోని ఆ ధనాఢ్యవర్గములవరకు అంతపగగా ఉన్నది. దానికి కారణము వారి వినిర్మల జాతీయతత్వమును, ధర్మదీక్షయే. భారత యూనియనే బలిష్ఠముగా ఉంటే, ప్రపంచంలో అరనిముషములో ధర్మరాజ్యమును స్థాపించవచ్చును. ధర్మరాజ్యములో తమ దురాశాత్వపు పప్పు ఉడకదు. కనుక దానిని మొగ్గలోనే త్రుంచి వేతామని వారు సంకల్పించుకొన్నారు.

అయితే నేడు భారతయూనియనుకు ఈ బహిశ్శత్రువు లేనా లేక అంతః శత్రువులు కూడా ఉన్నారా అన్న విషయము ఆలోచింప తగ్గది. బ్రిటిషు వారి ధర్మమంటూ నేడు హిందూ సంఘంలో స్వార్థపరత్వము పూర్తిగా పాదుకొని పోయింది. మిల్లు యజమానులకు జాతీయతత్వము పూజ్యము. తమకు

కావలసిన వస్తువుల నీదేశములో పండించి తయారు చేయించి పరదేశములకు అమ్మి లాభములు చేసుకోవడం, ఈ దేశమునకు కావలసిన వస్తువు టిక్కడ పండకుండా తయారుకాకుండా చూస్తూ పై దేశముల నుంచి తెప్పించి అమ్మి లాభములు చేసుకోవడం వారి ఏకైక లక్ష్యము. ఆంగ్లో అమెరికను ధనాఢ్యులు కోరేది కూడా అదే. కనుక వారికీ వారికీ వియ్యము. ఇంక ఈ వర్గములో జాతీయత యెట్లు వర్ధిల్లగలదు. ఆ మిల్లు యజమానులు, వర్తకులు తమ లాభాల మీద చెల్లించే పన్నులు సుంకములే ఈ దేశ ప్రభుత్వములకు భృతి, కనుక మన కేంద్రప్రభుత్వము, రాష్ట్ర ప్రభుత్వమును వారి చెప్పు చేతలలో మెలగుచున్నవి.

యెక్కడ చూచినా,చిత్తు కాగితాలకంటే అధికంగా వంద రూపాయల నోటులే. వస్తువుల ధరలు మిన్నంటినవి. కర్షక కార్మికాది వినియోజకులకు యెంత పెద్ద జీతాలు ఇచ్చినా వారికి చాలకున్నవి. వారు సమ్మెలకు దిగుచున్నారు. కమ్యూనిస్టులు వాటిని రేపుచున్నారు. ఉత్పత్తి నిలచి పోవుచున్నది. రేపేమి టవుతుందోయెవరికీ తెలియదు. ఇదంతా ఇప్పట్లో తెమలే సంగతి కాదన్న విశ్వాసం మంత్రులకు శాసన సభ్యులకు ఉద్యోగస్థులకు విశదమైనది. పదవులలోకి వచ్చిన వారందరూ యేవేవో పై పై లెక్కర్లిచ్చుచు దీపము ఉండగానే యిల్లు చక్కపెట్టుకుందామనే తత్వంలోకి పడ్డారు.

ఈ ధనాశాతత్వంలో దేశమంతా పడి ఒకరితో ఒకరు పోటీ చేసుకుంటూ, ఒకరి డొక్కమీద ఒకరు తన్నుకుంటూ, అనాథలందరూ అణగి, గడుసు వాళ్లంతా గర్విష్ఠులగుచున్నారు. ఇదే నేటి బ్రాహ్మణా బ్రాహ్మణ, నియోగివైదికీ, రెడ్డి కమ్మ, కాపు, మాలమాదిగాది కులతత్వ ద్వేషములకు మూలకారణమై యున్నది. ఈ కులతత్వ వాదులే నేడు ప్రభుత్వ పదవులలో విరాజిల్లుచున్నారు. అందువల్లనే వారు పదవులలోకి రాగలుగుచున్నారు. సంపూర్ణ జాతీయవాదులు పదవులనుంచి బహిష్కృతులైనారు. వారి బోధలు ప్రభువులకు గాని ప్రజలకుగాని చెవుల కెక్కవు. పైగా వారికే కులతత్వ వాదులని మచ్చ తగిలించారు.

మనదేశములో నేడు డెమోక్రసీ ఇట్టి అధోగతిలోనున్నది. ప్రతీ వ్యక్తియు ధన పిపాసను విసర్జిస్తేనే కాని జాతీయత యేర్పడదు జాతీయత యేర్పడితే కాని ఐకమత్యమే సిద్ధించదు. ఐకమత్యత సిద్ధిస్తేనే కాని వస్తూత్పత్తి హెచ్చడం, ధరలు తగ్గడం, కడుపు నిండడం, బలం పెరగడం, శత్రువులను జయించడం మొదలైనవి

సాధ్యము కావు.

ఇప్పుడు ప్రజలు దేశాన్ని పాలిస్తున్నారన్నమాట కపటము. ప్రజలను గిలుబాడి వోటులను తస్కరించి లాభాలు దేవుకొనే వేషాల రాయళ్ళు దేశాన్ని యేలుతున్నారు. వారిలో మచ్చుకైనా ఒక్క నిష్కల్మషమూర్తి కానరాడు. అట్టి వాడు అథవా వుండినా నోరుమూసుకొని ఊరుకోవలసినదే.

మననాయకుల వీరత్వమును మరిచిపోయారు. ధనవంతుల ప్రాపకానికై దేవురిస్తున్నారు. వారిని పదవులలో నుంచి తొలగించగల వీరుడొక్కడు కళ్ళపడితే చాలు ఆ బాలగోపాలము అతనికి చేతులెత్తి మ్రొక్కి ధనాఢ్యుల కపటనాటకముల నెల్ల ఒక్క నిముషములో దునుమాడునట్లు చేయగలరు.

అట్టి నాయకుడే ఈ కృత్రిమ ధనము యొక్క పరువు ప్రతిష్ఠల నూడపీక గల సమర్థుడు. ప్రజలలో వీరత్వమును, దేశాభిమానమును, శ్రమా శీలమును కళాభిరుచిని పుట్టించగల దక్షుడు.

గాంధీ యుగమునకు ముందు అట్టి నాయకులెందరో ఉండబట్టే మన దేశస్థుల కట్టి త్యాగము వీరసాహసము కార్యదీక్ష ఉదయించినవి. గాంధీయుగము క్రొత్తరికం కూడా అవి కొంత విలసిల్లినవి. కాని గాంధి అధికారము హెచ్చుచున్న కొద్దీ, కాంగ్రెస్సు కపట వేషధారుల కాటపట్టయి. శుష్కపటాటోపములో తప్ప జాతీయాభిమానము లెక్కడా కలికంలోని కానరాకుండా చేసి అత్యంత ధనాఢ్యుడు మొదలు కటిక దరిద్రుని వరకు, మహానాయకుడు మొదలు కర్షక కార్మికుని వరకు అందరిని ధనదాసులను చేసి, దేశం మాట మరువజేసి, నిర్వీర్యుల నొనరించి శుష్కాందోళనలకు గాక మరెందుకూ పనికిరాని వారినిగా చేసినది.

గాంధీకి పూర్వముండిన విప్లవ నాయకులు మనలను గాఢ నిద్రనుంచి చైతన్యములోకి మేలు కొలిపిరి. గాంధీజీ ఆ చైతన్యమును విస్తరింప చేసి కూడా దానిని పెడత్రోవలు పట్టకుండా చేయలేకపోయినాడు. దాని ఫలితములే మన నేటి కులతత్వ, భాషాతత్వ, రాష్ట్ర తత్వాది ద్వేషములను కొట్లాటలు. దాని ఫలితమే భారతదేశ విభజన, ధనాఢ్యుల ప్రతిభ, ధరల హెచ్చుదల, నరుల దురాశా పాతకత్వం, అల్పుల పదవీ వ్యామోహం, పదవులలోనున్న వారి స్వార్థపరతత్వం, స్తబ్ధత్వం, ఉత్తములను అథః పాతాళములోకి అణచడం మొదలైన దుర్గుణాలన్నీ.

మన ప్రభువులు మన నాయకులు ఇంత అపసవ్యంగా ఉంటున్నా మనకీ మాత్రమైనా నేడు అన్న వస్త్రములు పుట్టడం, ఈ మాత్రం మంది మైనా బ్రతకడం, కాశ్మీరంలో ఈ మాత్రం పదవియైనా కరువు దక్కడం జరుగుచున్నదంటే, మన హిందువులు చేసుకున్న యేదో పూర్వ జన్మ పుణ్యఫలము, ఋషుల ఆశీర్వచన ఫలము కాని మన నాయకుల ప్రయోజకత్వం కాదని లోకమెల్లయు ఘోషిల్లుచున్నది.

ధనాశా నిమగ్నమైన ఈ నాయకత్వమును మూడు తన్నులు తన్ని ఇప్పటి బ్యాంకులలోని కృత్రిమ క్యాషుబుక్కుల నన్నిటినీ సముద్రములోకి విసరి, కష్టపడకుండా లెక్కలు వ్రాసుకొనే వారిని కారడవుల పాలు చేస్తేనే గాని,నిజంగాకష్టపడేవాళ్ళు పుట్టరు. అప్పుడు డబ్బు కోసం కాక కష్టపడడం పనిచేయడం తమ ధర్మమనుకొని ప్రజలు కష్టపడతారు. అప్పుడే యెవరి కష్టమునకు తగిన ఫలము యెక్కువో తక్కువో వానికి దక్కింది దోచుకోగోరే వారినోట్లో కరక్కాయ పడుతుంది.

ఇది గాంధీమహాత్ముని సత్యాహింస శాంతి యథేచ్ఛా సిద్ధాంత పద్ధతుల వల్ల యుగ యుగాల నాటికైనా సాధ్యము కాదు. ఎవడో ఒక మహావీరుడు లేచి ఒక్క కలము పోటుతో దీనినంతటిని యెత్తివేసి సర్వసమానత్వమును నిలబెడితే, సంతోషించేవాళ్ళు కోట్లు అవుతారు, యేడిచేవాళ్ళు యేడుగురే మిగులుతారు. ధన ఉద్యోగాలు అనే యెర లేకుండా చదువుకొనేవాళ్ళు చదువుకొని దేశమునకు ప్రయోజనకారులవుతారు. అట్టి యెర లేకుండా కర్షక కార్మికులు తృప్తి తీరా కష్టపడి వస్తూత్పత్తి సాధకులవుతారు. అట్టి యెర కోసం కాకుండా ఉద్యోగ ధర్మం కోసం సమర్థులు పదవులలోకి వస్తారు, చక్కగా కార్యాలు నిర్వహిస్తారు. అట్టి యెర లేకుండా కళాభిరుచి గల వారు కావ్యాలు వ్రాసి చిత్రాలు చెక్కి భవనాలు యంత్రాలు నిర్మించి దేశములను దేదీప్యమానంగా చేస్తారు.

అప్పుడు చదువు,కృషి , ఉద్యోగం సమస్తం కూడా కళకే అవును. ఇట్టి కళలన్నీ, శిల్పులకు కూలి యివ్వడానికి లోకంలో డబ్బులేనప్పుడే బాగా వర్ధిల్లినవి. డబ్బు ప్రవేశించి కిట్టుబాటు లేని చదువులకు వృత్తులకు ఉద్యోగములకు లాంఛనములకు కళలకు పూజా పునస్కారములకు యోగ విద్యలకు స్వస్తి చెప్పి

అందరినీ తనకు బానిసలుగా మార్చుకొన్నది.

ఆ ధనానికంతటికీ పాశ్చాత్య దేశాలు అధిపతులైనవి. కనుక నేడు లోకమంతా వారికి ఊడిగము చేస్తున్నది. ఆ ధనము మీద ఉమ్మి, శ్రమను ఆరాధన చేసి సోవియట్టు రష్యా నేడు వాటికంటే పటిష్ఠమై దేదీప్యమానమై రాణిస్తున్నది. ఆమోస్తరు కమ్యూనిజమునే లోకములో నంతటా పెడదామని రష్యా ప్రయత్నించుచు కమింఫార్మ్లను ఆర్గనైజు చేస్తున్నది.

కాని ఒక్కొక్క దేశానికి ఒకొక్క మోస్తరు కమ్యూనిజము అనువై వుంటుంది. మన జాతీయ సంప్రదాయమైన కమ్యూనిజము మన దేశములో అనాది సిద్ధముగా వచ్చుచున్నది. దానికి ప్రతిబంధకము ఈ పాశ్యాత్య ధనపిపాస ప్రభుత్వాల మూలముగానే కలిగినది. దానిని తొలగించగల వీరనాయకుడు మనకు కావలెను.

భారతదేశమిట్టి ఉత్తమ తరగతిని కమ్యూనిజమును నెలకొల్పి, ధనమును కొన ఊపిరితో మాత్రము అత్యావశ్యక మైన మేరకే ఇచ్చట నిలువ నిచ్చి, ఉత్తమ వ్యవస్థలు లేవకుండుట కది కారణం కాకుండునట్లు చూడవలెను.

"మాతాపుత్ర విరోధాయ హిరణ్యాయనమోనమః" అన్నట్లు ధన మొక్కటి లేకపోగానే యెన్ని జాతులు యెన్ని మతములు ఎన్ని ఆచార వ్యవహార భేదములున్నా విరోధాలు మరి ఉండవు. ఒక తోటలో యెన్ని రకముల పూల మొక్కలుండవు? గులాబి మొక్కలు సంపెంగి మొక్కలు పోరాడుకొనుచున్నవా? మల్లిపూవులు జాజి పూవులు సరసాలాడుకోలేదా? అట్లే సమస్త జాతులును సామరస్యముతో వర్ధిల్లగలవు.

*ఢంకా, 1948 జూన్.*

# ఆంధ్రరాష్ట్రమునకు ఆలస్యమేల?

## (ఆలస్యమువలన కలుగు మహానర్థములు సత్వర కార్యనిర్వాహణావశ్యకత)

ఆంధ్రు లారంభశూరులన్నమాట ఆధునిక కాలములో అనుశ్రుతమైపోయినది. దేశోద్ధారకుని పత్రికా సంస్థలు, పట్టాభిగారి బందరుసంస్థలు, ఉన్నవ వారి శారదానికేతనము మొదలగు కొన్ని మాత్రము ఈ సూత్రమునకు కొస్త వ్యతిరేకములై నేటివరకును నిలిచి యున్నవి. తగిన కట్టుదిట్టములు చేస్తే చిరస్థాయులే కాగలవు. ఇంక రాజమహేంద్రవరం పేపరుమిల్లుకు పాపరు చీటీ వచ్చినది. చెన్నపురి స్వరాజ్య పత్రికకు కన్నం పడిపోయినది. ఎన్నెన్నో పారిశ్రామిక సంస్థలను యెన్నెమ్మ కొట్టి వేసినది. క్రొత్త క్రొత్తగా ఊహింపబడుచున్న సినీమాకంపెనీలు రిత్త ప్రకటనలగుచున్నవి. దేశీయ విద్యాప్రయత్నములు తేజోహీనము లగుచున్నవి. కొన్ని కొన్ని ఖద్దరుసంస్థలు కూడ కల్తీలపాలగుచున్నవి.

ఇందుకు కారణము లేకపోలేదు. ఏ సంకల్పము నైనను ప్రారంభించే నాడుండే విజృంభణము ఆ మర్నాడు ఆంధ్రుల కుండదు. ఆరంభములు అత్యంతమగు అట్టహాసముతో జరుగును. ఆ సంస్థలకు ఆరంభకులుగా, ఉపన్యాసకులుగా, అధ్యక్షులుగా, కార్యదర్శులుగా, కోశాధ్యక్షులుగా, భాగస్వాములుగా చేరేవారి సంఖ్యకు మితియుండదు. ఎవరిని చేర్చుకొనకున్న యేమి ముప్పువచ్చునో అన్నంత ఉప్పెనగా ప్రతీదీ మొట్టమొదట ఉండును. ఇట్టి శుభోదయముతో ప్రారంభమైన సంస్థకు అడ్డు యేదైనను రాగలదా అన్నంత ఉత్సాహము మొదటి కొన్నాళ్ళదాకా ఆంధ్రుల నందరినీ ఉఱ్ఱూత లూగించుచుండును. ప్రోస్పెక్టసు అచ్చుపడగానేనో, పేరులు ప్రకటింపబడగానేనో ఆ ఉద్రేకము కొంచెము తగ్గును. కార్యోపక్రమణ మనేటప్పటికి కలతలు ప్రవేశించును. అక్కడనుంచి కార్యదర్శుల పాట్లు చెప్పనక్కరలేదు. సభ అనేనాటికి కోరముకూడుటయే కష్టము. కూడితే ఒక నిర్ణయమునకు రావడము కష్టము. దీనితో ఒకరిద్దరు వెనుకతగ్గి బిగి తగ్గించివేతురు. ఇతరులు వీరి ననుసరించి విరమింప బ్రయత్నము చేయుచుందురు. అటు తరువాత

వైండింగులప్పు కడు సులభముగ నెరవేరిపోవును. కొందరికి కొంత నష్టముతో వివేక ముదయించి, వచ్చే ప్రయత్నాలలో అడుగుపెట్టుట మానుకొందురు.

ఇతర రాష్ట్రములు, అనగా బెంగాల్, గుజరాతు, పంజాబు, బొంబాయిలలో అనేక జాయింటు స్టాకు కంపెనీలు, మిల్లులు, భీమా కంపెనీలు, ఫిల్ము చిత్రములు, బ్యాంకులు మొదలయినవి లేచి దినదిన ప్రవర్ధమానము లగుచుండగా మన ఆంధ్ర రాష్ట్రములో అవి చాలా అరుదుగా ఉన్నవి. ప్రతీరాష్ట్రపు విదేశపు కంపెనీవారున్నూ మన ఆంధ్ర రాష్ట్రమును పలు విధముల దోచుకొనుచుండగా, మన శ్రమను ద్రవ్యమును మనము వారికి ధారపోయుచున్నాము. ఇతర రాష్ట్రములలోని యెట్టి డిగ్రీలును లేని యువకులు నెలకు వందలు వేలు జీతములు లాగుచుండగా మనము పెద్ద చదువులకై ఆస్తులు తగులబెట్టుకొని నిరుద్యోగులమై మలమల మాడిపోవుచున్నాము. మనకు మూలధనమునకు కొదవా, ధీచాతుర్యమునకు కొరతా, కార్యనిర్వహణశక్తి తక్కువా, యోగ్య వర్తనకు లోపమా? కార్యంపట్ల ఐకమత్యము శూన్యముగ ఉండుటొక్కటే దీనికి కారణమనవలెను. ఈ కారణము వల్లనే ఏకైక వ్యక్తి మాత్రస్థాపితములగు సంస్థ లేవియో కాస్త బాగున్నవి. తక్కినవి కృశించినవి.

## సంఘీభావము అవశ్యము

ఇది కలియుగము, ధనయుగము, వాణిజ్య యుగము. పదిమంది కలిస్తేనే కాని ప్రసిద్ధమైన ప్రయత్నము లేమీ కొనసాగవు. పదిమంది మాట ఒక్కటైతేనే యే సంస్థ అయినా బాగా వర్ధిల్లుతుంది కాని, లేకుంటే అత్యంతోన్నత స్థానమునకు రాజాలదు. ఈ యుగములో అత్యంతోన్నతమైన సంస్థలు మాత్రమే ధక్కామక్కీలకు ఆగి కొంత కాలమువరకు నిలుచును కాని, సాధారణ సంస్థలు చితికిపోకతప్పదు. పదిమందితో కలసి పనిచేసే శక్తి ఆంధ్రులకు తక్కువనుకోవాలి. ఎవరి క్రిందనో చాకిరీయైనా చేస్తారు కాని తమ సంఘముతో సమరసంగా వర్తింపలేరు. ఎవరి పట్టు నెగ్గాలని వారికే ఉబలాటం. పదిమంది పదితోవల లాగుతే అసలు పనే చెడిపోతుందనేనా వారికి దృష్టి వుండదు. ఎవరికీ మురీత్రోపు యెక్కువగా ఉంటే వారు కొంతవరకే పైచెయ్యి కలిగి ఉండగలరు గాని, కలకాలం ఆ స్థితిలో వారు

ఉండలేరు. అటువంటి నిర్వ్యక్తిస్థితికి అతనొక పార్టీ బయలుదేరతీస్తే వెంటనే మరోపార్టీ బయలుదేరుతుంది. ఎవరి పార్టీ బలం కోసం వారు యెటువంటి పనులనైనా చేయుటకు సంకోచింపరు. మన గ్రామ పంచాయతీ సంస్థలు, నగర పరిపాలన సంస్థలు, కాంగ్రెసు సంస్థలు, శాసన సభా సంస్థలు, ఇదీ అదీ అనడమెందుకు- అన్ని సంస్థలలోనూ నేడు ఇటువంటి పార్టీలే ఉంటున్నవి. అవన్నీ పైనున్న కొన్ని ఉత్తరోత్తరాధికార సంస్థల క్రింద ఉంటున్నవి కనుక యేలాగో ఒకలాగ యీడ్చుకొని వస్తున్నవి; తక్కినవి వేగం వేగం తెగిపోతున్నవి.

ఈలాగైతే యేజాతియైనా యెప్పటికి అభివృద్ధికి రాగలదు? ఆంధ్రులు వెనుకబడుతున్నారు, ఆంధ్ర భాష పేలవమగుచున్నది, ఆంధ్ర సరపద హరించుచున్నది, ఆంధ్ర విజ్ఞానము కళలు ఆరిపోవుచున్నవి, ఆంధ్రులు నిరుద్యోగులగుచున్నారు, ఆంధ్ర రాష్ట్ర సమస్య ఆలస్యమగుచున్నది అని పట్టి పట్టి ఆందోళనలు చేస్తే యేమి లాభము? ఆంధ్రులు మొట్టమొదట తమలో ఐకమత్యమును సాధించుకోవాలి. అప్పుడే క్రిందనున్న పల్లెటూరు బడి మొదలు పైనున్న ఆంధ్ర రాష్ట్రముదాకా అన్ని సమస్యలు ఏక ముహూర్తమున సులభముగా పరిష్కారము కాగలవు. అట్లుకాక ఈ అనేకత్వం ఉన్నన్నాళ్లు మనము ఈ యీడు పోతలన్నీ పడవలసినదే. ఆంధ్రులకు మొట్టమొదట కలుగవలసినది ఈ ఆంధ్ర చైతన్యం. ఈ చైతన్యం లేకుండా వారికి వర్గ చైతన్యం, కులచైతన్యం, మత చైతన్యం, జిల్లా చైతన్యం, గ్రామ చైతన్యం, వ్యక్తి చైతన్యం కలుగుట వలన వారు మరింత పరస్పర కలహములకే పాత్రులై అసలు చైతన్యమునే కోలుపోవుదురు కాని నిజమైన జాతీయాభివృద్ధిని పొందజాలరు.

మనకు కావలసినది జాతీయచైతన్యము కాని, ఈ ఆంధ్ర రాష్ట్రీయ చైతన్య మెందుకని ఆక్షేపించేవారు కొందరు లేకపోలేదు. ఈమాట నిజమే కావచ్చును కాని ప్రతి రాష్ట్రమువారును తమ తమ చైతన్యములను ఆ రీతి నుద్దీపింపజేసుకొని సత్వరాభివృద్ధికి వచ్చి భారతజాతీయ చైతన్యమునకు తగిన రీతిని దోహదము చేయుచుండగా ఆంధ్రులదెసమాత్రం వ్రేలుపెట్టి దీని నొక నేరముగా చూపుట పాడికాదు. ఇట్టి చైతన్య ముదయించినంత మాత్రమున ఇతరులపై అసూయ కలుగునని మన మనుకొనరాదు. వారి

ప్రతిభను ప్రశంసించు ద్వారానే మనకిట్టి చైతన్యజ్ఞానము కలుగవలెను. మన రాష్ట్ర విషయములయందు మన కెట్టి గౌరవాభిమానము లుండునో, అట్టివే ఇతర రాష్ట్ర విషయములందును, అఖిల భారత విషయములందును ఉండుటకు వీలులేదా? భాషా ప్రయుక్త రాష్ట్ర సమస్య కిట్టి వ్యాఖ్యానము నెవరును ఎన్నడును చేయలేదే. తిలకు మహాశయుడే దీని నంగీకరించెను. జవహరులాలే ఆమోదించుచున్నాడు. ప్రతినాయకుడును దీనిని ప్రశంసించుచునే యున్నాడు. నిజముగా రాష్ట్రము లుండవలసిన పద్ధతియే అది. అంతేకాని బ్రిటిషు ప్రభుత్వ రాష్ట్ర విభజన పద్ధతి ఒక పద్ధతియే కాదు. వీలయినంతవరకు దానిని సవరించవలసినదే! దీని కాటంకము చెప్పుటలో వివేకము లేదు.

## రాష్ట్ర సమస్య

ఇట్టి రాష్ట్రమే మనకు తొలి నుండియు ప్రత్యేకముగ ఉండిన యెడల మన సమస్యలును సంస్థలును స్థితిగతులును నేడింత వెనుకబడి యుండవు. మన సమస్యను దేనిని పరిష్కరించుటకును నేడు మనము కర్తలము కాకున్నాము. విద్యాసమస్య, పరిశ్రమల సమస్య, ఆర్థిక సమస్య, వ్యవసాయ సమస్య, నీటి పారుదల సమస్య, వాణిజ్య సమస్య యే సమస్య పరిష్కారము కావలెనన్నను మనకు పై అనుమతి ఒకటి కావలసియున్నది. ఆ పై అనుమతినిచ్చునది ఒక కలగాపులగం సంస్థయై యున్నది. అదియే మద్రాసు ప్రభుత్వము. ఆ ప్రభుత్వమునకు అందరితో వలె మనమును కప్పములు కట్టుచున్నాము; విధేయతలు సలుపుచున్నాము; అభివృద్ధిని కల్పించుచున్నాము; కాని మన విషయమైన ప్రశ్న యేదైనా వచ్చినపుడు మన అందరి మాటా చెల్లుటకు వీలుకాకున్నది. ఆ ప్రభుత్వము తన అనుకూలము ప్రకారము ఈ ప్రశ్నకు సమాధానము చెప్పును కాని, మన అనుకూలము ప్రకారము మనకును, ఇతరుల అనుకూలము ప్రకారము వారికిని పరిష్కారమిచ్చే ఔదార్యము గలది కాకున్నది. కనుకనే భాషాప్రయుక్త రీతిని మనము నలుగురమును వేరువేరుగ నున్నచో అందరి సమస్యలును యథానుకూలముగా పరిష్కరించుకొనవచ్చుననియే మన సంకల్పము. ఎవరు కాని దీనికి ఎందుకు అడ్డము చెప్పవలెనో అర్థం కాకున్నది. ఇతరులను

మించి కూడా మనలో మనమే స్పర్ధలు పడి దీనికెందుకు ప్రాతికూల్యమును ప్రకటించవలెనో మరీ అర్థం కాకున్నది.

## అర్థములేని ఆక్షేపణలు

ఆంధ్ర రాష్ట్ర సమస్య కంటె మద్రాసు ప్రభుత్వ సమస్య చాలా ప్రధానమైనదియు, ఈ నూతన ప్రభుత్వ ప్రారంభావస్థలో దీనిని పైకి యెత్తితే ఆ ప్రధాన సమస్యకు ఆటంకము వచ్చుననియు మనకు కొన్ని హితబోధలు కూడా వినబడుచున్నవి. ఈ రాష్ట్రీయ, రాజధానీయ, అఖిల భారత జాతీయ సమస్యలలో ఒక దానికి ప్రాధాన్యమును, ఇంకొక దానికి ప్రాధాన్యమును కాని, ఒక దానికి ప్రథమప్రాధాన్యమును, ఇంకొక దానికి ద్వితీయ లేక తృతీయ ప్రాధాన్యమును కాని యిచ్చుటకు వీలులేదు. అన్నిటికిని సమాన ప్రాధాన్యము నిచ్చినపుడే నవ్యమగు పరిష్కారము చిక్కగలదు కాని, ఇటువంటి భేద దృష్టి వలన లాభము చిక్కబోదు.ఈ భేదదృష్టి కేవలము కాలయాపనకు నెపమును, వేరు భావములకు ఆకరమును అగుచున్న దనుటకు సందేహం లేదు. ఇట్టి దృష్టి వల్లనే జస్టిసు, ఇండిపెండెంటు మంత్రివర్గములు ఈ సమస్యను దిగద్రొక్కి యథారీతిని కాలక్షేపము చేసుకొనగలిగినవి. కాంగ్రెసు మంత్రివర్గమునకు, అందులో ముఖ్యముగ మన ఆంధ్ర శాఖకు కూడా ఇటువంటి దృష్టి లేదని మనము అనుకోవలెను. కాలయాపనమున కగు నెపములను విడచి కార్యకరణమునకు దిగునప్పుడే యే మంత్రివర్గమైనను రాణించగలదు. క్రొత్త పంథాలకు దిగుటకై సంకోచించుచు తమకు చేజిక్కిన పదవుల నేవో యొకరీతిని నిలబెట్టుకొనుటకై తంటాలు పడుచుండుటవలననే గదా జస్టిసు ప్రభుత్వము నిర్వీర్యమై అఖాతములో మునిగిపోయినది! అట్టి రాజనీతిని తిరస్కరించియే కదా కాంగ్రెసు మంత్రివర్గము ఎన్నియో నూతన సంస్కరణములకు గడంగుచున్నది! వీనిలో యే సంస్కరణముకన్న ఈ సంస్కరణము తక్కువ ప్రధానమైనది? దీనికి కలిగే ఆటంకము లేమి?

ప్రారంభించిన నూతన సంస్కరణములకే చాలా సొమ్ము వ్యయమగు చుండగా, వానికి ఈ సంస్కరణమును కూడా చేర్చి ఆ వ్యయ భారమును మరింత యెక్కువ చేయవలె నెందుకని కొందరు మహాశయులు ప్రశ్నించి

మన ఆశయమును త్రోసిరాజు చేయుచున్నారు. రాష్ట్రములన్నీ కలిసి వుంటేనే దక్షిణ ఇండియా, లేక మదరాసు రాజధానీ ప్రభుత్వ మంతయు స్వయం సమర్థకముగా ఉండును కాని వానిని వేరుపరచుచో ప్రతిరాష్ట్రమును స్వయం సమర్థము కాక చేతిసొమ్ము తగులుకొనునని కొందరు వాదించుచున్నారు. ఇది కొన్ని భాగముల పట్ల నిజమగునేమో కాని ఆంధ్ర రాష్ట్ర సమస్య నాలోచించి నంతమేరకు సత్యము కాదని రూఢిగా చెప్పవచ్చును. సింధు, ఒరిస్సా, సరిహద్దు రాష్ట్రముల వలె గాక స్వయం సమర్థక మైనదని లెక్కలు స్పష్టపరచుచునే యున్నవిగదా? ఏ చిన్న భూభాగమో, ఏ అల్పసంఖ్యాకజనులో, వీరికొరకై ప్రత్యేకత యెందుకనువాదమిక్కడ పొసగదు గదా! మూడు కోట్లను మించిన జన సంఖ్యయు, ౧౮ మండలములును గల ఆంధ్రావనిపైని ఈ నేరమును మోపతగదు గదా ఇట్లు వేరు చేయుట వలన ఇతర భాగములకైనను విశేషనష్టము కలుగదు సరేగదా న్యాయమైన లాభములేవియో జరుగుచునే ఉండును. ఏది యెట్లున్నను నాలుగు భాషలును బ్రిటిషు ఇండియాలో సగము భూభాగమును గల దక్షిణ ఇండియా నంతటిని ఒకే రాష్ట్ర ప్రభుత్వములో కుక్కి ఈ విధానము నిప్పటివలెనే కొనసాగించవలెనని సలహా యిచ్చుటలో అర్థము లేదు. ఈ నాలుగింటిలోను అధికతర జనసంఖ్యయు, జిల్లాలును గల ఆంధ్ర భాగమునైనను ముందుగా విడదీసి వారి పరిపాలనమును వారికొప్పగించుట ప్రప్రథమ కర్తవ్యము.

ఈ పని యింతకుముందెన్నో సంవత్సరముల క్రిందటనే జరుగవలసి యుండెను. ఈ ఆందోళన ప్రారంభమై ఇరవై సంవత్సరములు దాటినది. దీనికి య్యేడు వెనకల ప్రారంభమైన ఆందోళనలెన్నో కార్యరూపమును దాల్చినవి. జస్టీసు పార్టీవారి అసడ్డయు, కాంగ్రెసు పార్టీవారి అన్యకార్య నిమగ్నతయే దీని నిన్నేళ్లు ఆలస్యము చేసినవి. ఈ కాలములోనే మన భేదములను విస్తరింపజేయుటకును, పరస్పర స్పర్థలు పుట్టించుటకును అనేక ప్రయత్నములు జరిగినవి. అయినను ఆంధ్ర రాష్ట్ర నిర్మాణము దైవ నిర్ణయము. ఇట్టి పరస్పర స్పర్థలు చిరకాలము నిలువజాలవు. సవ్యతరమగు ఆందోళన సకల భాగములయందును ఏక ముహూర్తమున ప్రారంభమైనది. ఈ బీజమును మొట్టమొదట నాటిన శ్రీ పట్టాభి సీతారామయ్యగారు తిరిగి అనుపమానమైన ఆందోదళనమును లేవనెత్తి దీనిని సాధించుటకై కంకణము

కట్టుకొనియున్నారు. సందేహములు స్పర్ధలు పటాపంచలగుచున్నవి. ఇది కేవలము ప్రాంతీయ సమస్యగా కాక అఖిల భారతసమస్యగా కూడ పరిణమించినది. అఖిల భారత కాంగ్రెసు కమిటీ నుండియే మద్రాసు ప్రభుత్వమునకు హుకుము రానున్నది. విజయము చేరువగుచున్నది. కనుక నాయకులును ప్రచారకులును కూడ చిలిపి సందేహములను మాని కార్యక్రమమునకై గడంగుట శ్రేయము.

"ఆంధ్రులలో ఐకమత్యము లేదు. ఒక ప్రాంతము వారు రాష్ట్రము కావాలంటే ఇంకొక ప్రాంతము వారు వద్దంటున్నారు. ఒక పార్టీకి ఇంకొక పార్టీకి పొసగకుండా ఉన్నది. ఇవన్నీ సర్దుకుంటే కాని ఆంధ్ర రాష్ట్ర సమస్య నాలోచించుటకు వీలులే"దని కొందరాంధ్రేతరులు ఇప్పుడిప్పుడుకూడ వాక్రుచ్చుచున్నారు. ప్రత్యేక రాష్ట్రమేర్పడేవరకును ఇట్టి భేదములను రేపుటకును వర్ధిల్లుటకును అవకాశము లుంటునే ఉండును. వీనికన్నిటికిని స్వస్తి చెప్పవలెనను సంకల్పముంటే ఆంధ్ర రాష్ట్రమును వెంటనే విభజింపక తప్పదు.ఆ మరునాటి నుండియు ఇట్టికాల్పనిక భేదములన్నియు నశించి ఐకమత్య ధర్మము తనంతట తానే వర్ధిల్లగలదు.

ప్రత్యేక రాష్ట్రమైతే రాయలసీమ వారికో, ఉత్తరసీమలవారికో కొన్ని ఇబ్బందులుండునని కొందరు వాదింతురు. విశాలదృష్టితో చూచినయెడల నవి యెవ్వియును ఇబ్బందులుకావు. ఒక వేళ అయినను, ఈ జిల్లాలనన్నిటిని ఒక కాంపోజిట్టు రాష్ట్రములో కుక్కుటవలన కలిగే ఇబ్బందుల కంటె యెక్కువ కావు. ప్రస్తుతము అవి యిబ్బందులవలె కొందర కగుపడినను ప్రత్యేక రాష్ట్ర మేర్పడగానే వానినన్నిటిని సవరించుకొని సమ్యగ్భావముతో వర్తించగలనేర్పు సిద్ధించక మానదు. ఒక కాంపోజిటు రాష్ట్రములోనే ఎన్నో యిబ్బందులు పొందుచు కాలక్షేపము చేయువారు ప్రత్యేక రాష్ట్రములో కలతలుపడుతారన్నది వ్యర్థమగుమాట.

## భేదములు నిజమైనవి కావు

ఇంతకును ఆంధ్రులేయే ప్రాంతముల నెట్టియెట్టి ఆచార వ్యవహారాదు లతో నున్నను ఆంధ్రులే. వారిది యేకభాష, యేకభావములు. వారి

లాభములును నష్టములు సర్వసమానములు. ఒకరి నష్టము నొకరి లాభముగాను, ఒకరి లాభమును తమ నష్టముగాను భావించు కొందురని అనుకొనుటకు వీలులేదు. కొన్ని కొన్ని మండల సమస్యలు ప్రత్యేకములగునుగాక, ఇప్పుడు మాత్రము కాకున్నదా? సమిష్టి ఆంధ్ర సమస్యలు వేనవేలున్నవే? వాని పోషణమునకై సంకుచితలాభ భావములకు వారు త్యాగము చేసుకొనలేరా? గాంధీ మహాత్ముని అసహాయ యోగమునందు వారు ప్రదర్శించిన మహాత్యాగములలో ఇది యెన్నవవంతు? ఇంతకును, ఒక అవయవము కొరకై శరీరమునందలి ఇంకొక యవయవము పడే శ్రమ త్యాగ మనిపించుకొనదు; ప్రధాన కర్తవ్యమే. అట్లే "రాయలసీమ" కొరకు సర్కారులో, "సర్కారుల" కొరకు రాయలసీమయో యేదేనా శ్రమపడవలసి వస్తే అది త్యాగమనిపించుకొనదు. సకలాంధ్రుల శ్రేయస్సే ప్రతి ఆంధ్రుని శ్రేయస్సున్ను. ఏ యొక్క వ్యక్తి అశ్రేయస్సును కూడ ఆంధ్ర రాష్ట్రము తనదంతటిదిగానే భావించి దానిని మాయము చేయుటకై ప్రయత్నించును. అందుకనే గదా మనము ప్రత్యేకాంధ్ర రాష్ట్రమునకై ఆందోళన ప్రారంభించినాము! ఈ ప్రత్యేకాంధ్ర రాష్ట్ర-ఆందోళనను వ్యతిరేకించి సమిష్టి రాష్ట్ర సంతృప్తితో కాలక్షేపము చేయుచున్న యెడల, ప్రత్యేక భాగములకు కలిగే విశేషపుష్టి యేమియును లేకుండును సరేకదా, సమాన నష్టములు కూడ అపరిమితముగ నున్నవి. కనుక వ్యతిరేక భావముల కింతతో స్వస్తి చెప్పవలెను.

ఇంతకును ఆంధ్ర మండలములను, రెండు ఖండములుగా విభజించుట యెట్లు? దత్తమండలము లొక ఖండమును, సర్కారు లొక ఖండమును, తక్కిన భాగములొక ఖండమునా? వీనిలో గల ప్రబల భేదము లేవి? వీరందరిదీ ఒక భాష కాదా, కులములు నాడులు మొదలగువానిలో భేదములు కలవా? ఆచార వ్యవహారములలో భేదములు కలవా? వీనిమధ్య కొండలు సముద్రములు నిలచి అంతరాయములు కలిగించుచున్నవా, రాకపోకలకు సులభోపాయములు తక్కువా? దేనిని బట్టి ఖండ ప్రభేదము? చారిత్రకముగా నైనను ఇవి వేరువేరు భాగములా? ఎన్ని ఆంధ్ర ఆంధ్రేతర సామ్రాజ్యముల క్రింద ఇవన్నియు కలసి యుండలేదు. ఎంతమంది ఆంధ్ర కవి, పండిత సచివోత్తములు వీనితో సమాన గౌరవముతో సంచరించుచు ఆంధ్ర విజ్ఞానమును, కళలను పోషించుచుండలేదు? ఎన్ని సందర్భములలో వీరందును

కత్తికట్టి సమాన శత్రువులతో పోరాడి విజయధ్వజములను ప్రతిష్ఠించ లేదు? ప్రతాపరుద్రునికన్న గౌరవ మొక్క ఓరుగల్లు ప్రాంతమువారిదేనా? శ్రీనాథుని పెంచిన కీర్తి ఒక్క నెల్లూరు మండలముదేనా? పెద్దనాదులను, శ్రీకృష్ణదేవ రాయలను వర్ధిల్లజేసిన తేజము ఒక్క రాయలసీమవారి దేనా? పంచమవేదమగు ఆంధ్ర మహాభారతకృతిని ప్రారంభించిన యశశ్చంద్రిక నొక్క రాజమహేంద్ర వరమే గుత్తకొన్నదా? వీరిలో నెవ్వరి పేరు దలచుకొన్నను ఆంధ్రులకందరకును పులకాంకురములు పొడమకుండునా? రాయల పరిపాలనము కేవల ఛత్తమండలములతో ముగిసినదా? దక్షిణ దేశమునందంతటను అతని ధాటి వెలయలేదా, కటకమువరకును అతని పరాక్రమము ప్రసరించలేదా? ఇంటింటను ప్రతీ కవీశ్వరుని గ్రంథములును పఠించబడుచున్నవే, గోడగోడయందును ప్రతీవీరుని చిత్రపటమును తగిలించబడుచున్నదే, జిహ్వ జిహ్వయందును వారిపద్యములు చరిత్రములు సంచరించుచున్నవే? వీనిలో దేనిని ఏ యాంధ్రుడు నాదికాదనగలడు, లేక నాదిమాత్రమే అనగలడు? ఈ భేదములీనాటికైనను పటాపంచలు కావలదా?

ఆంధ్రులందరును ఇట్టి స్వల్ప భేదములను మాని యేక చైతన్యముతో విజృంభించగలిగిననాడే వారి ప్రజ్ఞ దేదీప్యమానము కాగలదు. ఆనాడే ప్రారంభ పయోజన విద్యలు సత్వరముగా వ్యాపించగలవు; మండల రాష్ట్రీయ పరిపాలనములు చక్కగా వర్ధిల్లగలవు; వ్యవసాయ వాణిజ్య పరిశ్రమలు సవ్యముగా విజృంభించగలవు; శ్రీ సౌభాగ్యములు చెలరేగగలవు; భాషాయోషామణి "శిరీషకుసుమ పేశల సుధామయోక్తుల" చిందగలదు; కావ్య నాటకాలంకారములు కమనీయములు కాగలవు; స్వల్ప భేదములెల్లయు తొలగి సామనస్యము చెలగగలదు; అఖిల భారత జాతీయాభివృద్ధికి కూడ మన మిప్పటి కంటె చక్కని దోహదమొసంగగల్గుదుము. ఈ లోపల మన లోపముల నెన్నిసార్లు మనము లెక్కపెట్టుకున్నను లాభము లేదు. అవి యెల్లయు తొలంగగల తరుణౌషధ మొక్కటియే. అదియే స్వరాష్ట్ర సంసిద్ధి. అందుకే మన ప్రయత్నముల నేకముఖము చేయవలసిన ఆవశ్యకత.

## ఫెడరేషనుకు ఈ సమస్యకు సంబంధము లేదు

మరియు నొక్కమాట. ఫెడరేషను వస్తే కాని ఇది సిద్ధించనేరదనుమాట

మనము అనుకోకూడదు. ఫెడరేషను రాకపోయినను ఇది సిద్ధింపగలదని ధ్రువమైనది. ఆ విషయమంతయు ఇక్కడ తలపెట్టుట చర్విత చర్వణము. మనమనుకొనేరీతి ఫెడరేషను వచ్చుటకు చాలా కాలము పట్టవచ్చును. బ్రిటిషువారు ఇస్తామంటున్న మోస్తరు ఫెడరేషను మాకు వద్దని కాంగ్రెస్సే ఆటంకములు చెప్పుచున్నది. యుక్తమైన ఫెడరేషను వచ్చుటకు ఆంధ్ర రాష్ట్ర నిర్మాణము అడ్డు కానేరదు. మనమనుకొనే రీతి ఫెడరేషను వచ్చునుగాక, రాకుండును గాక, మన రాష్ట్ర నిర్మాణ ప్రయత్నమునుండి మనము విరమించుటకు వీలులేదు. ఆంధ్రదేశ మంతయు ఏకకంఠముతో ఇందుకై మాఱుమ్రోగవలెను. మద్రాసు శాసన సభలలో ఈ తీర్మానము సత్వరముగా ప్యాసు కావలెను. సెంట్రలు సభలలో ఇది ఆమోదింపబడవలెను. బ్రిటిషు పార్లమెంటు ఇట్టి కోర్కెకు అడ్డు చెప్పజాలదు. అడ్డుచెప్పితే అప్పుడే ఆక్షేపించి పోరాడవచ్చును. కొందరూహించుచున్న ఆటంకములు ఊహలు మాత్రమే కాని సత్యము కావు. తీవ్రప్రయత్న మాత్రమున ఇది సులభ సాధ్యము. ఇటువంటి తరుణముల నిదివరలో నెన్నింటినో కోలుపోతిమి. ఇదియే ఆఖరు ప్రయత్నముగా నమ్మి మనము పట్టువిడువకుండా పోరాడవలెను. ఈ సమయమును కూడ వృథా పుచ్చితిమేని ఫెడరేషను వచ్చిన తరువాతనైనను ఇది సిద్ధించుననుట కేమి నిశ్చయము? మన వ్యతిరేకపక్షము వారు ఇప్పటికంటె వేఱు వ్యతిరేక కారణములను అధికముగా అక్కాలమున గుత్తళముగా గ్రుచ్చి యేకరువు పెట్టుదురు. కాలము తిరిగిన కొద్దీ జాలము తప్ప మరే క్రొత్త విశేషమును రాబోదు. మన దృష్టిని ఈ సమస్యనుండి తప్పించి, మన ఆశయమును వీటి బుచ్చుటకై అనేక ప్రయత్నములు జరుగుచున్నవి. వీనిని మొదటిలోనే మనము త్రుంచివేయకున్న ఎడల రానురాను ఇవి మరింత ప్రబలమగును.

*– భారతి, డిసెంబర్, 1937*

# కొన్ని బహుభాషాప్రయుక్త రాష్ట్రాల అత్యావశ్యకత

ప్రస్తుతం కొన్ని ప్రాంతముల ప్రజల ధోరణులు చూస్తే భాషాప్రయుక్త రాష్ట్రాలు భారతీయ సంస్కృతికి ద్రోహదములవుతాయా, ద్రోహదము లవుతాయా అన్న సందేహం కలుగుతుంది. ఒక భాషవానికి ఇంకొక భాషన్నా ఆ భాష మాట్లాడే వ్యక్తి అన్నా ఆ వ్యక్తి శ్రేయస్సన్నా పరమకంటకంలాగా కనిపించే స్థితి వచ్చింది. ఇది కేవలం ప్రజలలో గల లోపమేయైతే ప్రభుత్వం సంస్కరించవచ్చును. కాని ఆ ప్రాంతాల ప్రభుత్వాలకే ఇట్టి సంకటము తగులు కున్నట్లు కనిపించుచున్నది. ఇట్టి సంకట పీడితుల పీడకు తాళలేని నా మిత్రుడొకడీ మధ్య (బరంపురం వాసి) దేశాన్ని లేటిట్యూడు లాంగి ట్యూడుల సరిహద్దుల ప్రకారం తప్ప వేరొక రీతిని రాష్ట్రాలుగా విభజించరాదనే స్థితికి వచ్చితినని అన్నాడు.

ఈ చిక్కులు ముఖ్యంగా ద్విభాషా, బహుభాషా ప్రాంతాలలో మరీ యెక్కువగా కలుగుచున్నవి. స్వతహాగా చూస్తే ఇది స్వభాషాభిమానం వల్లను, పరభాషా ద్వేషం వల్లను కలిగిన సంకటంకాదు. భూమిని దేశాలుగానో, రాష్ట్రాలు గానో విభజించడానికి భౌగోళిక, నైసర్గిక, సముద్ర, పర్వత, నదీ, తటాకాదులగు సరిహద్దులైన ఉండవచ్చును గాని ప్రజలను ప్రాంతాలను బట్టి సరిహద్దులు వేసి, జాతులుగా నిర్ణయించడానికి మార్గాలు లేవు. ఎట్టి భౌతికపు టాటంకముల నైనా ప్రజలు తమ తమ అవసరాలను బట్టి అతిక్రమించి ఒకరితో ఒకరు కలుస్తూ, సంభాషిస్తూ, వ్యవహరిస్తూ, ఆనందిస్తూ వుంటారు. కనుక ఒక తెగకూ ఇంకొక తెగకూ హద్దు నిర్ణయించ సాధ్యం కాదు. ప్రధాన మధ్యస్థ ప్రాంతాలలో ఫలానా తెగ ఫలనా సంఘం అని హద్దు చెప్పడానికి వీలున్నా, ఎక్కడో ఒక చోట త్రివేణీ, ద్వివేణీ, చతుర్వేణీ సంగమాదులలాగ బహువర్గ బహుభాషామిశ్రమ ప్రాంతాలు ఉండకపోవు. మానవులలో పరస్పర సంపర్క వాంఛ చచ్చిననాడు తప్ప కలగాపులగం ప్రాంతాలు లేకుండా ఉండేటట్లు సాధించడం సాధ్యం కాదు.

సృష్టి వున్ననాళ్ళు మానవకోటిలో అట్టి పరస్పర సంపర్కవాంఛ

చావనూ చావదు; మిశ్రమ ప్రాంతాలు, జాతులు, తెగలు లేకుండాను పోవు. కేవలం మిశ్రమ ప్రాంతాలలోనే కాక ఇతర ప్రాంతాల ప్రజలకు కూడా తమ యిరుగుపొరుగుల, నాతిదూరస్థ ప్రజలతోనే గాక వివిధ దేశ ఖండస్థులతో కూడా అన్యోన్య సంపర్కం యెంతో అవసరం. అది సాధారణ సందర్భాలలో సాధ్యం కాకపోయినా, కొన్ని కొన్ని సందర్భాలలో సంభవించుచునే యున్నది.

## ప్రపంచదేశాలలో పరస్పర సంస్కృతి సంపర్కం

ఒకప్పుడు రాజులు దండయాత్రలు చేసి దూరస్థ ప్రదేశాలను జయించేవారు. ఆయా దూరస్థ దేశ ప్రజలు విజేతలను అప్పుడు శత్రువులుగా పరిగణించినా ఆ శత్రుత్వాలు స్థిరీభూతము లయ్యేవి కావు. విజేతలకు పాలిత ప్రజల సహకారము వారి నానందింపచేయడము అవసరమయ్యేది కనుక వారు త్వరగా మిత్రులుగా మారేవారు. తదనుగుణ్యంగా పాలిత ప్రజలును యెడతెగని వైరమును పూనక రాజు అసు పేరు పెట్టుకొని చక్కగా పాలించువాని కెల్ల విధేయులుగానే ఉండేవారు. పరస్పర స్నేహంతో బాటు పాలక వర్గ లక్షణాలు పాలిత వర్గాలకు పాలితవర్గ లక్షణాలు పాలకవర్గాలకు సంక్రమించేవి.

నాటి రాజుల దండయాత్రలు కేవలం ఘాతుకత్వ దుర్గాహప్రేరితములు కావు. "అసంతుష్టర్ద్విజానష్టః సంతుష్టారివపార్థివః" అను సూత్రము ననుసరించి ఒకానొక విజయాపేక్షతో సవ్యమైన సూత్రము ననుసరించి శాస్త్రీయ పద్ధతిపై జరిగినట్లు కనిపించుతుంది. ఆ రాజుల వెనుక ఆ దేశపు పండితులు వైతాళికులు పరివారాలు ( నటనకత్తెలు కూడా) తరలి వెళ్ళేవారు. యుద్ధంలో గెలుపో ఓటమియో స్థిరపడేదాకానే శత్రుత్వంకాని, యెవరికో ఒకరికి ఏదో యొకటి సంభవించగానే విరోధాలకు స్వస్తి, విజయోత్సవాలలో ఉభయులు పాల్గొనడాలు, పరస్పర స్నేహమునకు పునాదులు పడేవి. నాటినుంచి ఆ దేశాల మధ్య రాయబారాలు, వాణిజ్యాలు, పండిత సంచారాలు, విజ్ఞాన పరిచయాలు, కళాసమ్మేళనాలు జరుగుతూ వుండేవి. మన దేశ కళలలో శాస్త్రాలలో కొన్ని గ్రీకు పోలికలను, వారి కళలు భాషాశబ్దములు మొదలగు వానిలో కొన్ని భారతీయ లక్షణాలను పోలికలును కలగడానికి కారణం

అలెగ్జాండరు దండయాత్ర తదనంతర చరిత్రలి ఫలమనడానికి సందేహం లేదు.

అట్లే బౌద్ధులు మొదలగు ధర్మ మత ప్రచారసక్తులు భారతదేశం నుంచి చీనా, బర్మా, సింహళం, జావా మొదలగు ప్రాంతాలకు వెళ్ళి అచ్చటి ప్రజల అభిమానాలను జూఱగొని వారికి భారతీయ సంస్కృతి పరిచయము నొనర్చిరి. నాటినుండి ఆయా దేశాల విద్వాంసులను భారతీయ ప్రతిభను కనులార చూడగోరి విచ్చేసి సత్కారమును పొందేవారు. జాతులకు జాతులకు మధ్య సంస్కృతులలో యేవో బ్రహ్మాండ భేదములున్నవను మాట కల్ల. చీనాలోని కన్ఫ్యూసియస్ సిద్ధాంతములకును బౌద్ధ సిద్ధాంతములకును యెంతో సన్నిహితమగు పోలికలుండబట్టే, చీనా మొదలగు దేశాల ప్రజలు సునాయాసంగా బౌద్ధమతంలో చేరడం సంభవించింది కాని, నిర్బంధం, పేరాసల వల్ల కాదు.

తరువాత హిందూ వేదాంత తత్వప్రచారకులు తమ కళా నైపుణీ చాతుర్యముతో రామాయణ మహాభారతాది సాహిత్య చోదిత సౌందర్య ప్రసారముతో ఆయా దేశాలకు వెళ్ళినప్పుడు, బౌద్ధమత సిద్ధాంతాలను వలె భారతీయ కళలను కూడా వారు సులువుగా అవలంబించారు. మన దేశంలో చిత్రాలలాటి చిత్రాలే, దేవళములలాటి దేవళాలే., సాహిత్యం లాటి సాహిత్యాలే ఆ దేశాలలో వెలసి నేటికి ఉదాహఱణగా నిలచి ఉన్నవంటే మన పూర్వులు వాటిని వారిపై నిర్బంధించిరని అర్థం కాదు. ఆయా దేశాల ప్రజల లక్షణాలును ఈ దేశ ప్రజల లక్షణాలును ఇంచుమించు ఒకే పోలిక కలవగుటవల్లనే అట్టి కళాసమ్మేళనములును జరిగినవి.

## మత ప్రచారాలు, ద్వేష ప్రబోధాలు

దర్మిలాను మనదేశంలో అనేకులు మహమ్మదీయ, క్రైస్తవ మతములలో చేరిన సందర్భములను కూడా మనమాలోచించ వచ్చును. ఈ మతాల ప్రచారం నాటికి మతప్రచారమనేది ఒక మోస్తరు పిచ్చి ఆవేశం క్రిందికి మారింది. మహమ్మదీయులు కాని వారినందరిని వారు కాఫర్లనీ, వారికి మోక్షం లేదనీ, బలవంతంగానైనా చేర్చుకోవడం దోషం కాదనీ భావించారు. కనుక అనేకులు నిర్బంధంగానే ఆ మతంలో చేరారు. అట్లే క్రైస్తవులు కానివారినందరిని

ఫాదరీలు హిదెన్ల క్రింద భావించి క్రీస్తు ద్వారా తప్ప యెవరూ మోక్షమును చేరలేరని నమ్మి ఇచ్చటి వారి నుద్ధరించు ఉద్దేశంతో బడులుపెట్టియో, ఆస్పత్రులు పెట్టియో, ఇతర ఆశలు చూపియో ఆ మతంలోకి అసంఖ్యాకులను చేర్చుకున్నారు.

హిందువులు మాత్రం ఇతర దేశస్థులను మ్లేచ్ఛు లనలేదాయని యెవరైనా అడుగవచ్చును. కాని మ్లేచ్ఛులకు మోక్షం లేదని హిందూ తత్వశాస్త్రము లెన్నడూ చెప్పలేదు. ఎవరి సంప్రదాయాలలో వారుండడం మంచిదని భావించి "అనారోగ్య " తుల్యమగు అశుచీభూతమగు సాంకర్యం కలుగరాదనియే వారి సంకల్పం. ఇతరులను నమ్మించో వంచించో బలవంతానో తమలో చేర్చుకోక పోతే వారికి మోక్షం లేదని వారు భావించలేదు. పైగా వారు చేసిన అపచారమింకొక టేమిటంటే ఆర్య బ్రహ్మసమాజాలు శుద్ధి సంఘటన ఉద్యమాలు లేచేవరకు తమ సంఘం నుంచి ఇతర మతాలలోకి యెవరూ పోకుండా కట్టుబాటులైనా చేసుకోలేదు. ఏ మతం వారికైనా మోక్షం కలదను విశాలభావమగు వారి సంస్కృతియే వారి నట్టి కార్యమునకు పురికొల్పలేదు.

ఇస్లాం క్రైస్తవ మత ప్రచారకుల వెనుక రాజకీయ సూత్రములు కూడా మిళితములైనవి కనుక ఆ వర్గాలలో దేశీయ ప్రజల పట్ల ఆచారముల పట్ల, సంస్కృతి పట్ల విద్వేషం ప్రబలింది. ఆ ఉభయవర్గాల వారూ పాలక "జాతు"లనీ ఇతరులగు దేశీయు లెల్లరూ పాలిత జాతులనీ ఒక అహంకారం ప్రబలి, ఉద్యోగసద్యోగాలు మొదలగు వరాలన్నీ మొదటి వర్గాల వారికి పక్షపాతంతో ఇయ్యబడేవి.

ముఖ్యంగా గత బ్రిటిషు క్రైస్తవ పరిపాలన యుగంలో శుద్ధ శ్వేత క్రైస్తవుల (యూరోపియన్లు) కు అగ్రస్థానం. భాగశ్వేత క్రైస్తవులకు (యూరేపియన్లు) ద్వితీయస్థానం, నల్లజాతి (భారతీయులలో నుంచి కన్వెర్టయినవారు) క్రైస్తవులకు తృతీయ స్థానం గౌరవాలు ఒసగబడేవి. మిగిలిన భారతీయులలో కూడా చీలికలను పుట్టించి పెంచు ఉద్దేశంతోనే ఆ వరాలు క్రమమైన పాళ్లుగా పంచబడేవి. పాలనాచక్రం కూడా ఆ సూత్రం ప్రకారమే నడుపబడింది.

## భాషా ద్వేష ప్రాతిపదిక

అందులో మన ప్రస్తుతానికి సంబంధించిన భాగమును మాత్రమే మనము ప్రస్తావింతము. అది యేదనగా భాషా మిశ్రమ రాష్ట్ర తంత్రము. తెలుగు, అరవ, కన్నడ, మళయాళీ భాషల జాతులతో కూడిన ఒకే విశాల మద్రాసు రాష్ట్రం అందుకు ప్రథమోదాహరణము. ఉత్కళ ఆంధ్ర మిశ్రమ ప్రాంతము రెండవది. హిందీ తెలుగు ఉత్కళ మిశ్రమ మధ్య రాష్ట్రములు మూడవది. గుజరాత్ మహారాష్ట్ర మిశ్రమ భాగం నాల్గవది. బెంగాలీ బీహారీ మిశ్రమభాషా భాగం అయిదవది - ఇట్లనేక ప్రాంతములున్నవి.

ఇట్లు భాషామిశ్రమ ప్రాంతాలను ఉంచినందువల్ల మాత్రమే ప్రమాదం లేదు. ఈ వ్యాసంలో మొదట తెలిపినట్లు అట్టి మిశ్రమ భాగములను లేకుండా ఆపడం బ్రహ్మతరం కాదు. సద్వినియోగము చేస్తే అందువల్ల భారతీయ సంస్కృతికి దోహదం కలిగేది కాని ద్రోహం కలిగేది కాదు.

## దేశీయ రాజుల పాలనలో బహుభాషాసమాదరణం

భారతీయ పాలకుల హయాములో అట్టి సంక్రమ భాగాల వల్ల భారతీయ సంస్కృతికి దోహదమే కలిగేది. తిరువాన్కూరు మహారాజ స్వాతీ తిరునాళ్ తన పాటలను సకలభాషలలోనూ వ్రాసెను. పంచాపకేశయ్యరు అను ఒక అరవ భాగవతార్ హరికథా విధానములో "కాలక్షేపము" అను క్రొత్త ఫక్కీని త్రొక్కి, అట్టి కాలక్షేపములను కేవలం తన అరవ హరికథలలో మాత్రమే కాక, తెలుగు కన్నడం మళయాళం భాషలలోని పండిత గాయక వర్తులను సమీకరించి ఆయా భాషలలోకి కూడా ఆ విధానము జొప్పించెను. మైసూరు మహారాజులు దక్షిణ భారతీయ భాషలను, కళావేత్తలను సమాన గౌరవంతో చూచేవారు. కనుక సమస్త భాషలలోని విద్వాంసులకును గాయకులకును ఆ సంస్థానమాస్థాన పీఠమైనది. అందువల్లనే కాబోలు కవి సార్వభౌముడు శ్రీనాథుడు "ఎవ్వ రేమనుకొన్న నాకేమి కొదవ నా కవిత్వంబు నిజము కర్ణాట భాష" అని నుడువ సాహసించి నాడు. మరియు "కర్ణాట కటక పద్మవనహేళి శ్రీనాథభట్టసుకవి" నని తన్ను తాను ప్రస్తుతించుకున్నాడు.

ఈ విధంగా పాలకులు పండితులు చేసిన భారతీయ సంస్కృతి దోహదమునకు తోడు ప్రజాసామాన్యము కూడా తమంతట తామే ఒక భాషా ప్రాంతంలోని విధానమును ఇంకో ప్రాంతంలోకి అనుకరించే వారు. యక్షగానము, తోలుబొమ్మలాట, భామకలాపం, భట్రాజు కవిత్వం మొదలగునవన్నీ ఇంచుమించుగా దక్షిణ భారతీయప్రాంతము లన్నింటిలో సరిసమానముగా వర్ధిల్లినవి. మహారాష్ట్ర నాటక కంపెనీల దక్షిణ దేశ యాత్రవల్ల దక్షిణాది నాటకరంగమే భామకలాప యక్షగానములకు విభిన్నమైన ఒక నూతన ఫక్కికి వచ్చిందని ప్రేక్షకులకు తెలుసును.

ఇదంతా యెందుకు చెప్పవలసి వచ్చిందంటే, ఏ భాషవారైనా ఆ భాష ఒక్కటే తమ సొత్తు, తక్కిన భాషలు తమ శత్రువులు అనుభావముతో వర్తించలేదని తెలుపుటకే. ఇప్పటికిని తెలుగు పరపంచాలలో తెలుగు నెలలు, ఇంగ్లీషు నెలలు, అరవ నెలలు, తురక నెలల పేర్లు పిల్లలకు పాఠము చెప్పబడుచున్నది. శ్రీకాకుళం జిల్లా గ్రామాలలో యెక్కాలు తెలుగులోను ఉత్కళ భాషలోను కూడా చాలా కాలం వరకు చెప్పబడుచుండెను. 11.11.121 మొదలు 20.20.400 వరకు గల యెక్కాల భాగమునకు ఇప్పటి కిని "యెగరన్నగిరీలు" పేరే ఆ ప్రాంతాలకు గల ఉత్కళ సంపర్కాభిమానమును తెలుపుచున్నది. అసలు 'ఎక్కము" అను శబ్దమే ఓఢ్రభాషాతద్భవం ఓఢ్రంలో "యెక్కా" తెలుగులో యెక్కమైనది. ఓఢ్ర ప్రాంతములకు దూరమైన తెలుగు భాగాలలో వానిని 'ఒంట్లు' అంటారు. ఒక బాలుడు పెద్దవాడైతే కేవలం తన ప్రాంతాలలోనే కాలం వెళ్ళబుచ్చవలసినవాడు కాడనీ, దేశంలో వివిధ ప్రాంతాలకెప్పుడో ఒకప్పుడేదో కార్యం మీద వెళ్ళవలసి వచ్చేవాడు కాబోవుచున్నాడనీ, అందుకు తగిన పరిజ్ఞానమును కొంతైనా బడి చదువులలో నేర్పాలనీ, ఆనాటి జనుల అభిప్రాయమని విశదమగుచున్నది.

- ఇట్టి సమగ్ర పరస్పరాభిమానతుందిల భారతీయ సంస్కృతీ రంగంలోకి బ్రిటిషు కృత్రిమ రాజనీతిజ్ఞుడు విషబీజములను విరజిమ్మగలిగాడు. ఉద్యోగ సద్యోగాదులలో ఒక వర్గం వారి యెడ పక్షపాతం బూని ఇంకొక వర్గం వారిని అణగదొక్కించడం, ఒక ప్రాంతంలోని ఆదాయమును తీసి ఆప్రాంతమును పస్తు పెట్టి రెండవ ప్రాంతంలో అభ్యుదయ ప్రాజెక్టులు నిర్మించడం మొదలైన చర్యల ద్వారా పరస్పరద్వేషాలను పురికొల్పాడు.

## భాషాప్రయుక్త రాష్ట్రాల గోలకు కారణం

ఇందుమూలంగా భాషాప్రయుక్త రాష్ట్రాలు కావాలోయను గోల బయలుదేరింది. సహజంగా కూడా యేదో మిశ్రమ భాషా ప్రాంతాలలో తప్ప తక్కిన భాగాలలో రాష్ట్రముల పాలన ఆ భాషలో జరగడం విపరీతం కాదు. ఉత్తరాది రాష్ట్రము లనేకములా విధముగానే నడుచుచున్నవి. కనుక ఆంధ్రులు మహారాష్ట్రులు ఉత్కళులు కన్నడులు మొదలగువారు భాషా ప్రయుక్త రాష్ట్రాలను కోరడంలో విపరీతం లేదు. ఏ రాష్ట్ర పాలన ఆ రాష్ట్ర భాషలో ప్రజల కవగాహమగు రీతిని జరగడం విపరీతం గాదు. బ్రిటిషువారి హయాములో గనుక దేశానికంతటికీ ఒకే భాష రాజకీయ భాష కావడం, సకల రాష్ట్రాల పాలన ఆ భాష ( ఇంగ్లీషు) లోనే జరగడం, అందుకోసం విద్యా విధానం తారుమారై ఉద్యోగసేకరణ సాధనగా మాత్రం మారడం తటస్థించింది కాని, ఇంకే యుగంలోనూ యెవడో క్రొత్త మగడుగా వచ్చిన వాని భాష రాజకీయ భాష అయ్యే విపరీతం జరగలేదు సరేగదా, ఆ కొత్త మగడే నూతన రాష్ట్ర భాషా పుత్రుడుగా పోషకుడుగా పరిగణించేవాడు.

నేడు బ్రిటిషు హయాము వెళ్లి ఇండియన్ రిపబ్లికన్ హయాము వచ్చింది. కనుక, యేవో అఖిల భారతీయ పరిపాలనా కార్యాలు, హిందీలోనో ఇంగ్లీషులోనో జరిగినా, ఇతర సామాన్య వ్యవహారాలు దేశీయ భాషలలో జరుగవలసిందే. అట్లు జరుగకుండ ఆ కార్యాలను ఇప్పటి వలె ఇంగ్లీషులోనే జరిగించడమనేది డిమోక్రసీ సూత్రానికే విరుద్ధము. అది పైపైని యెన్ని యెలక్షన్లు శాసన సభలు, చర్చలు మొదలైన రూపాలతో కనిపించుతున్నా, - కృత్రిమ డిమోక్రసి కాని నిజమైన డిమోక్రసి అనిపించుకోదు.

## మిశ్రమ ప్రాంతాలలో మిశ్రమ భాషా రాష్ట్రాలు

చిక్కల్లా మిశ్రమ భాషాప్రాంతాలపట్లనే వస్తున్నది. ఆ ప్రాంతాలను తమ రాష్ట్రాలలో చేర్చాలని దరిరాష్ట్రాల నాయకులందరూ ఘోరాతి ఘోరవాదనలు చేస్తూ లేకుంటే రక్త ప్రవాహాలు కార్పిస్తామని బెదిరిస్తున్నారు. నూటికి ఎనభై మంది ఆ ప్రాంతంలో యేభాషకు చెందితే ఆ ప్రాంతాల్ని ఆ దరి రాష్ట్రంలో చేర్చవచ్చును. లేని ప్రాంతాలను మిశ్రమ రాష్ట్రాలుగా

వుంచడం చాలా అవసరం.

మునుపటి రాజుల కళాపోషణ భాషాపోషణా యుగంలో లాగా, ఇప్పటి సంకుచిత భాషావాద డెమోక్రసీ నాయకులు తమ రాష్ట్రములో తమ భాషకు, తమ సంగీతానికి, తమ "సంస్కృతికే" తప్ప ఇతర విధానాలకు దోహదమిస్తారేమో చెప్పజాలము. అట్లు ఇయ్యనవ్వాళ్లు భారతీయ సంస్కృతికి ద్రోహం చేసిన వారే అవుతారు. నాయకులెట్లు వర్తించినా వివేకధురీణులగు పండితులు పామరులైనా తెలివిగా వర్తించి తమ సనాతన సంప్రదాయమును మరువక తమ భాషను, సంగీతమును కళలను ఉద్ధరించుకోవడంతో బాటు ఇతర భాషలో సంగీతంలో నాట్యంలో నాటక విధానాలలో కవితా ధోరణులలో యెట్టి ఫక్కీలు సాగుచున్నవో గమనించి అవగాహన చేసుకొని తమ ప్రాంతములలో వాటిని ప్రచారం చేయబూనారా, అది నిజమైన భారతీయ సంస్కృతికి దోహదమవుతుంది. లేకుంటే కూపస్థ మండూకమై చలనం లేక గడ్డ కట్టిపోతుంది.

ఇట్టి అవస్థ రాకుండా తప్పించడానికి మిశ్రమ భాషా రాష్ట్ర నిర్మాణం అత్యంతావశ్యకం. సరిహద్దు ప్రాంతాలలో అట్టి రాష్ట్రాలను నిర్మించడం సులభం, అవసరం, అభ్యుదయ దోహదకరం. సంకుచిత భాషావాదుల మూఢత్వము నరికట్టగలవి అట్టి మిశ్రమ రాష్ట్రాలే.

ఈ విషయమును నేను కొత్తగా ప్రతిపాదించలేదు. కొంత కాలం క్రిందట Andhra Herald లో (Bylingual provinces are the connective links of Indian Culture) అను వ్యాసమును ఆంగ్ల భాషలో వ్రాసితిని. ఆ భావముల నింకోరీతిని ఉటంకించవలసిన అవసరం యేర్పడినది కనుక ఈ వ్యాసమును వ్రాయుచున్నాను.

## మద్రాసు మిశ్రమ రాష్ట్రం

ఆంధ్రరాష్ట్ర నిర్మాణమునకు మద్రాసు నగర సమస్య ప్రధానమగు చిక్కుగా భావించబడుచున్నది గనుక, ఈ విషయమును తిరిగీ ఉద్ఘాటించవలసి వచ్చింది. శ్రీ పట్టాభి సీతారామయ్య గారు ఆంధ్రులు మద్రాసు నగరంపై "తమకు గల హక్కులను" వర్జింపవలెనని కోరినారు. ఆ పదజాలమును

బట్టియే ఆంధ్రులకు హక్కులు గలవని తేటపడుచున్నది. గత మద్రాసు నగరచరిత్రను చూసినా ఇప్పుడందులో గల ఆంధ్రసంస్థల ప్రాబల్యమును చూచినా, నగరాభివృద్ధికి ఆంధ్ర ప్రాంతాల నుంచి వచ్చిన ఆదాయ మెంత పోషకమైనదో పరిశీలించినా, ఆంధ్రులకా నగరంపై హక్కులు లేవని వాదించగల మూర్ఖులుండబోరు.

అయితే, పట్టాభి గారి పదజాలమునకు అర్థము. "సర్వ హక్కులు ఆంధ్రులకే" అను వాదమును వర్జింపవలెనని మాత్రమే అగుచున్నది. ఈ సూత్రం ఒక్క ఆంధ్రుల పట్లనే గాక తమిళులు, కన్నడులు, మళయాళీలు మొదలగు ఇతర వర్గాల వారి పట్ల గూడ వర్తించవలెను. మద్రాసు నగరాభివృద్ధియు, తత్ఫలమును కేవలం అరవల దొక్కరిది మాత్రమేయై యుండవలెననిన్నీ, అది అరవ రాష్ట్రమునకు మాత్రమే రాజధాని కావలెనన్ని అరవలు విపరీత వాదం చేస్తున్నారు. కనుక కేంద్ర ప్రభుత్వం హెచ్చరిక పాఠమును నేర్పవలసింది ఆంధ్రులు మొదలగు వారికి కాక కేవలం అరవలకు మాత్రమే.

మద్రాసును మిశ్రమ భాషా రాష్ట్రంగా మార్చి తీరాలి. అయినా ఇది పూర్వపు గ్రీకు సిటీ స్టేటుల యుగం కాదు. ఒక్క నగరమెప్పుడూ ఒక రాష్ట్రమై స్వయం సమృద్ధం స్వయం సమర్థం కాజాలదు. మద్రాసు చుట్టూ అనేక తెలుగు అరవ మిశ్రమ ప్రాంతాలున్నవి. చెంగల్పట్టు జిల్లా మొదలగు ప్రాంతాలనన్నిటినీ చేర్చి ఒక రాష్ట్రముగా చేయవలెను.

## శాస్త్రిగారి విపరీతవాదం

శ్రీ టి.ఆర్. వెంకటరామశాస్త్రిగారి వంటి నిదాన పురుషుడు భాషాప్రయుక్త రాష్ట్రములు లోగడ యెన్నడూ అవసరం లేకుండెనని, కనుక ఇప్పుడునూ అవసరం లేదని చెప్పినట్లు జులై 11వ తేదీ ఇండియన్ ఎక్స్‌ప్రెస్‌లో ప్రకటించబడింది. ఆనాటి రాజుల పాలకుల సత్సంస్కృతిపరిశోభిత విశాలభావపాలనలో అట్టి అవసరం లేకుండెనని నేనును ఈ వ్యాసంలో చెప్పితిని. కాని బ్రిటిషువాని మూలంగా ప్రవేశించిన పరభాషా ద్వేషతత్వం నేటికిని మద్రాసు నగరంలోను, ఉత్కళ, గంజాం మండలములోను, విజృంభించు

చున్నందువల్లనే రాష్ట్రాలను భాషా ప్రయుక్తంగాను, మిశ్రమ భాషా ప్రయుక్తం గాను విభజించవలసిన అవసరం యేర్పడినదని అనుభవజ్ఞులకు విశదమగుచున్నది.

శ్రీ శాస్త్రిగా రింకొక విపరీత వాదం కూడా ఆ వ్యాసంలోనే చేశారు. కర్మంజాలక భాషాప్రయుక్త రాష్ట్రాలే యేర్పడితే మద్రాసు నగరమునకు ఆంధ్రులు తిలోదకాలిచ్చివాలనీ, దానిని తమిళులకు ధారపోయాలనీ ప్రతిపాదించారు. అట్లు చేయకుంటే ఆంధ్రులు నగరపాలనకు సంబంధించిన ప్రతి విషయంలోనూ తమకు ప్రాతనిధ్యం కావాలని గగ్గోలు చేస్తారని వాదిస్తున్నారు అనగా ఇప్పటివలె నగరంలో అరవలు తమప్రాబల్యమును హెచ్చించుకొని, ఇతర భాషల సంస్కృతితో కూడిన విశాల సంస్కృతిని మూలమట్టంగా అణచేసి కేవల ద్రావిడ కజగ సంస్కృతి ప్రధానంగాను అరవజాతి ఉద్యోగస్థుల ప్రాబల్యరంగంగాను, తెలుగు వారికి కళాశాలల్లో సీటు కూడా లేకుండా చేసే రంగంగాను, మార్చజాలరని అతని ఉద్దేశమేమో! అట్టి ఉద్దేశమతనిది కాకుండును యని మన మెంత వాంఛించినను, అతని పలుకులట్టి ఉద్దేశ్యమతనికి కలదని చూపుతున్నవని తెలపుటకు విచారించు చున్నాను.

ఈ మోస్తరు సంకుచిత సంస్కృతి బద్ధములగు వాదములకు కేంద్ర ప్రభుత్వం ఆదరణ మీయరాదు. అరవల వాదం తప్పు అని తెలిసిన తరువాత కూడా "వారూ మీరూ పొత్తు కుదుర్చుకోవలసిందే కాని పెద్దమనిషి పరిష్కారమునకు కూడా నేను ఒప్ప"నని జవహర్లాలు వాదించుచున్నందుననే అరవలు మరింత బిఱ్ఱబిగిసి మరికొన్ని ప్రాంతాలను కూడా ఆంధ్ర రాష్ట్రంలో చేరకుండా మ్రింగివేయవలెనని ప్రయత్నిస్తున్నారు.

రాష్ట్రం ముందుగా ఆంధ్రుల కియ్యబడవచ్చుననే కారణమును పురస్కరించుకొని, ముందుగా వారు తమ హక్కులను మద్రాసు నగరం మీద నుంచి వర్జించుకోవలెననే గాక తమిళులకు మాత్రమే అర్పించవలెనని నిర్బంధించడం, ఒకనిని మూగవానినిగా మార్చి నోరుగల వాని చేత తిట్టించడం లాంటిది. జవహర్లాలు ఈ సంగతిని తెలుసుకోలేని మూర్ఖుడనుకొనజాలము. అయినా కేంద్ర సెక్రటేరియటు నిండా కీలకోద్యోగాల నిండా అరవలు

క్రిక్కిరిసి యున్నందున వారి యెడల మొగమాటం వల్లను, ఆంధ్రులు చాలా బెట్టుసరి మనుష్యులగుట వల్ల వారి యెడల వెగటు వల్లను అతనట్లు వాదిస్తున్నాడని మన మనుకోవలెను.

## మిశ్రమ రాష్ట్రాలు, సంస్కృతిసమ్మేళనాసోపానాలు

శుద్ధభాషా రాష్ట్రాలలోని సామాన్య ప్రజలకు తమ భాషను గాక ఇంకొక భాషను నేర్చుకోమని చెప్పడం బలవంతం కావచ్చును. కావలసిన వారెల్లాగా నేర్చుకోకమానరు. కాని మిశ్రమ భాషాప్రాంతం ప్రజలకు తమ భాషతో సన్నిహితభాషలను నేర్చుకోవడం కష్టం కాదు. వద్దన్నా వారి కా భాషలు, ఆ సాహిత్యములు రాకపోవు. అది అత్యంత సులభసాధ్యం కూడా మిశ్రమ భాషారాష్ట్రాలలోని ఇట్టి సాహిత్యాది సంపర్కాల మూలంగా కలిగే సంస్కృతీ పరిణామము ధనరుక్రమంగా సన్నిహిత భాష లన్నింటిలోకి ప్రాకకపోదు.

ఈ విధంగా భారతదేశం ద్రావిడ భాషా సంస్కృతి ఖండం. సంస్కృత ప్రాకృతభాషాసంస్కృతి ఖండం అను రెండు ప్రధాన భాగములుగా తయారవుతుంది. ఆ సంస్కృతులకు రెండింటికిని సమ్మేళన మనాదికాలంగా జరుగుచునే ఉన్నది. భాషలు వేరైనా భారతీయ సంస్కృతి యావత్తూ ఒకటే అని పరిచయస్థులందరికీ తెలుసును. అట్లగుటకు కారణమిట్టి సమ్మేళనమే.

బహుభాషా సంస్కృతుల సమ్మేళనం చేయడం కంటే రెండు ప్రధాన ఖండములను సమ్మేళనం చేయడం సులభసాధ్యం. ఇందుకు దక్షిణాది మిశ్రమ రాష్ట్రాలెట్లు ఒకరీతిగా దోహదంచేయగలవో, ఉత్తరాది దక్షిణాది భాషల మిశ్రమ రాష్ట్రము లట్లు వేరొక రీతిని దోహదం చేయగలవు.

శ్రీకాకుళం గంజాం జిల్లాల దోసందున, ఉత్కళ, ఆంధ్ర మిశ్రమ బరంపురం రాష్ట్రం. మధ్య రాష్ట్ర ప్రాంతమున ఆంధ్ర హిందీ ఉత్కళ మిశ్రమ బస్తరు రాష్ట్రం. బొంబాయి ప్రాంతమున గుజరాతీ మహారాష్ట్ర భాషా మిశ్రమ బొంబాయి రాష్ట్రం మొదలయినవి ఇట్టి మహాప్రయత్నమునకు యెంతో దోహదం చేసి, భాషాద్వేష గండమును దాటించి, భాష లెన్నైను భారతదేశం

భారతసంస్కృతి అంతా వివిధ రకాల ఛాయలతో కూడిన ఒకే మహాసంస్కృతి ప్రవాహమను సిద్ధాంతమును రుజువు పరచగలవు.

ఇట్లు ఒకే ఒక భారతీయ సంస్కృతి విజృంభణము ముందు జరిగితే, ఇతర చీనా జపాను ఐరోపా సంస్కృతులతో సంపర్కం సులభసాధ్యమై, "ఖండాలు వేరైనా ప్రపంచసంస్కృతి యావత్తూ ఒక్కటే. సంస్కృతి సార్వజనీన" మను సిద్ధాంతమును మనము ఆచరణలో పెట్టగలము.

బౌద్ధమతమును మతమనుటకంటె బౌద్ధ సంస్కృతి యనుట లెస్స. ప్రజలు దానిలో స్వచ్ఛందంగా చేరారు కాని, బౌద్ధభిక్షులు నిర్బంధించలేదు. హిందూమత మనేది అసలులో ఒక మతమేకాదు అనేక ఆచార తత్వ సిద్ధాంతాల సమ్మేళనము. అది యెవరినీ తన ఆచారాలలో తత్వసిద్ధాంతములలో చేరమనలేదు. ఎవరి మతాచారాలలో నుంచి వారు కదలకుండా ఉంటున్నే, విశ్వజనీన తత్వంపై కూడా దృష్టి నిగుడ్చుకుని మాత్రమే అది ప్రబోధించింది.

ఆచారవ్యవహారాలు, ప్రార్థనజపతపాది విధానాలు యెవరిష్టమైనయట్లు వారివి. కాని సంస్కృతి మాత్రం సార్వజనీనం. ఆ దృక్పథం నుంచి యే మతమైనా భాషైనా జాతియైనా కళయైనా భిన్నించిందో సంస్కృతి కదిగొడ్డలిపెట్టు. భారతదేశం ప్రపంచానికిచ్చిన ప్రధానసందేశమే యిది. ఈ సందేశాన్ని ముందు మన దేశంలో మనమే ఛిన్నా భిన్నం చేయ మొదలుపెడితే, మన సందేశాన్ని లోకం హర్షించాలని కోరడానికే మనకు హక్కు లేదు.

**– కిన్నెర, ఆగస్టు, 1952**

# ప్రణాళికలు (Plannings)

గొప్ప కార్యం తలపెట్టుకున్నప్పుడల్లా ముందు, ఇండియా గవర్నమెంటు బడ్జెట్టు లాగ, ఒక ప్రణాళిక వుండవలసినదే. వ్యవసాయ వ్యాపారములకు కూడా ఇట్టి ప్రణాళికలుండాలి. వాటినే ప్లానింగులంటారు. రష్యా పంచవర్ష ప్రణాళికలను ప్రారంభించినప్పటి నుంచీ, ప్రతీదేశము వారూ ఇదే పని పట్టారు. జార్ల ప్రభుత్వములో రష్యాదేశము వ్యవసాయ వ్యాపారములు రెంటిలోను వెనుకపడి వుండి దేశమంతా ఊసరక్షేత్రమై ఫ్యాక్టరీలల్పసంఖ్యాకములై, గనులు పనులు చేసేవారి ఆస్కారము లేక జను లన్న వస్త్ర హీనులై బలవంతులు బలహీనులగు కోటానుకోటి జనులను దోచుకుంటూ, విదేశములనుండి యెనలేని వస్తువులను దిగుమతి చేసుకుంటూ అంగరంగ వైభోగములనుభవిస్తూ, ఒక విధమగు సైనిక ప్రభుత్వమును చలాయిస్తూ వుండేవారు. ఈ ఉప్పెనలోనుంచి తప్పుకుంటకు రష్యా సదరు ప్రభుత్వమును నిర్మూలం చేసి కార్మిక ప్రభుత్వం పెట్టుకొని తమ దేశమునకు తమ స్వతంత్ర రాష్ట్ర సమ్మేళనమునకు కావలసిన సరుకును తామే నిర్మాణము చేసుకొనుటకు, అందరికీ పని కల్పించడానికీ విద్యా వివేకములు పెంచడానికీ, ఆరోగ్యాభివృద్ధి చేయడానికీ, కమ్యూనిష్టు పార్టీ వారిపై అభిమానమును హెచ్చించడానికీ, రోడ్లులూ, రైళ్ళూ పెంచి పరస్పర స్నేహ బాంధవ్యములుదయింప చేయడానికీ, ప్రణాళిక మీద ప్రణాళిక వేసుకొని సాగించవలసి వచ్చింది. సాగించింది, సాగిస్తూ వుంది.

తక్కిన దేశాలకి రష్యా చేస్తున్న ఇతర ప్రయత్నములు నచ్చినా నచ్చకపోయినా ఆర్థిక ప్రయత్నములు మాత్రము నచ్చుచున్నవి. నచ్చేదేమిటి, మానేదేమిటి ప్రపంచమునంతటినీ ఆవరించియున్న ధరల మాంద్యం, నిరుద్యోగం, వ్యాపార స్తంభనము అనే వాగుల నుండి తప్పించుకుంటకు ఏవో కొన్ని ఉపాయములు పన్నుకోక తప్పుతున్నది కాదు. బ్రిటిషు వారు ప్రారంభించిన టారిపు గోడలు, అటావా ఒడంబడికలు, జపానుతో సంప్రతింపులు, ఒక రీతిగా ఈ జాతిలోనివే. రష్యా అంటే తన దారిద్ర్య కర్మము కొద్దీ తన మార్గము త్రొక్కింది. ప్రపంచంలో ఇతరత్రా కూడా యంత్రాలయములు వెలసి యెగుమతులే ప్రారంభించడం వల్ల బ్రిటిషు

క్యాపిటలిస్టుల సరుకు విడుదల కానందువలన క్రొత్త మార్గము త్రొక్కి 'ప్రొటెక్షనిష్టు' అయి అటూవా కంచె పెట్టుకోవలసిన కర్మం దానికి పట్టింది. కాని బొండాల వాడు పార్లి పార్లి యేడ్చాడన్నట్లు అమెరికాకు కూడా యీ దరిద్రం తప్పింది కాదు. బ్యాంకు నిండా రొక్కము, కోట్ల నిండా దినుసులు, గోడౌనుల నిండా సరుకులు గల అమెరికా దేశములో ఈ మూడు మూర్తులూ ఒకరి నొకరు నమ్మి ఒకరిదగ్గర కొకరు పోగా ఎవరి గూట్లో వారు మూలుగుతూ ప్రజలందరి పొట్టలూ మాడ్చడము మొదలు పెట్టినవి. ఏమంటే ఏమి లాభము? ప్రజలు తిరిగీ తీర్చగలరన్న హామీ లేదు కనుక బ్యాంకుల వారు ఒక్క దమ్మిడీ పైకి తీయక ఎవరికీ ఇవ్వక, వడ్డీలు లేకుండా వున్న పనిన్నీ, ప్రాత బాకీలు రాకుండా వున్నవనిన్నీ యేడుస్తూ కూర్చున్నారు. డబ్బు లేక కొనుక్కునే ప్రజలు లేకపోవుట చేత ఫ్యాక్టరీల వారు సరుకులు పురుగులు పట్టనిస్తున్నారు గాని కావలసిన వారి కేమీ యీయరు. రావలసిన బాకీలు రాక యియ్యవలసినవి తప్పక చిన్న చిన్న బ్యాంకిలన్నీ దివాలా! తయారైన సరుకే చెల్లక, కూలీ లిచ్చుకోలేక ఫ్యాక్టరీలన్ని లాకవుటు! ఇక వ్యవసాయపు దినుసులు, ముడి దినుసులున్నా యంత్రాలే పడుకుంటే వాటి మాట లెవరికి కావాలి? ఆహార దినుసులు కొనుక్కొనుటకు డబ్బెవరి దగ్గర నున్నది? ప్రజలు చస్తే చావనీ కాని దుడ్డియ్యకుంటే తిండెవరు పెడతారు? పండిన పంటలకే యీ గతి పడితే క్రొత్తగా పండించడానికెవరికి గుండెలున్నవి? ఇట్టి పరిస్థితిలో ప్రజలు రష్యాలోలాగ సమిష్టివాదులై తిరగబడి దోచుకొని సరీగా పంచుకోవడం తప్ప వేరే త్రోవ లేకుండెను. అయితే అమెరికా పెట్టుబడిదార్లు ప్రభుత్వము వారు బ్యాంకర్లు రష్యావారంత మూర్ఖులు కారు. హిందూదేశం నాటుకోమట్లు, ఆర్యవైశ్యులు, కళింగకోమట్లు లాగ ఏ వొడ్డు కావొడ్డు కాచుకొని బాకీదార్లను నిలబెట్టి తామునిలబడి మళ్ళీక్రమంగా పిండుకొనే పద్ధతివాళ్ళు. వీళ్ళందరినీ కూడకట్టుకొని ప్రెసిడెంటు రూజువెల్టు సర్వాధికారత్వము పొంది ప్రజలందరి చేత వొప్పిస్తూ క్రొత్త క్రొత్త యేర్పాటులు చేస్తూ రాజ్యాన్నంతటినీ కోలుకునేటట్లు చేస్తున్నాడు. బ్యాంకిల వాళ్ల దగ్గర తాము పూచీ పడి కోట్ల కొలది ద్రవ్యము వడ్డీకి వాడుతుండడం చేత వాళ్ళు సంతోషిస్తున్నారు. ఈ ద్రవ్యముతో కొత్త రోడ్లు పోయించి, అడవులు నరికించి, యిళ్లు కట్టిస్తూ వుండడం చేత

ప్రజలకు పని దొరికి, ధనము చిక్కి, తినుబడి పదార్థములు కొనుక్కోగలిగి సుఖవసతులు లభించడం చేత వాళ్ళు సంతోషిస్తున్నారు. వ్యవసాయదార్లకు లంచాలిచ్చి లక్షల కొలది యెకరములు సాగులు తగ్గించి చెల్లుబడి కాని దినుసుల ఉత్పత్తిని తగ్గించి ఉన్నపాటి దినుసుల వెలలు హెచ్చించి కొనుక్కునే వాళ్ళను సృష్టించడం వల్ల వారు సంతోషిస్తున్నారు. ఇళ్లు, వాకిళ్లూ కుదిరి తిండి తిప్పలు దొరికి, పైగా కొంత డబ్బు మిగిలితే దానితో ప్రజలందరూ యంత్రకారుల దగ్గర నుంచి తయారగు సరుకును కొనుక్కుంటున్నారు కనుక, తమ సరుకు కదులుతున్నది కనుక, ఫ్యాక్టరీల వాళ్ళు సంతోషించడమే కాకుండా క్రొత్త ఫ్యాక్టరీలను కూడా కట్టుకోగలుగుతున్నారు. వాళ్ళకు నచ్చచెప్పి రూజువెల్టు వారిచేత పనిచేసే గంటలు తగ్గించి, కూలీలు హెచ్చించి, క్రొత్త వారిని పనులలో చేర్పించి నిర్వ్యాపారత్వమును తగ్గించగలుగుతున్నాడు. ఇది వరలో శ్రీమంతమైన అమెరికా చిక్కులు పడుతున్నదంటే సంతోషించే దేశాలన్నీ, కోలుకుంటున్న అమెరికా తమ వస్తువులను తెప్పించుకొని తమ దుస్థితిని కొంచెం తగ్గించకుండా తనలో తాను సరిపెట్టేసుకుంటున్నదే అని ఓర్వలేకుండా వుంటున్నారు. ఇదీ అమెరికాలో జరుగుతున్న ప్లానింగు, లేక ప్రణాళిక.

ఇవన్నీ మానవుడి ప్రణాళికలు. మానవుడి ప్లానులన్నీ తాననుకున్నట్లే సాగుతూ వుంటాయి అనుకోకూడదు. ప్రకృతి జన్యులమై పరిమిత బుద్ధి యోచనలు గల మనమే యిటువంటి ఉత్కృష్ట విప్లవములూ మార్పులూ తెస్తూ వుంటే మనకంటే అనేక రెట్లు వెట్టివికారాలు కలిగిన ప్రకృతికి వీనిని పాడుచేయుట అనగా నెంత? లేదా సాయము చేయుట అనగా నెంత? రావణాసుర ప్రయత్నాలు చేస్తూ వున్న రష్యాలో అనావృష్టి కలిగి తెల్లరొట్టె ధర పెరిగి ఏప్రిల్ నెలలో 10 లక్షలు జనులు మరణించినట్లు తెలుస్తున్నది. పండిన పంటలు చెల్లక వాటికి ధరలు కల్పించుటకై భగీరథ ప్రయత్నము మీద లంచములిచ్చి గోధుమ సాగు భూమిని లక్షల కొలది యెకరములు తగ్గించిన అమెరికాలో వేడిగాలులు వీచి పంటలు తగ్గి కాటకములు కలిగే సూచనలవుపిస్తున్నవి. కాని ధైర్య స్థైర్యములుగల ప్రెసిడెంటు తగిన ప్రతి క్రియలు చేస్తానని చెప్పుతూ ప్రజలందరికీ ధైర్యోత్సాహములు పురిగొల్పు తున్నాడు. జర్మనీ, ఇటలీ మొదలగు తక్కిన అయిరోపా దేశములన్నీ

అనవసరపు పరుగులు పెట్టక, అయోగ్యముగా క్రుంగిపోక, వీలయినంత లేస్తూ, సాధ్యమైనంత వరకు తమ యెగుమతులతో చుట్టూ యెగబ్రాకుతూ అల్లికల్లోలము పడుతూ వున్నది. ఆసియా ఖండము చూస్తే జపాను విజృంభణమునకు అంతూపొంతూ లేదు. జానా బెత్తెడు ద్వీపాలలో నుంచి చీమలపుట్టలు లాగా ప్రజలు పుట్టుగొస్తున్నారు. వారందరికీ భీషణ సైనిక కవాతు. కొరియా మంచూరియాల నాక్రమించుకున్నది. చీనాను మ్రింగ చూచుచున్నది. రష్యా పైకి పిల్లి దూకుళ్లు దూకుచున్నది. అంతర్జాతీయ సమితినే కాదు, అఖిల పాశ్చాత్య సమితిని, హడలగొట్టుచున్నది. యుద్ధ నౌకలు, విమానములు పెచ్చు పెరుగుచున్నవి. దీనికి తోడు ఉపద్రవమైన పంటలు పండిస్తూ, యంత్రాలతో సరుకును తయారుచేస్తూ ఎంతేసి టారీపు గోడల నయిన అవలీలగ దాటేసి కారు చౌకగా ప్రతీదేశంలోనికి దించుతూ "ఇదం బ్రహ్మ మిదం క్షాత్ర" మన్నట్లు "ఇదం యుద్ధం ఇదం వర్తక" మని ప్రళయతాండవం చేస్తున్నది. తక్కిన మనమూ, మన పెద్దన్న గారగు చీనా, తక్కిన చిన్న తమ్ములగు ఆఫ్ఘనిస్థానము, అరేబియా, పెర్షియా మొదలగు దేశముల మాటనా? మన కాలోచనలు తక్కువ లేవు కాని అంకుశా లెక్కువగా ఉండి అణచి పెట్టుచుండుట చేత అదృష్టవంతుల ఆటలన్నీ మనమీదే సాగి వచ్చి మన మధోగతులపాలై, అఘటన ఘటనా సమర్థుడగు పరమేశ్వరుడెట్లా చేస్తే అట్లాగే కానీ అని పరిపూర్ణ వేదాంతులమై బాధలు పడుతున్నాము.

మన హిందూ దేశమునకు తల్లిపట్టే కాని పిల్లి పట్టేమి లేకున్నది. మన మొత్తులన్నీ, మొత్తులలాగే వున్నా, మనపై నవ్యాజ ప్రేమగల ప్రభుత్వము వారే మైనరు తరపున బాధ్యతలన్నీ వహించి మన కోసం ప్లానింగులు చేస్తున్నారు. తలగల మగాళ్ళంతా జైళ్లలో క్రుంగుతున్నప్పుడు మొలలేని సభ్యుల నందరినీ ముఖ్యులుగా చేసి ఒక ఆర్డినెన్సు శాసనాలా, అట్టావా ఒడంబడిక చట్టాలా, తెల్లకాగితాని కంగీకారపత్రాలా, వారి యిష్టము వచ్చిన పత్రాల మీదల్లా బుల్లి దస్కత్తులూ, పెద్ద దస్కత్తులూ పెట్టించుకున్నారు. ఇందువలన దేశమునకు స్వాతంత్ర్య బంధనమే కాక, పరిశ్రమలకు రక్షణ బంధనము కూడా తొలగినది. అగ్గిపెట్టెల పరిశ్రమ అగ్గిపాలౌతోంది. పంచదార పరిశ్రమ పంచలపాలౌతుంది. బట్టల పరిశ్రమకా ఒక ప్రక్కన జపానుకో

త్రోవ ఏర్పరచి ఒక ప్రక్కన తమ తలుపులు బాహాటముగా తెరచుకొన్నారు. ఇట్టి సహాయములో మన మిల్లులు కోలుకోవడం ఎట్లా? దీనికి సాయము సమ్మెలు. వానిని ముగించే ప్రయత్నముల నుండి పరాఙ్ముఖత్వము. మిల్లు పరిశ్రమలను గురించి అటావా ఒడంబడిక వుండనే వుంది. కనుక వేటి ప్లానింగు చేయుటకు వీలే లేదు.

ఇక గృహపరిశ్రమల నుద్ధరించడానికి ప్లానింగు, గృహపరిశ్రమలు సాధారణముగా మిల్లు పరిశ్రమలతో పోటీ కాగలేవు. మిల్లు పరిశ్రమలు హెచ్చితే గృహ పరిశ్రమలు మూలపడతాయని గత రెండువందల సంవత్సరముల నుండి జరుగుతున్న పారిశ్రామిక విప్లవమే తెలియపరుస్తున్నది.

మనదేశములో ఒక ప్రక్కన గాంధీ గారి ఖద్దరు తత్త్వము వలన ఇంకొక ప్రక్కన విదేశీ మిల్లుల వస్తువుల దిగుమతి ఒడంబడిక వలనా స్వదేశీ మిల్లులు క్షీణ ముఖము పడుతున్నవి గనుక, యీ గృహపరిశ్రమల వస్తువులైనా యిక్కడ వ్యాపింపజేసి వ్యవసాయకుల కుపవృత్తి గలిగించితే సహాయము కలుగుతుందేమో అంటే అదీ మంచి ఆలోచనే! హిందూ దేశమింకా పూర్తిగా మిల్లుతత్వములో పడలేదు గనక, హిందూ దేశస్థులకు ఇంకా గృహపరిశ్రమల వలన తయారయే వస్తువులను కొనుక్కొనుట యందభిలాష వుంది కనుక అట్టి పదార్థము లిక్కడ చెల్లించే యేర్పాటులు చేయడం, రెయిలువే రేటులు తగ్గించడం మంచి యెత్తే. కాని ప్రభుత్వము వారు తలపెట్టినదిది కాదు. గృహపరిశ్రమల అభివృద్ధికి సంవత్సరమున కెంతో కొంత స్వల్ప మొత్తమును శాంక్షను చేస్తూ వుండడము. ఈ వస్తువులే కొనుక్కోమని పాశ్చాత్యులను బ్రతిమాలుకొని వారికి వీటి యందభిరుచి పుట్టించుటకు ప్రయత్నించడము. ఈ రెండవది యెప్పటికైనా సాగుతుందని ఏ జ్యోతిష్కుడైనా పాశ్చాత్య దేశాల జాతకములు చూసి చెప్పగలడా? అయితే ఇందుకొరకు వాణిజ్యానుభవము గల పాశ్చాత్య ధీమంతులను పెద్ద జీతముల మీద యేర్పాటు చేయడము. వారి క్రింద రాష్ట్రీయోద్యోగస్థులు, వారికి సెక్రటరీలు, అనుచరులు మొదలగు వారితో ఒక చిన్న డిపార్టుమెంటు మనకు తప్పదు.

ఇంకో చిత్రమైన ప్లానింగు. ఇది మన హిందూ దేశమున కాహార భూతములైన వడ్లు, గోధుమలు, చెఱుకు మొదలగు వానిని గుటించిన

ప్లానింగు మనమేమో ఇండోచీనా, సయామూ, బర్మా, మొదలగు దేశాలలో పండివచ్చుచున్న వడ్లను బియ్యమును, కొనుక్కొనుటకుగాను మన దేశపు వరి గోధుమలు మొదలగు వానిని తగ్గించుకోవాలి. ఆ దేశములలో అవి భూరి పరిశ్రమల విధానంగా పండిస్తారు గనుక తక్కువగా పండించుటకు వీలు లేదు. దిగుమతి సుంకాలు విధించకుండా వానిని మనకు చౌకగా అంటకడతారు. లేకుంటే వారు మన మీద ప్రతిక్రియ చేసి యేమి నష్టము తెచ్చిపెడతారో అని దిగులు. అవి చవకగా వస్తున్నవి కనుక మన రైతు వాడి పంట చెల్లదు. వాని నాపివేసినచో ఇతని పంట మంచి ఖరీదుకు చెల్లి శిస్తులు సంతోషముగా చెల్లించుకొని అప్పూ సప్పూ తీర్చుకుంటూ, ఆనందముగా వుండగలడు. అయితే రైతువాడు ఏలాగున్న నేమి? సర్కారు(కు) శిస్తు రాదన్న భయము లేదు. భూమి పండకపోయినా, పంట చెల్లకపోయినా, అన్యత్రా కూలి చేసుకునైనా తెచ్చి పన్ను చెల్లించాలి. లేకుంటే యిల్లు వాకిలీ, వేలాం. అవి లేనప్పుడు భూమి వేలాం, క్రొత్తగా కొనుక్కున్న వాడెక్కడ నుంచైనా తెచ్చుకొని పన్ను కట్టుకోవాలి. లేకుంటే వాడి పనీ అంతే. ఈ విధంగా మాయదారి భూమిని నమ్ముకొని మనిషి తరవాత మనిషి దివాలా అవుతున్నాడు. వీరిని రక్షించడానికి ప్రభుత్వం యేదైనా ప్లానింగు వేయవద్దూ? రాట్నా లొస్తున్నాయి. బళ్ళు తోవలో నుంచి తియ్యండంటున్నారు. విదేశాల నుంచి చౌక బియ్యాలొస్తున్నాయి కనుక మీమీ వంశానుగతమైన పంటలను తగ్గించుకోండోయి అని ఒక సూచన వదిలేశారు. అలవాటైన పంట మానుకోవడం, అనుమానస్పదమైన పంటలు వేసుకోవడం. ఇంతకూ ఈ క్రొత్త పంట లేమిటో తెలియదు. దానిని విచారించేందుకు తగిన అనుభవజ్ఞులగు ఉద్యోగస్థులను యేర్పాటు చేస్తారు. ఈ సంగతులన్నీ మే 8వ తేదీన సిమ్లాలో జరిగిన పంటల నిర్ణయ సభలో టంగున తెగిపోతుందనుకున్నాము కాని ఇదేమి రష్యా, జపాను, అమెరికా, జర్మనీల ప్లానింగా? అదుగో అంటే ఆర్నెల్లు.

ఈ సమయంలో ఈ ఆలస్యమే చాలా ఉపకారంగా వుంది. అవక తవక ఆలోచనలకు సాయం అతిశీఘ్రం కూడా అయితే బ్రతకగలమా? విదేశీ వడ్ల మీద మణుగుకు ౦-౧౫-౦ లు, బియ్యం మీద రూ.౧-౪-౦ లు దిగుమతి సుంకం వేయవలసిందని ఒకరు సూచిస్తే వాళ్ళు మీ కొంప

ముంచేయ గలరని భోరుగారు హెచ్చరిక చెప్పేరు. మారకపు రేటు మార్చి నాణెములు హెచ్చించమంటే సాధ్యము కాదని తోసేశారు. క్రొత్త పంటలను గూర్చి ఆలోచించుటకు జనపనార, పత్తి, చెఱకు, కమిటీలు పరిశోధన పని చేస్తున్నాయి. మొత్తము పయిన ఈ సభాసమావేశమున కయిన ఖర్చులు దండుగైతే అయినవి కాని ఇందులో నష్టకరమైన తీర్మానములు ప్యాసు కాలేదు. వరిపంట ఇంకా హెచ్చించే ప్రయత్నాలు చేయరాదనుకున్నారు. అట్టి ఆలోచన మనకసలే లేదు. గోధుమ పంట తగ్గించాలన్న తీర్మానం కూడ నెగ్గలేదు. సభాఫలితములిప్పటి కేమీ లేకపోయినా, వీరి కమిటీలు చేసే విచారణల ఫలితంగా ముందు ముందు మంచి ఫలితములు కలుగవచ్చునని సంతోషిస్తూ పత్రికా రత్నములు అభిప్రాయములు వ్రాస్తున్నవి. ఇదీ మన ఇండియా ప్లానింగు.

*— భారతి, జూలై, 1934*

గ్రామ సంస్కారమునకు ముందు నగర సంస్కారమే ప్రారంభము కావలెను

# గ్రామ పునర్నిర్మాణమునకు ఒకే ఒక మార్గము

భారతదేశం గ్రామాలయం. నూటికి తొంభైమంది గ్రామాలలో నివసించే వారే. పట్టణయంత్ర కార్మికుల సంఖ్య కొంచెము లక్షలకు మించి యుండదు. కనుక ఇక్కడ యే సంస్కారం ప్రారంభింతామన్నను గ్రామముఖతా ప్రారంభమైతేనే అది నిజముగా ప్రజాహితోద్యమ మనిపించుకుంటుంది. కాని, నగరముఖతా వచ్చే సంస్కరణలన్నీ యే కొంచెము తరగతులకు చెందినవో అనిపించుకొనును గాని భారతప్రజాబాహుళ్య సంస్కరణము లనిపించుకొనవు. అందుకనే గాంధీ మహాత్ముని అసహాయోద్యమము మొదలుకొని కోఆపరేటర్ల సహకారోద్యమము వరకు సమస్త ప్రజాహిత ఉద్యమములు గ్రామములలో తిష్ఠవేసుకొనుటకే తంటాలు పడుతున్నది. కాని నగర సంస్కరణముతో తృప్తిపొందలేదు. ఆఖరుకు మన ప్రస్తుత వైసురాయి లిన్లితుగో ప్రయత్నములు కూడ వ్యవసాయపరిశోధన, పంటల వర్తకమునకు సలహా, ఆంబోతుల సరఫరా మొదలైన గ్రామీణసమస్యలకే యెక్కువగా సంబంధించుచున్నవి. కాని పట్టణముల మీద మితిమించిన దృష్టిని పెట్టుకోలేదు.

భారతదేశములు నేడు శిథిలములై సంస్కరణమునకు సాధ్యములా అన్న అనుమానమును గూడ మనకు కొలుపుతున్నవనుటకు సందేహం లేదు. వాటి ప్రాచీన వాసనలా వదలిపోయినవి, క్రొత్త సంస్కరణములా పూర్తిగ అంటకుండా ఉన్నవి; ప్రాత సంపదలు సంతృప్తి చెరిపివేయబడినవి, క్రొత్త సౌభాగ్యము దర్జా అంటలేదు.; ప్రాత ఆచారములు పాడుపడినవి, క్రొత్త అభ్యాసములు మనస్కరించకుండా ఉన్నవి. ఇట్లు అవి రెండింటికీ చెడ్డ రేవడులలాగ నున్నవి.

వీటన్నింటికి సాయం కులకక్ష లొకవైపున, తరగతి యుద్ధభావము లొకప్రక్కన వానిని పీడించుచున్నవి. అన్నిటికీ మూలకారణం దారిద్ర్యం. కక్షలు పోయి పరస్పర సహకారం వర్ధిల్లితే కాని సంపదలు సౌభాగ్యం రావు. సౌభాగ్యం వచ్చే ఆశలు లేకుంటే పరస్పర సహకారం వర్ధిల్లదు; నీతి కుదిరితే కాని భుక్తి కుదరదు, భుక్తి కుదిరితేనే కాని నీతి వైపు ఆలోచనే వెళ్ళదు.

మూబరా ఖర్చులు తగ్గి మితవ్యయపారీణులైతేనే కాని ప్రజలకు అప్పు పుట్టదు, పుట్టినా మరింత దండుగ చేటు, అప్పు అన్నది పుట్టితేనే కాని బతుకే దుర్భరం. ఈ విధంగా విత్తుముందా చెట్టు ముందా అన్న ప్రశ్నవలె ఉన్నది గ్రామస్థుల సమస్య.

ఇది ప్రపంచమంతటికీ కూడ ఐకమత్యతకు, పరస్పర సహకారముకు, లోక శ్రేయోబుద్ధికీ సమయము కాని దురాశలకు కుత్సితపు ఎత్తులకు పంటెత్తు గుణములకు కాలము కాదు. వర్తకపు పోటీ ద్వారా కొన్ని దేశములు, సామ్రాజ్య పిపాస ద్వారా కొన్ని దేశములు ఇంతవరకు తమ సాధన సామాగ్రినంతటిని జాగ్రత్త పెట్టుకొని ఏమరియున్న జాతులను ఇష్టము వచ్చినట్లు పీడించియు దోచియు ఉన్నత నాగరీకతా సౌధాగ్రమునందు ఊగులాడగలిగినవి. కాని అన్యులకన్యాయము చేయుటవల్ల వచ్చే వైభోగము ఎన్నటికైనా కూలక తప్పవు. వీరభటసామ్రాజ్యములు విరిగిపోయినవి, మతైక సామ్రాజ్యములు మంటగలసినవి, వర్తక సామ్రాజ్యములు నేడికంను విఱ్ఱ వీగుచున్నవి గాని అవి చేయుచున్న అన్యాయములు తక్కినవి చేసిన అన్యాయములకంటె వేయిరెట్లు ఘోరమైనవి గనుక అవి కూడా నిలువున నీరసించుచున్నవి. అయినను వానికి పూర్వ పిపాస పోక మాయలు మర్మములతో ప్రపంచము నింకను మోసము చేయుటకే అవి ప్రయత్నించు చున్నవి. ఇట్టి మోసములవల్ల మరి కొంచెము కాలము ఈడ్చుకొనగలవేమో కాని స్థిరములు కాగలవనుట కల్ల.

ఈ సామ్రాజ్యములు వర్తకమును ఒక కళ గాను ధర్మముగాను నాగరీకతా చిహ్నముగాను నిర్మింపదలచినవి కాని వర్తకము నందున్న కళను ధర్మమును నాగరీకతను గూడ తుత్తునియలు చేసినవి. ఘోరమయిన దురాశకు అవి చీరగట్టి సింగారించి వన్నెలాడివలె మెరపింపచేసినవి; తుచ్ఛమైన మోసమునకు అవి ధర్మమను తొడుగు తొడిగి ప్రతి సభయందును ప్రజ్ఞ వలె పరిఢవిల్లజేసినవి. అనంతమైన హింసకు అవి ఆదరణమిచ్చి చట్టముల ద్వారాను కోర్టుల ద్వారాను కట్టుదిట్టములు జేసినవి. ఇదంతా తెలిసియో, తెలియకయో బ్రహ్మదేవుని కెఱుక కాని, దీనినంతటినీ ఆధునిక విజ్ఞానమని మాత్రము అవి సౌధ శిఖరములనుండి చాటుచున్నవి. పవిత్రమైన ఉపాధ్యాయ

వృత్తి మొదలు పరమోత్తమమైన మతాచార్యవృత్తి వరకు సర్వమును ద్రవ్యోపార్జనకు దర్జాజీవనమునకు కృత్రిమ కీర్తికి పీఠములుగా ఒనరింపబడినవి. ఏదో ఒకటి - అనగా మానమో ఆఖరుకు ప్రాణమైనా సరే - చదువో సేవో-నీతో ధర్మమో - అమ్ముకొని డబ్బు సంపాదించుకొంటూ దర్జాగా బ్రతుకుతున్నవాడు చెప్పే మాటకే విలువ ఉంది. కాని ఈ కృత్రిమ మార్గములు లేక ఆ దర్జాకు రాజాలని వాడు చెప్పే మాటలకు వెండ్రుక వాసి విలువ లేదు.

## క్లిష్ట సమస్య

ఈ మోస్తరు ప్రపంచపరిస్థితులలో గ్రామాలలో నిర్మల జీవనము నిర్మల విజ్ఞానము నిర్మలమగు ఆశయములు నెలకొల్పడమనేది మీది మీది మాటకాదు. ఒక ప్రక్కన దొంగలు దూరి యిల్లు దోచుకొంటూవుంటే యింకొక వరుసనుండి వెండి బంగారములు ఊరుకొంటూరావు. ఒక ప్రక్క నుంచి కుష్ఠ రోగము దేహము యొక్క అంగములను కొరుకుకొనిపోతూవుంటే ఇంకొక ప్రక్క నుంచి దేహమునకు జవసత్వములు పొటారిస్తూవుండవు. ఒక ప్రక్క నుంచి భూకంపము మేడలను మిద్దెలను నగరములను నిర్మూలము చేస్తూ వుంటే ఆ శిథిలములలో నుంచి క్రొత్త సౌధములు నగరములు పుట్టుకొంటూ రావు. ఒక ప్రక్క నుంచి గ్రామము లోని ధన ఆరోగ్య నీతి ప్రకృతి విలాస సంపదలను నగరములు కొల్లగొడుతూ వుంటే వేరొక ప్రక్క నుంచి ఆ గ్రామములలో అవి ఊరుకొంటూ రావు. రాఘవాస్వస్తి రావణాస్వస్తి అనుటకు వీలులేదు. నగరముల దృక్పథము మారకుంటే గ్రామములు యెత్తిరిల్లజాలవు. గ్రామసంస్కారమునకు ముందు నగర సంస్కారమే ప్రారంభము కావలెను. నగర సంస్కారమనగా మరిన్ని మరలు, మరిన్ని యంత్రములు, మరింత వర్తక దృష్టి మరింత దోపిడిమార్గము అని అర్థము కాదు. నగర సంస్కారణమనగా నగరముల నగరవాసుల నగరముల పెద్దల ఉద్యోగస్థుల దృక్పథము నందే సంస్కరణము. ఇది లేకుండా చెప్పే గ్రామ సంస్కరణపు మాటల వల్ల గ్రంథాల వల్ల ఉపన్యాసాలవల్ల మరింత ముప్పే కాని కించిత్తు ప్రయోజనము లేదు.

దేశములు దేశములను నగరములు పల్లెలను నాగరికులు అనాగరికులను యెంత వరకు దోచుకొని విఱ్ఱవీగుట కవకాశము గలదో అంతయు ఇంచుమించుగా పూర్తియైనది. ఉన్నవారు లేనివారు ఉన్న దేశములు లేని దేశములు అని ప్రపంచము రెండు ఘోరవిభాగములుగా చీలిపోయినది. లేనివారు ఏమీ లేదోయి అని యేడుస్తూ వుంటే, ఉన్నవారు అంతా నాకొక్కనికే వచ్చేసింది కాదోయి అని ఒకరితో నొకరు తన్నుకొంటున్ను తన్నుకొనలేకను యేడుస్తున్నారు. ఏడుపు లిద్దరికినితప్పలేదు. ఉబ్బరగా కొందరికి కోట్ల కొలది ధనము కూడినందువల్ల తక్కిన వారికి కళ్లుకుట్టి వారికాధనమెట్లయినను దక్కకుండాచేసి అందరికీ పంచేదామని వారు ఎదురుచూస్తున్నారు. తమ అన్యాయార్జిత సంపదను నిర్భాగ్యులెప్పుడు దోచుకొనిపోతారో అని శ్రీమంతులు ఆయుధములు తయారు చేసుకొంటు న్నారు. మొత్తము పైని యెవ్వరికి కాని మనస్థిమితము లేదు. అన్నిదేశాలకు నగరాలకు శ్రీమంతులకు గుండెలు బితుకు బితుకులాడుతున్నవి. పెందరాడే పెద్దలంతా తెమలుకొని ప్రాత అత్యాచారములనుండి విరమించి గ్రామ సంస్కారమునకు నిర్మల న్యాయమునకు సంతృప్త బుద్ధికి దిగినారా సరే, లేకుంటే కాగల కార్యమును గంధర్వులే చేస్తారు, రష్యాలో వలె యేదైనా ప్రళయము వచ్చి పడుతుంది. బలవంతాన వచ్చే ప్రళయాలు బలంతోనే అనగా ఆయుధబలంతోను డిక్టేటర్ల దుర్ణయముల తోను జనుల భీతి అనుమానములతోను నిలబడవలసినవే కాని శాంతం మీద స్నేహం మీద నిలబడడం కష్టము. గాంధీ మహాత్ముడు రవీంద్రనాథ టాగూరు గారలు భారతదేశ ప్రాచీన సంప్రదాయములను నవీన సూత్రములతో మేళవించి, షయిగాను శాంతినికేతనాశ్రమములద్వారా నగరముల దృక్పథములు మార్చి తన్నివాసులలో గ్రామ శ్రేయోవాంఛ నంకురింపచేసి నగరములకు నూతన సంస్కరణము నిచ్చి తన్మూలమున గ్రామనగరములమధ్య స్నేహబాంధవ్య భావములను నిలిపి రెండింటిని తరింపజేయుటకు సంకల్పించుకొని యున్నారు.

## నూతన దృక్పథమననేమి?

నగరముల దృక్పథము మారుట అనగా అర్థమేమి? అట్లు మారినయెడల అవి గ్రామముల పురోభివృద్ధి కెట్లు సహకారమును చేయగలవు? ప్రస్తుత

నాగరికత ప్రకారము గ్రామములను దోచుకోక పోతే నగరములకు స్థానమే లేకున్నదిగదా, ఇట్టి స్థితిలో అవ్వాబువ్వ అన్నట్లు నగరములు గ్రామములు రెండూ కూడా యెట్లు బాగుపడుటకు వీలుగలదు? అను సందేహములు పెక్కురకు కలుగవచ్చును. కాని ప్రస్తుత వర్తక నాగరికతా దృక్పథమును కాస్త మార్చుకొని తిలకించినచో నగర గ్రామములు బద్ధ శత్రుత్వముతో వర్తిల్ల వలసిన అవసరము లేదని తేటపడగలదు. దేశ సంపద యనగా నగర సౌధముల ఔన్నత్యము కాదనిన్నీ గ్రామవాసుల సౌభాగ్య విలాసములే అనిన్నీ నగరములు గుర్తించవలెను. గ్రామములు క్షీణించుట ద్వారా నగరములకు వచ్చే శోభలు గర్హ్యములని భావించి వానిని మూజూచుటకు కూడ అవి అసహ్యించుకొనవలెను. గ్రామముల కోసం నగరములు కాని నగరముల కోసం గ్రామములు కావని నగరములు నమ్మవలెను. ఈ విశ్వాసము బాగా నగరములలో పాదుకొనియున్నచో గ్రామపరిశ్రమలను నాశనముచేయు లక్షలకొలది ఫ్యాక్టరీలు నగరములలో నెలకొల్పబడవు. బోలెడంత పెట్టుబడిమీద వల్లిమాలినంత చౌక సరుకు నుత్పత్తిచేసి అవి గ్రామములలోకి యెగుమతి చెయ్యవు. దళారీ కమీషను కొరకై ఆశపడి విదేశీ వస్తువుల నింత యెక్కువగా దిగుమతి చేసుకొని తాము పాడై గ్రామములను పాడు చేసి యుండవు. ఫ్యాక్టరీ సరుకంత చౌకగా గృహపరిశ్రమల సరుకు ఉండజాలదని గుర్తించి, కాస్త యెక్కువ ఖరీదైనా చెల్లించి మోటుగా వున్నా సరే గ్రామాల వస్తువులనే అవి కొనుక్కొని, వాని నుండి వచ్చుచున్న పంటలను తాము తినుచున్నందుకు వాని ఋణమును కొంత తీర్చుకొని సార్థక జన్మలమైనామని భావించి యుండును. నగరములు నేడు గ్రామములను పలుముఖములుగా దోచుకొనుటయే గాక, గ్రామములోనే గ్రామ ద్రోహులగు చిల్లరవర్తకుల నెందరినో నెలకొల్పి గ్రామ పరిశ్రమలను రూపుమాపుచున్నవి.

దేశమునకు కీర్తిని తెచ్చిపెట్టేది పట్టణములోని ఫ్యాక్టరీలసంఖ్య, ఫ్యాక్టరీ సరుకునకు దుకాణముల సంఖ్య, వాటి యేజన్సీల సంఖ్య, రూపాయీలు అణాలు పైసలు లాభముల బ్యాలన్సుషీటుల సంఖ్య కాదనిన్నీ, ఏదేశపు గ్రామ పరిశ్రమల వస్తువులు ఆ దేశపు నగరవాసుల భోగములకు సరిపడునో ఆ దేశమే నాగరికదేశావతంస మనిన్ని నగరములు నమ్మవలెను. ఇది ప్రస్తుతం

మనకు కావలసిన క్రొత్త దృక్పథము. పాశ్చాత్య నాగరికతకు ఈ సూత్రము విరోధము కావచ్చునేమో కాని మనదేశపు నాగరికతకు అట్లు కాదు. పాశ్చాత్య నాగరికత చరిత్ర అంతా పెద్ద వాళ్ళు చిన్న వాళ్ళను తన్నడము, చిన్న వాళ్ళు పెద్ద వాళ్ల మీద తిరగబడి చంపడం ఈ విధంగా రాజులు ప్రభువులు, ప్రభువులు శ్రీమంతులు, శ్రీమంతులు దరిద్రుల మధ్య యుద్ధములతోనే తెల్లవారుచున్నది. కాని స్నేహసూత్రము యొక్క సారస్య మింత వరకు వారికి బోధపడలేదు.

## పాశ్చాత్యశిక్షణ ఫలితములు

పాశ్యాత్యుల కట్టకడపటి సుగుణము వారి సుశిక్షణము లేక డిసిప్లీను, ఈ డిసిప్లీను వల్లనే వారిలో ఐకమత్యమేర్పడి నల్లజాతులను దోచుకొని పీడింపగల్గుచున్నారు. ఈ దురాశ ధర్మమంటూ వారిలో వారు కొట్లాళ్లు తన్నుకోవడం మానినారు. గాని ఈ దోపుడు వల్ల వచ్చే సంపదలను పంచుకోవడంలో ఒకొక్క దేశములోని వివిధ తరగతుల మధ్య వంతులు తెగక ఆ డిసిప్లీను అనే సుగుణము కూడా బీటవారిన గోడలాగ విరిగి పిన్న పెద్ద ఉభయుల మీదను పడుచున్నది.

పాశ్చాత్య నాగరికతా సంపర్కము తన్మూలమున వచ్చిన దారిద్ర్యము పోటీల వల్లనే మనదేశములో వర్ణకలహములు, కోర్టు యాత్రలు, వర్తకపు మోసములు, ఫ్యాక్టరీల దురాశలు ప్రబలినవికాని అంతకు ముందు లేవంటే చాలామంది ఇప్పుడు నమ్మనిస్థితిలో మనమున్నాము. భేదములు లేకుండా ఏ సంఘము ఉండగలదు? వ్యక్తి భేదమో, స్త్రీ పురుష భేదమో, వృత్తి భేదమో, కులభేదమో, అమ్మేవాడు కొనేవాడు భేదమో, యువక వయోజన భేదమో, రాజ ప్రజభేదమో, ఆచారం అనాచారభేదమో యేదో ఒక రూపమున యేదో ఒక భేదమెక్కడ లేకుండా ఉండగలదు? భేదములుండుట సృష్టి దోషణము కాదు, ప్రకృతి సుగుణమే నేమో? ఆ భేదకారణముగా ఇతరుల దుర్బోధనలు విని మనలో మనము తన్నుకోవడంలో తప్పు యింకెందులోనైనా దోషమున్నదనుకొనుట పొరపాటనిపించును. ఇటువంటి చెడు దృష్టి మారిపోయి మనలో మనకు సమరస మేర్పడకపోతే మనకు

ముక్తి రాదన్నమాట నిశ్చయము. మనలో పెక్కు భేదములున్నవి. కనుకనే మనమందరము ఒకటి అని పాడిన రవీంద్రుని గీతమును మనము స్మృతికి తెచ్చుకొనవలెను.

నగరముల దృక్పథము మారితే అవి యెట్లు గ్రామములకు సహాయము చేయగలవో చూచితిమి. గ్రామముల దృక్పథము మారితే అవి తమ భేదము లను పరుల దుర్బోధవల్ల కలిగిన క్షుద్రదృష్టితో కాకుండా సమరస పరస్పర సహకార దృష్టితో తిలకించి ఐకమత్యముతో వర్తించగలవు. మనకు కావలసినదంతా పాశ్చాత్యపరిపాలనా ప్రారంభము లగాయతు జరుగుచున్న అనుమానములు దుష్ప్రచారము తొలగుటయే. మనకు సవ్యముగ విజ్ఞానముద్వారా ఐకమత్యము కుదిరెనేని స్నేహము, సంపద, భోగము, సౌభాగ్యము, ఆరోగ్యము, బలము వర్ధిల్లి ప్రపంచమునకు మన గ్రామముల ద్వారాను నగరముల ద్వారాను కూడ మనము ఆదర్శము కాగలము. ఈ ఆదర్శము నవలంబించేవారు అవలంబించవచ్చును. అవలంబించనివారు మునుపటిలాగే మరొకసారి మనమీద దాడి వెడలివచ్చినను, మనము తాళుకోగలుగుతాము.

*ప్రజామిత్ర, ప్రత్యేక సంచిక, 1939*

# వాణిజ్యం ☆ అరాచకం ☆ విరుగుడు

మనకు స్వాతంత్ర్యం వచ్చి సంవత్సరము గడచినది. కాని కరువు కాటకాలేమీ తగ్గలేదు. మరియు ధరలు దిన దిన ప్రవర్ధమానమగుచున్నవి. ఏ వృత్తిలో నైనా నిలకడగా యెంత సంపాదించుకున్నా నిముషములో హరించిపోవుచున్నది. వర్తకం చేసుకొని దొంగలాభాలు కట్టుకొనే వారికి తప్ప యెవరికీ యేమి మిగలకున్నది. ఏవో మోసపు మాటలు చెప్పి ఇతరుల వద్దగల ధనమును దోచేవారికి తప్ప నిజముగా కష్టపడేవారికి రోజు గడియకున్నది.

అందరూ అందలము నెక్కే వారే అయితే మోసేదెవరు? అందరూ వర్తకులైతే కొనుక్కునే వారెవరు? అందరికీ వర్తకము సాగించే మెళుకువలు, టప్పాలు కొట్టి ధనము తీయగల అవకాశములు లభించునా? అట్లు లభించే అవకాశము పూర్వము నూటికి పది మందికి కలిగితే ఇపుడు మహా అయితే నూటికి ఇరువది మందికి కలుగుచున్నదనుకోవచ్చును. తక్కిన యెనభై మంది పొట్టలను ఈ యిరవై మంది కొట్టి బాగుపడుచున్నారు.

ఆ యిరవై మందిలో నలుగురు మండీ వర్తకులు ..... వర్తకులు ..... వారికి లక్షల కొలది లాభములు వస్తే తక్కిన వారికి వందల కొలది లాభములు వచ్చుచున్నవి. ఎవరికెట్టి లాభములు వచ్చినా వినియోజకుల నెత్తి కొట్టి తీసుకున్న బాపతే కాని సవ్యమైనవి కావనుట నిక్కము.

ఈ కాటకమున కంతటికిని కారణమేమిటి? సరుకులు తక్కువైనందువల్ల ఖరీదులు హెచ్చుచున్నవా? ఖరీదులు హెచ్చుటకొరకు వస్తువులు కనపడ కుండుటయు, చివుకుటయు, కుళ్ళుటయు, తప్పని సరియైనప్పుడు మాత్రమే సరుకు కనబడుచున్నదా?

వీధిలో యే దుకాణములను చూచిన మునుపటి ధాన్యరాసులకు బట్టల మోపులకు, కూరల పోగులకు, దినుసుల తిప్పలకు తక్కువగా లేవు గ్రామాలలోని సంతలను చూచినా యీ విధముగానే ఉన్నవని అనుకోవచ్చును.

మునుపటి కంటె సరుకే మాత్రమును తగ్గలేదు. ఆ మాత్ర మీ మాత్రము

తగ్గినా విదేశముల నుంచి తెప్పించి భర్తీ చేయుచున్నారు. అన్నీ వుండి ఐదవతనము లేదన్నట్లు ఇంత సరుకూ వుండి యీ కాటక మెందుకు కలగాలి?

ఇది సరుకు లేనందువల్ల కలిగిన కాటకము కాదు. వర్తకులు పేరాస మరగి, పెద్ద ఖరీదు లిచ్చిన వారికి తప్ప సరుకును అమ్మకపోవుచున్నందువల్ల కలుగుచున్న ముప్పు అంత పెద్ద ఖరీదు లిచ్చి జనులు కొనుక్కోజాలకున్నారు.

పూర్వము చిన్న ఖరీదులున్న రోజులలో సరుకంతా విక్రయము కాకపోతే వర్తకులకు నష్టము వచ్చేది. అట్టి నష్టమును భరింపజాలక స్వల్ప లాభము లతో తృప్తిపడేవారు. సరుకును చౌకగా అమ్మి విడుదలచేసుకొనేవారు, ఆ వచ్చిన డబ్బుతో తిరిగి సరుకుకొని అమ్ముచుండుట వల్ల సరుకు విరివిగా చేతులు మారుతూ అందరికి తృప్తిని గూర్చేది.

కాని ఇప్పుడల్లాగా గాదు.సరుకు ఎంత విస్తారముగా ఉన్నా పెద్ద ఖరీదు లీయగల వారికి తృప్తిగా యెక్కి దొక్కి దొరకడం, ఇవ్వలేని వారికి కడుపుమాడడం తటస్థించుచున్నది. వర్తకుల లాభము మాటా, వారు కోరిన పెద్ద ఖరీదు లీయగల వారు ఏ వందమంది ఉన్నా వారి చేయి వదలిన సొమ్ము ............ పెద్ద లాభము కూడా వస్తున్నది. తక్కువ సరుకు విడుదల కోసం ఆ సమయమున నాకు ఖరీదులు తగ్గిస్తే, మొదటి ఖరీదులు చెల్లించే వారి వల్ల కలిగే లాభాలు వారికి సున్న చుట్టును. వారు కోరిన పెద్ద లాభాలు వారికి వచ్చిన తరువాత, తక్కిన సరుకు చెల్లకపోయినా వారికి నష్టము లేకపోయిన తరువాత, జనులు ఆకలి అవసరములు తీరుటకొరకు వారేల ఖరీదులు తగ్గిస్తారు?

ఇంతకూ తక్కిన ఖరీదు మాత్రము బొత్తిగా చెల్లక పోవడముండదు. కడుపు మాడుతున్న వారు ఇల్లువాకిళ్ళు పెళ్లాం పిల్లలను అమ్ముకొనియైనా ఆ పెద్ద ఖరీదు నిచ్చి కొనుక్కొని తీరుతారు కాని చూస్తూ చూస్తూ చావనొల్లరు. చేతిలో పుష్కలముగా డబ్బున్నవారు ముందుగానే కొనుక్కొంటారు కనుక వారికి మంచిదినుసు లభించుతుంది. తక్కినవాళ్ళు పెక్కు యీడుపోతలు పడి డబ్బు జాగ్రత్త పెట్టుకోవలసి ఒక్క దఫాను కొనుక్కోలేక ఉండీ ఉడిగీ కొనుక్కోవలసి వస్తుంది కనుక అదే పెద్ద ఖరీదుకు అ వుప్పిసరుకు వారికి లభించి వారి ననారోగ్యంపాలు అర్థాయుస్సు పాలు చేయును. మరియెవరు

కొనుక్కోలేని సరుకును తూము కాలువలలో పోసినా వారికి కలిగే కుందక మేమీ లేదు.

వాణిజ్య విధానములో ఇంతకంటె అరాచకము లేదు. ఈ అరాచకము వల్లనే వర్తకులు బాగుపడుతూ, ప్రభుత్వానికి పెద్ద పన్నులు చెల్లించి, అది ఖర్చులు భరించి సాగుటకు సాయపడుతున్నారు. కనుక, ప్రభుత్వములు రహస్యముగా వారినే బలపరచుచున్నవి. ఇట్లు వర్తకులును ప్రభుత్వములును కలిసి ప్రజల ప్రాణమానములు హరించుచున్నారు. ప్రభుత్వములు వర్తకులు చేస్తున్న ఈ అరాచకము నింత సహిస్తూ కూడా, ప్రజలిందుకు విరోధముగా ఏమాత్రమాందోళనము చేసినను చెవిని పెట్టకుండుటయే కాక, వారినే అరాచకులుగా భావించి కేసులు పెట్టి జెయిలు శిక్షలు విధించుచున్నారు.

ఇదంతా ప్రభుత్వముల లోపముకాక వేరు కాదనుట స్పష్టము. ప్రజలలో అరాచకమనుకోనేదానిని అణచుటకు ఇన్ని ఆర్డినెన్సులు ప్యాసు చేస్తున్న ప్రభుత్వములు వర్తకులు చేస్తున్న ఈ అరాచకము నణచడానికి ఒక్క ఆర్డినెన్సు ప్యాసు చేయజాలరా? ఆ అరాచక మణగితే ఈ అరాచకము సమ్మెలు మొదలైన వేవీ కలికానికైనా కానరాకుండ హరించేవే !

రేషనింగు కంట్రోలు ఉన్న రోజులలోనే కాస్త నయముగా వుండేది. చాలీచాలని తిండి బట్టయైనను అందరికీ వుండేది. గాంధీ మహాత్ముని ఆందోళన వలన కంట్రోళ్లు తీసినప్పటినుంచి ఖరీదులు నాలుగురెట్లు పెరిగినవి. వర్తకులలో ఏదో నీతి వున్నదనీ, దానినిబట్టి ప్రజాశ్రేయస్కరమై తమ కనుకూలమగు లాభములు కలిగేటట్లు, వర్తకులు అమ్మగడంగుదురనియు గాంధీజీ భ్రమపడినాడు. ఆభ్రమ విచ్ఛిన్నం కాక ముందే ఆయన మరణించాడు.

తిరిగి కంట్రోళ్ళు పెట్టడమా మానడమా అనే సమస్యలో ప్రభుత్వములు పడినవి. కంట్రోళ్ళు రేషనులు పెట్టినా పెట్టకపోయినా కూడా ప్రజలకు నష్టమే. రేషనుంటే దొంగబజారులో కొనుక్కుని దొరికి జెయిళ్ళ పాలు కావాలి. లేకుంటే బహిరంగ బజారు ఖరీదులు చెల్లించలేక జనులుమాడాలి.

ఇందుకై ప్రభుత్వములు వర్తకులపై చర్యలకు పూనుకోవాలి. ప్రాతవారి

కెవరికినీ లైసెన్సు లివ్వడం మానేసి ఋజువర్తన గల కొత్త వారికి లైసెన్సు లియ్యాలి. అట్టి వారెవ్వరూ దొరక్కపోతే ప్రభుత్వ చర్యలు మానుకొని ప్రజలకు వర్తకం తామే సాగించాలి.

అయితే ప్రభుత్వాలే వర్తకానికి పూనుకుంటే వర్తకులను కరచిన పామే వారిని కూడ కరుస్తుందేమో! వర్తకుల మీద చర్య తీసికొనుటకై (తీసుకున్నా తీసుకోకపోయినా) ప్రభుత్వమొకటి వేరే యేదో ఉన్నదన్న భరోసాయైనా ఉంటుంది. ప్రభుత్వమే ఇటువంటి వర్తకానికి దిగితే ఆకాస్త భరోసా కూడా పోతుంది.

మహా నిస్వార్థియైన త్యాగపురుషుడు, రాజకీయ పరిజ్ఞాన వేత్త, కఠిన చర్యా సమర్థుడగు వ్యక్తి యొకడుద్భవించి కార్యక్రమమునకు పూనుకోకుంటే ఈ అరాచకమణగదు. అతడే మనపాటి కల్పకమై రక్షకుడై అలరారుతాడు. ప్రస్తుతం నడుస్తున్న ప్రజా పరిపాలనా విధానము పై రీతిగా బూటకమై యున్నది కనుక అంతటి అవతారమూర్తి ఆగమనకే భారతజాతి నిరీక్షించు చున్నదా అనిపించుచున్నది. అట్టి అవతారమూర్తి ఇప్పుడు కనిపించక పోతే ఆశ్చర్యము కాని, అవతరించి ఈ తుచ్ఛ విధానము నంతటిని తుత్తునియలు చేసినచో ఆశ్చర్యమేమి లేదు. ఈ అజ్ఞాన రంగమున అది యొక్కటియే భిక్షాదాన విధానము.

*ఆనందవాణి, 1948, ఆగస్టు 15.*

# పూర్వపు బానిసత్వం నేటి ధన బానిసత్వం

ప్రపంచంలో ఒకప్పుడు బానిసలంటూ ఒక రకం మనుష్యులుండేవారట. పురాణయుగంలో వారిని గురించి మన మట్టే వినకున్నా చారిత్రక యుగంలో వారు పడిన బాధలను గురించి చదివినాము. ముఖ్యముగా రోమను సామ్రాజ్య దినములలో రోమను నాయకులు రాజులు తాము జయించిన దేశాలలోని, ప్రజలలో కొందరిని మృగాలలాగా చూచి, తమ కామాలు వినోదాలు తీర్చుకొనేవారు. తప్పేల ముంతలను లాగేవారిని అమ్మడం కొనుక్కోవడం అసంఖ్యాకులగు వారిని కట్నాలు కానుకల క్రింద చదివించడం జరిగేది.

సాధారణ బానిసలకు అది అలవాటు పరిపాటి అయినది కనుక వారందుకు ఏడ్వడం కూడా జరిగేది కాదు. కొందరు తమ ప్రభువుల వినోదాలతో పాటు తమ వినోదాలు కూడా తీరినట్లే భావించి అందుకు ఉపకరించేవారు. కొందరు ఆ బాధలు తప్పు కొనుటకై యత్నించి పట్టుపడి మరిన్ని పీడల కెరయగుచుండుటయు సంభవించేది.

అటు తరువాత మధ్య ప్రాచ్యంలో అరేబియన్ నైట్సు మొదలగు కథలలో వానిని గురించి మనము చదువుటయే కాక, అచ్చటి శ్రీమంతులు కూడా నిరంతర నిస్సహాయ దుర్బలురను కొల్లగొని సర్వ స్వాతంత్ర్యమును దులిచి తమ తృప్తిని తీర్చుకొనేవారు. కొందరు పురుషులను కొజ్జాలను చేసి తమ అంతఃపుర జనానా స్త్రీల మానరక్షణకై కాపలా పెట్టుకొనేవారు. సాధారణముగా సుఖవాసి వృత్తులను తామాచరించుచు మృగసాధ్యమగు కఠిన కార్యముల భారమును వారిమీద పెట్టి ఆ లాభములతో తాము విఱ్ఱవీగేవారు.

భారతదేశములో అట్టి దాస్యమున్నటుల పురాణం వల్ల గాని చరిత్రల వల్ల కాని కనిపించదు. దాస్య, దాస దాసీజన శబ్దములు గోచరించుచుండినను అవి తత్పాత్రుల అస్వాధీనమును బట్టి కాక ప్రభుభక్తి పరాయణత్వ సూచకములుగానే ఉండినట్లు తోచుచున్నది. పరదేవత యగు మహాలక్ష్మిని

"దాసీ భూత సమస్త దేవ వనితాం" అని వర్ణించారంటే, దేవ వనిత అంత అస్వాధీనలని కఠిన పరిపాలనా బాధితులని అర్థము కాదు. అయితే భక్తి గౌరవ సూచకం కావాలి, లేదా కేవలం అలంకారాతిశయోక్తి కావాలి. మహాభక్తులు పరమయోగులు కూడ పరతత్వ దాస్య బిరుదములను సగర్వముగ వినియోగించుకొనేవారంటే, అది వారి వినమ్రతను సూచించును. కాని పరమేశ్వరుని దౌర్జన్య చిహ్నము కాదు.

అయినా భారతదేశములోని వర్ణాశ్రమాది హెచ్చు తగ్గు భేదములను ఒక వర్గము ఇంకొక వర్గముపై స్వారీ చేయుటకై నిర్ణయించబడిన తంత్రముగా పరిగణించి, ఏదో ఒక రూపమున బానిసత్వమనేది మన దేశములో కూడా కలదని నిరూపించుట పాశ్చాత్య చారిత్రక పరిశోధకుల సంకుచితాభిప్రాయమై వెలిసినది. ఇంకను వెలయుచున్నది.

కాని ఈ వర్ణాశ్రమ ధర్మములు మానవుల అధికార తారతమ్యములను బట్టి, వృత్తి నైపుణ్య విచక్షణములను బట్టి నిరంతరాభివృద్ధికిని తన్మూలమున మోక్షసిద్ధికిని యేర్పాటు చేయబడిన సాధనమాత్రము అని యెట్టి వివేకికైనను గోచరింపక మానదు. అయినా కొందరు ఏక ప్రపంచపద్ధతి వాదులు ఈ విషయమున మనపుణ్యభూమి యగు భారతదేశము కూడా తదితర దేశముల తెగకే చెందినదను వాదనను పెట్టుకొని, దీనికి పరదేశములలోని బానిసత్వ లక్షణముతో ముడిపెడితే వారితో వాదించిన లాభము లేదు. వారి అభిప్రాయములు మారవు.

ప్రపంచములో ఎప్పుడో ఒకప్పుడు బానిస తత్వమును శ్రీమంతులు అనాదలపై చలాయించుచుండి రనుట నిర్వివాదాంశము. ఫ్యూడలుయుగములో అది ఒక మోస్తరు పాలక వర్గముల దర్జాగా పరిగణింపబడెను. ఫ్యూడలు యుగము పోయి ధనయుగము రాగానే అ బానిసలకు ప్రభు సేవక దర్జా కూడా పోయి కేవలం పనిముట్ల పరిస్థితి యేర్పడినది. హెచ్చు మంది బానిసలున్నవారు ఎక్కువ సరుకు నుత్పత్తి చేసి వ్యాపారం ద్వారా ఎక్కువ లాభములను చేదుకొనుట కుపాయమైనది. అప్పటి నుంచి యీ పనిముట్లు కావలసి వచ్చినప్పుడల్లా పరదేశములపై పడి అచ్చటి ప్రజల జయించి, వారిని తమ ఇష్టం వచ్చిన చోట్లకు తీసుకొనిపోయి బానిస చాకిరీ

చేయించుకోవడం పొరపాటు అయినది. లాభసాటి ఉత్పత్తి వ్యవసాయ పద్ధతులు ప్రారంభంకాగానే ఈ వ్యాపారము ప్రభువుల రాజుల చేతులలో నుండి జారి దారిపోయే వర్తకమ్మన్యుల చేతులలోకి వచ్చి, వారు వివిధ దేశములలో తిరిగి ప్రజలనాసబెట్టి లోగొని అన్య దేశముల సాహుకార్లకు అమ్మడం వ్యాపారం పెరిగినది.

అమెరికా, ఆఫ్రికా, మొదలైన దేశాలు మధ్యయుగములో, పెద్ద వ్యావసాయక పారిశ్రామిక శ్వేత రాజ్యములుగా వర్ధిల్లడానికి ఈ బానిస వ్యాపారమెంతో ఉపకరించినది.

అయితే వ్యాపార దేశముల మధ్య పోటీ వల్లనైతేనేమి మానవ స్వాతంత్ర్య భావము యెడల గౌరవము వల్లనైతేనేమి మానవుని మానవుడు తన స్వంత లాభం కొరకు కొనుక్కోవడం అమ్ముకోవడం ఒక శాసనబద్ధ నేరముగా పరిగణించబడినది. దానికి శ్వాస్తి కూడా చెప్పబడినది. కాని దక్షిణాఫ్రికా మొదలైన దేశములలో నిన్నటి వరకు అమలులో నుండిన ఇండెంచరుడు లేబరు పద్ధతి తత్పూర్వపు బానిసీడు పద్ధతికి అట్టే వ్యతిరేకము కానిదనీ,ఎన్నో దీన సంఘముల తరపున మహాత్మాగాంధీ వంటి మహనీయులు పోరాడిన సమరముల వల్ల అది కూడా మాయమైనదని, మనము భావించవచ్చును.

అయినా, పూర్వపు శాసనాలే మారినవి కాని అచ్చటి కార్మిక వర్గముల కష్టములు గట్టెక్కలేదు. ఆ దేశాలలో ఇంకా శ్వేత జాతులు కొక శాసనం, నల్ల నీగ్రో మొదలగు జాతుల కొక శాసనం అమలు జరుగుచునేయున్నది. శ్వేతా శ్వేత జాతులు కలిసి మెలగరాదు. పెళ్ళిళ్ళు చేసుకోరాదు. రైళ్ళలో, స్టీమర్లలో, బస్సులలో, వారికి వేరు వేరు కంపార్టుమెంటులు. వారి పేటలు వేరు, వీరి పేటలు వేరు, వీరికి చదువు సంధ్యలు, ఆటపాటలు, నోటు హక్కులు, పెద్ద ఉద్యోగములు, వాణిజ్య వ్యాపారాది సౌకర్యములు కూడదు.

ఇట్టి దురాచారములు అమెరికాలోనే ఇంకా అమలు జరుగుచున్నవంటే, తక్కిన వలస దేశాల మాట వేరే చెప్పనేల? వీని నణగద్రొక్కుటకు ట్రూమన్ కంకణం కట్టుకొన్నాడంటే, మనము ప్రపంచ సభ్యతా స్థాయిలో ఒక మెట్టు పై కెగురగలిగామని సంతోషింపవచ్చును.

ఈ విధముగా మానవదాస్యము అంతరించుననియే తలతుము. కాని అధునాతన వ్యాపార, ధనారాధనా తత్వజన్యమగు ఈ దాస్యమునకు మూలకారణమైన ప్రధాన దాస్యము దెసకే మన మిప్పుడు మన దృష్టి మరల్చవలసి యున్నది. ఈ విధమైన దాస్యము తలయెత్తుటకు కారణము. వివిధ పాశ్చాత్య దేశములలోని ధనారాధనా ధనదాస్యతత్వమే మూల కారణమని మనము పైని చూచితిమి. వారు ధనదాస్యమును ముందు ముందుగా తొలగించుకోనిదే మానవజాతిని ఈ నిజమైన దాస్యము నుంచి విముక్తుల చేయజాలరు. వారు చేసే పరోపకార, మానవధర్మ సూత్ర ప్రసంగాలన్నీ వట్టి పొల్లులే కాని ఈషణ్మాత్రో ఫలము నైనను నీయజాలవు.

నేటి ప్రపంచరాజ్యములును తన్నాయకులును డిమోక్రసీలు, శాసనసభలు, చర్చలు తీర్మానములు, వోటులు మొదలగు యెన్ని ఆడంబరములు పైపైకి చేస్తున్నా ఈ ధనదాస్యము నుండి విముక్తుల మవుదామనే సత్సంకల్పము వారిలో లవలేశమును లేదు. ప్రతి నాగరిక దేశమును నేడు తనసేనలను పెంచుచున్నదంటే, ఆటంబాంబులను సృష్టించు చున్నదంటే, ప్రపంచ సౌఖ్యార్థము కాని వాణిజ్య పంటల సరకుల ఉత్పత్తి నెక్కువ చేయుచున్నదంటే, జనావశ్యక కార్యములను విసర్జించుచున్నదంటే, వలస రాజ్యములను విడువనొల్లక స్వారీ చేయగోరుచున్నదంటే, తమ మీదికి మాత్రము దురాక్రమణలు రాకుండా కట్టుదిట్టములు చేసుకుంటూ, ఇతరుల హక్కుపైని దురాక్రమణలకు సంకోచింపకున్నదంటే, దీని కంతకును కారణ మా మహనీయుల ధనదాస్య వివర్ధనాభిలాషయే కాని దానిని త్యజింపగోరు సుహృద్భావము కాదు.

నేడు ధనదాసుడు కాని వ్యక్తియే భూలోకములో లేడా అనిపించుచున్నది. సాధారణ కార్మికుడు మొదలు కోటీశ్వరుడు వరకు సర్వులును యథాశక్తి ధనదాస్య పరాయణత్వముతో వర్తిస్తున్నారు. అదృష్టవంతులు పెద్ద గొప్ప ధనదాసులగుచున్నారు. అదృష్టహీనులు చిన్న అంతస్థులలో కొట్టుకొంటూ ఈడుపోత పడుచున్నారు. కాని పోటీ చక్రములో వీరందరు సమానముగా కొట్టుకుంటున్నవారే.

అయినా దిగువ అంతస్థుల వారిని మనమంతగా నిందించిన లాభము లేదు. బలవంతులతో బలహీనులు సహాయ నిరాకరణం చేస్తే బలవంతుల

బలముడుగుతుందను గాంధీ సూత్రం కూడా యిక్కడ సరిపడదు. మొట్టమొదటలో అట్టి సుదృఢ సంకల్ప ముదయించినట్లు కనపడునే కాని ఉదయించదు. ఉదయించినా సాగదు.

ఇది మానవ సంఘ శరీరానికంతటికీ పట్టుకొన్న దీర్ఘ వ్యాధి. దీనికి తరుణౌషధము తప్ప సామాన్యపు మందులు చాలవు.

పూర్వం ఏ సంస్కరణమైనా ప్రజలలో ఉదయించి ప్రభువులకు నచ్చి శాసన రూపముయేది. నేడు ప్రభువులకే ఈ సంకటం పట్టుకొని ప్రజలలోకి వ్యాపించింది. గనుక ప్రభుత్వములనే ముందు ముందుగా యీ సంకటము నుంచి విముక్తము చేయాలి. దానిని సాధించగలవారు నేటి నాగరికతలో నవసి కుళ్లుచున్న జనులును జన నాయకులును కారు. ఉత్తమ సంకల్ప ప్రదీపితులగు నేతలే. రష్యాలో లెనిన్ కొంతవరకు ఆ సంకల్పము సాధించినాడు. కాని కమ్యూనిజము ఇంకా ప్రయత్న మార్గము లోనే వున్నది. దాని సత్సంకల్పమునకే కళంకమును కలిగించుటకై పాశ్చాత్య డిమోక్రసీలు కుతంత్రములు పన్నుచున్నవి. ప్రచారక సంస్థలన్నియు వారి చెప్పుచేతలలో వుండి వారినే బలపరచుచున్నవి.

ఈ సమయములలో ఐక్యరాజ్య సమితి ఉదయించినది. కాని అది సార్థక సంకల్పయగుట దుస్తరము. అదినిజముగా సఫలము గావలెనంటే, వలస రాజ్యములు గల దేశములను మున్ముందుగా సభ్యత్వము నుంచి బహిష్కరించవలెను. బ్రిటను ఫ్రాన్సు హలండు పోర్చుగలు మొట్ట మొదట తమ వలస ప్రాంతముల నుంచి తొలగవలెను.

ఏదేశాని కాదేశం సంపూర్ణంగా ఆ రీతిని స్వతంత్రమైన తరువాత, సభ్యదేశాలన్నీ ముందు ముందు ఆర్థిక సంస్కరణకు పూనుకునేటట్టు ఆ దేశము పంపవలెను. ప్రస్తుతం వివిధ దేశాలను పాలిస్తున్నవారు నిష్కళంక దేశాభిమానులు కారు. ధనవ్యామోహ పీడితులగు వారి దాసులు. ధనాఢ్యులు పన్ను చెల్లించకపోతే ప్రభుత్వములు నడువవు గనుక వారి కూడిగము చేయవలెననే దుర్నీతి నేటి ప్రపంచదేశముల నావరించి యున్నది. కనుక, డెమోక్రసీ గిమోక్రసీ అనే కుటిల తంత్రములు ప్రతి దేశమును కట్టిపెట్టి, నిస్వార్థ ప్రబల ప్రభుత్వము లేర్పడవలెను.

నేడు ప్రపంచపు బ్యాంకులలో వున్నది ధనమే కాదు. వెండి బంగారులన్నీ యే స్వల్పమాత్రదేశములలోనో పేరు కొన్నవి. అవి కదలవు.కదలి వచ్చినా వాటికి పరువు ప్రతిష్టలు లేవు. అవి కదలకుండానే నేటి వ్యాపార మంతా ఏదోకుతంత్రాల మీద నడుస్తున్నది. సుతంత్రాల మీద కూడా అట్లే నడుపగలదు. ఇన్ఫ్లేషను రూపకమైన, ఈ ధనం నశిస్తే ఈ దురాశ, అవినీతి యే నశించును. కాని వ్యాపారము స్తంభింపదు. ధనాఢ్యుల నణిచి వేయగల దృఢ పాలనము మాత్రమే యీ పనిని సాధించ గలదు.

అట్టి దృఢపాలనముల నేర్పరుచుట ఇప్పుడు కష్టము కాదు. కోటికి పడగలెత్తిన హైదరాబాదు నవాబంతటి వానిని భారత మిలిటరీ ప్రభుత్వము నిమిషములో నామమాత్రావశిష్టుని చేసినది. అంత మాత్రాన రాజ్యం నశించలేదు సరే గదా, ప్రజలు సుఖిస్తున్నారు. అట్లే భారతప్రభుత్వం ఈ దేశపు బ్యాంకులపై దాడిచేసి ఉబ్బసమును అణచినచో ఆకాశం నేలమీద పడిపోదు. వ్యాపారమే సవ్యమార్గమున నడచి, ధనము సమవిభజనమై ధరలు తగ్గి, కరువు కాటకములు తగ్గి, శాంతి సంతోషములు వర్ధిల్లును.

ఐక్యరాజ్యసమితిలో ఇట్టి భారతదేశ మొక్కటి సభ్యయై యున్నను తక్కిన దేశములనేక మార్గదర్శియై ప్రపంచ శాంతికి సరియైన రాచబాట నేర్పాటు చేయగలదు. నెహ్రూ పటేళ్ళు సైనిక బలము నుపయోగించి యైనా ఈ దేశము నీ రీతిగా దిద్ది సార్థక జన్ములు కాగలరా? చూడవలసి యున్నది.

వారీ ప్రధాన కార్యక్రమములను మాని, కామనువెల్తులో చేరడమా, మానడమా, ప్రజాశయమగు భాషాప్రయుక్త రాష్ట్ర నిర్మాణ మిప్పుడా, ఇంకొ కప్పుడా,సంస్థానాలను తమ కనుకూల మగునట్లా లేక ప్రజారంజక మగునట్లా భారతయూనియనులో లీనం చెయ్యడం, నిష్కళంక దేశాభిమానులను దండి చండేమా, క్యాపిటలిస్టుల బలపరచడమా, కార్మికులను అణగద్రొక్కడం మొదలైన క్షుద్ర సమస్యలపై తమ దృష్టిని కేంద్రీకరించినచో, భారతప్రభుత్వ చరిత్ర మరింత అధ్వాన్నమై సంస్కరణము మానవాతీతమై వారికి వచ్చిన పేరు ప్రతిష్టలే పేపర్లలో నిలుచును గాని దేశస్థితి అగమ్యగోచరమై స్వతంత్ర భారత స్వప్నము క్షణములో కరిగిపోవును.

*ఢంకా, 1948 నవంబరు*

## [illegible]

[illegible] ప్రయోజనము, గాలి [illegible] మొదలైన పదార్థాలను ప్రకృతి ప్రసాదిస్తుంది. కనుక వాటి [illegible] యెవరెంత ఉపయోగించుకున్నా ఫరవాలేదు. కాని మానవ కృషి వల్ల ఉత్పత్తి అయ్యే పదార్థాలను ఒక విధమైన రేషను ప్రకారం జనులు పంచుకోవాలి.

అందరూ మాంసాలు తింటామంటే జంతుకోటి భరింపజాలదు. అందరూ ధాన్యాదులను తప్ప మరి దేనినీ తినమంటే భూదేవి యీనజాలదేమో కూడా. అందరూ చీరలు షరాయిలూ ధరిస్తామంటే నేతపని వారు కుట్టుపని వారు తట్టుకోలేకపోవచ్చు. తిండి తిప్పలలోను కట్టుబొట్టులలోను చదువు సంధ్యలలోను ఒక విధమైన యూనిఫారమిటీ ఉండవలసిన అవసరం లేదు. దేశకాల పాత్రములను బట్టి సంఘాల వ్యక్తుల అవసర సౌకర్యములను బట్టి వారి వారి అవసరాలు వేరు వేరు రీతులుగా తీరడానికి వివిధావకాశమున్నవి. మన పూర్వులు వానినట్లు ఉపయోగించేవారు. ఎక్కువ ఉన్న వాళ్ళను చూచి తక్కువ వాళ్ళు ఈర్ష్య పొందడానికి గాని, తక్కువ ఉన్నవాళ్ళని యెక్కువ వాళ్లు నిరసించడానికి కారణాలు లేకుండేవి.

ఆ యెచ్చు తగ్గులు ఒకరిని చూచి యింకొకరు విర్రవీగడం దోచుకోవడం, నిరసించడం కోసం కాక సంఘౌన్నత్య గౌరవాలను రక్షించే లోక సంగ్రహార్థం కొరకనే భావంతోనే పాటింపబడి గౌరవింపబడేవి. మాటికీ చీటికీ చిలిపి జట్టీలు పెట్టుకోవాలంటే యెటువంటి ఉత్తమ సంస్థలోనైనా వానిని లేవదీయవచ్చును. సమరస సద్భావాలతో నర్తిస్తే యెటువంటి ఆచారములయందును కూడా ద్వేషమును పాటించడానికెట్టి కారణము ఉండదు.

బహు కాలం వరకు మానవ సంఘంలో ఈ సమరస సద్భావాలు పాటింపబడుచుండుట చేతనే గత పౌరాణిక చారిత్రక యుగములా రీతి అభ్యున్నతితో నైన సాగినవి కాని, చదువు కున్న వానిని చూచి చదువురానివాడు, డబ్బున్నవానిని చూచి డబ్బులేనివాడు బలవంతుని చూచి బలహీనులు, సస్యశ్యామల దేశాన్ని చూచి ఊసర క్షేత్రాల ప్రజలు ఈర్ష్య

పెట్టుకొని కొట్లాడుకొనేలాగుంటే మానవజాతి యేనాడో అంతర్థాన మయ్యేది.ఆ రీతి సమరసమైనా ఆనాటి ప్రజలలో అలరారే దంటే దానికి కారణము ఆ ప్రజలు కేవలమైహిక భోగా యత్తులు కాక ఇతర రకములగు పెక్కు ఆసక్తులతో హత్తుకొని యుండుటయే.

అప్పు డెవడేవృత్తి చేసినా అది తన ధర్మము లేక కులధర్మమని భావించుకొనే వాడుగాని, దానివల్ల తాను శ్రీమంతుడను కాగలనా లేనా యన్న ప్రశ్నను వేసుకొనేవాడు కాదు. అందువల్ల కొన్ని వృత్తుల వారికి (కోమట్లు మొదలగువారికి) ధనము ఎక్కువగా లభించినా తక్కిన వృత్తులవారు ధనాశా పరాయణులై తమ వృత్తులను వదలేవారు కారు. ఏ వృత్తి లేక పోయినా తక్కిన వృత్తులన్నిటివారి పనికూడా ఉత్తుత్తియే అగునని గుర్తించి, పై వాళ్ళు క్రింది వాళ్లను ఆదరించడం మానకుండుటే గాక, గౌరవంగా కూడా చూసేవారు. అందువల్ల అందరూ తమతమ వృత్తులను సగర్వంగా ఆచరిస్తూ ఇతరులను చూచి ఈర్ష్యలు పొందక తమ వృత్తివల్ల కలిగే ఫలాలను ఇతర వృత్తులవారు యథేచ్ఛగా అనుభవించడానికి ఇతర వృత్తుల వల్ల కలిగే ఫలాలకు తాము కూడా భాగస్వాములవడానికి సన్నాహులయ్యేవారు. ప్రపంచాభ్యుదయమునకు అట్టి సమరస భావమే ప్రశస్త సాధన కాని అన్ని వర్ణాలూ వర్గాల వారు ధన మనే మాయ లేడిని వేటాడడం కోసం ఒకరితో నొకరు పోటీపడి ఒకరినొకరు మ్రింగడమనే నేటి ఆధునిక ఆర్థిక పద్ధతి యే మాత్రమున్ను సబబైనది కాదు. పదిమందికి ప్రయోజనము కలిగించేదే అర్థం కాని జనులలో పోటీలు పెట్టి యుద్ధాలు చేయించి రక్తవాహినులను పారించే క్షుద్రధనము, క్షుద్రవాణిజ్యం, క్షుద్ర దురాశ అర్థశబ్దమునకు అర్థములు కావు.

నేటి అర్థశాస్త్ర గ్రంథాలన్నీ ఒక ప్రధాన సూత్రమును ఆధారం చేసుకొని ఆ పునాదుల మీద తమ సిద్ధాంతాలన్నిటినీ నిర్మించుకోవాలి. ప్రయోజనమనగా ఏ యొక్కని, యే పదిమంది, ఏ సంఘముయొక్క ప్రత్యేక ప్రయోజనము కాదనీ, బహు సంఖ్యాకుల కత్యంతామోదకరమగు నదియే నిజమైన ప్రయోజనమనీ గ్రహించాలి.

ఆధునిక అర్థశాస్త్రాలు పాశ్చాత్య దేశాలలో క్రొత్తగా ఉదయించిన

రోజులలో అర్థం యొక్క పై విశిష్టార్థం అడుగంటినది. అర్థమనగా మానవుల ప్రయోజనా ప్రయోజనములతో సంబంధం లేని వెండి, బంగారు మొదలగు లోహములు నాణెములను అర్థము స్థిర పడినది. ఎవరేపనిని చేసినా దానివల్ల లోకమునకు కలిగే శుభ పరంపరలమీది దృష్టి క్షీణించి తన కెంత యెక్కువ డబ్బు లభించునను పెద్ద చింత తగులుకున్నది.

నాటినుంచి ప్రపంచములో మానవ ప్రవృత్తినుండి వృత్తులు అంతర్థాన మైనవని చెప్పవచ్చును. పూంజీదారు లాభం కోసం, కర్షక కార్మికులు కూలీకోసం, ఉద్యోగస్థులు జీతాల కోసం, రాజులు పన్నుల కోసం, పనిచేస్తున్న వారే కాని ప్రజాహితం లోకక్షేమం అను మాటలు కేవలం మొగము తుడుపు మాటలే.

ప్రజాహితం, లోకక్షేమం, స్వధర్మం మొదలైన ఆశయాలతో కాకుండా కూలీకోసం, జీతం కోసం, లాభం కోసం యేదో ఒక రూపంగా వచ్చే డబ్బుకోసమే పనిచేస్తున్నామని జనులు భావించుట మొదలుపెట్టి రేని వారందరూ నీతి నియమములను గుంట పెట్టి గంట వాయించిరనియే చెప్పవలెను.

ఈ గంటవాయించడం పాశ్చాత్య దేశాలలో నాలుగైదువందల సంవత్సరాల క్రిందటప్రారంభమై బ్రిటిషువాని చాతుర్యం వల్ల ఒక కళగా పరిణమించింది. ఆ కళా ఫలితాలు కేవలం వారిలో మాత్రమే కేంద్రీకృతాలు కాక ఇతరదేశాలు కూడా సామ్రాజ్యాలు అవడానికి ఆధారభూతము లైనవి. ఈ సామ్రాజ్యదేశాలకు తమలో తమ కెన్ని ద్వేషాలున్నను ఇతరుల దోచడంలో అవన్నీ కలిసి కట్టుగానే పనిచేయును. ఇండోనేషియాలో డచ్చి చర్యను బ్రిటను, ఫ్రాన్సు మొదలైన దేశాలు సమర్థించడం చూస్తే ఈ విషయం విశదంకాగలదు.

ఈ ధనతత్వం కేవల సామ్రాజ్య దేశాలకే వుంటుంది. పాలితదేశ ప్రజలకు ఉండదు అని మనము భావించరాదు. సామ్రాజ్యదేశాల వాసన తగిలిన అన్ని దేశాలకూ, ముఖ్యముగా వాని పాలనకు లోనైన వలస దేశాలకూ ఆ దుర్గుణ మవలీలగా అంటుకుంటుంది. అందువల్లనే అవి

అతిసులభముగ సామ్రాజ్య దేశాలకు వలస దేశములగును. అక్కడి విద్యాధికులును ప్రజలును దేశాభిమానము మొదలగు విషయములను గురించి ఉపన్యాసాలు కురిపించినా, వారి మనస్సుల నాందోళన పరచునది. దేశ స్వాతంత్ర్య సమస్యను మించి తాము ధనాఢ్యుల మెట్లగుట యనియే. అందుకే ఈ దేశాభిమానం తెరమరుగున వారి పదవీపారాయణ తాండవం, బ్లాక్ మార్కెట్ సేవా భోగం, కపట ప్రజాపరిపాలనా సిద్ధాంత విన్యాసం, ఉపన్యాస తరంగిణీపై నర్తనం మొదలైన రంకులన్నీ గౌరవ నామధేయములతో సాగుచుండును.

ఈ కళలలో ఆరితేరిన వారికే కీర్తి ఉద్యోగం ధనము లభించునుగనుక, జనులు ఇతర వృత్తిని దేనిని చేసినా ఈ మహాకళలో ఉప కళాభాగముగా మాత్రమే దానిని స్వీకరించి స్వైరవిహార ధీరులగుచుందురు.

ఏ మాత్రము సచ్చింతన, సదాశయము, సన్మార్గ ప్రవృత్తి కలవాని కయినను ఈ రొంపి నంతటినీ చూస్తే గుండె లవిసిపోవును. కనుక నిజమైన యోగ్యులెవరైనా యెక్కడైనా వుంటే ఈ మంత్రులు, నాయకులు, శాసన సభ్యులు, వణిగ్పుంగవులు, జడ్జీలు, లాయర్లు మొదలగువారు విహరించే మార్కెట్టు వీధిలో గాక ఎక్కడో గుట్టుగా వుంటారేమో!

అట్టివారి నుదుట ప్రజాదృష్టిలో తాండవ మాడగల గీతలేదు. ప్రపంచమున కొక ఆధ్యాత్మిక మహాసంస్కారము ప్రాప్తించగల కాలములో మాత్రమే అట్టివారు ఒకరైనా కలరని సజ్జనులకు తెలియగలదు- వారు రంగములోనికి రాగలగడమే కష్టం. వారే నిజమైన విప్లవవాదులు. తక్కిన క్రాంతి విప్లవ అభ్యుదయాది నామధారులందరూ ఈ మహాకపట నాటకములో భాగములును భాగస్వామ్యార్థ భైక్షకులును మాత్రమే.

అట్టివారు రంగములోనికి వచ్చిరా? వీరందరి పని కరక్కాయే కనుక వారెచ్చటెచ్చట అణగిమణగి యున్నా గాలించి వారి మీద దుష్ప్రచారములు చేసి పరువు తీసి పరపతిని చెడగొట్టి తలయెత్త నీయనట్టు "కామన్ ఫ్రంటు"ను ప్రదర్శించడం పై వర్గాలవారందరికీ యేకైక సమానాశయం. దేశములో ఎవ్వరెవ్వరి స్వార్థ పరాయణాభిలాషకును వారి ఆశయములు

గొడ్డలిపెట్టులు కనుక అట్టి విశాలతత్వ వాసనలను రూపుమాపుటే పై వర్గాలందరియొక్క సమానాశయం. వారి ధర్మమంటూ జన సామాన్యంలో కూడా దేశాభిమానము మొదలగు ఉత్తమాశయముల యందు కంటె స్వార్థపరాయణత్వమున కగ్రతరస్థానం లభించినది. కనుక వారి మాటలు పథ్యములైనట్లు ఇతర విశాలాశయుల మాటలు పథ్యములు కావు.

ఈరకం మూకల గూడుపుఠాణీల ద్వారానే నేటి నాయకులు పైకి తేలుతూ వివిధస్వార్థ సాధకమైన ఈ ప్రజా పరిపాలనా తంత్రమును "జయప్రదముగా" సాగించుకొని పోవుచున్నారు. కాని ఈ గూడుపుఠాణీ లన్నిటికి కీలక పరిశ్రమ ధనాశా పరాయణత్వమే కనుక దానిలో ధర్మవాసన లేశమైనా లేదు కనుక నేటి సంఘమయినా లోలోన నగ్నిచే కుములుచున్న అగ్ని పర్వతముతో తుల్యమైయున్నది.

అది ప్రేలనే ప్రేలకూడదు. కాని ప్రేలెనా యెన్నో దుష్ట సంస్థలతో పాటు, వాటికంటే ముందుగా కూడానేమో, అనేక సత్సంస్థలు కూడా దగ్ధమగును. కాని ఆ పరిస్థితి తప్పని సరియగు నేమో అని భయమగుచున్నది. అది తప్పుట కొక్క మార్గమున్నది. కాయా, మనసా వాచా జనులందరూ డబ్బుకోసం కాక ధర్మం కోసం పంటలు పండిచించుచున్నామనీ, ఉద్యోగాలు చేస్తున్నామనీ, తీర్పులు చెపుతున్నామని, పాఠాలు బోధిస్తున్నామని, చదువులు చదువుతున్నామని దివ్యస్వప్నములు కంటూ తదనుకూలముగా వర్తించడం నేర్చుకోవాలి. ఇప్పటి స్థితిలో ఈ తత్వం, మానవలోకం మాట అటుంచి, భారతీయ విద్వల్లోక మనబడే వారికైనా తలకెక్కడం కష్టం.

డబ్బుమీద శ్రద్ధ తగ్గించి లోకహితంమీద దృష్టి నిగిడించమంటే, బిర్లా కెంతకోపమో, ఫ్యాక్టరీ కార్మికునకు అంతకంటే యెక్కువ కోపం, హైకోర్టు జడ్జికి జిల్లా కలెక్టరుకు యెంత కోపమో తపాలా బంట్రోతుకు అంతే కోపం. జవహర్లాలు కెంత కోపమో రాజాజీ, పటేలు, మత్తయి, అజాద్‌లకు కూడా అంతే కోపం.

డబ్బాస లేకుంటే మానవ ప్రకృతి చిన్న మెత్తు పని చేయదను

పాశ్చాత్యార్థిక శాస్త్ర మూలాధారసూత్రం వీరందరికి వేద వాక్యతుల్యం. ప్రపంచంలో లేచిన చిత్రకళలు ఉత్తమ సంస్థలు అపూర్వ సామ్రాజ్యాలు అన్నీ ధనాశ లేనందువల్ల పుట్టినవనీ, ధనాశా విజృంభణంవల్ల నీల్గినవనీ వీరు మరచుచున్నారు.

ధనాశ లేకుంటే కర్షకుడు నాగలి చేతపట్టని, కార్మికుడు సుత్తిముట్టని, గుమాస్తా కలముపట్టని శిల్పికి కుంచె కిట్టని, గాయకునకు రాగముతట్టని, దేశికున కాసక్తి పుట్టని దుర్దశ దేశమునకు సంభవించినదంటే, కేంద్రకోణములలో ఎక్కడో ఒక కీటక మున్నదనియే అర్థము. డెన్మార్క్ రాజ్యంలో ఏదో కుళ్లు వస్తువు ఉండబట్టే, అది పైకి అంత పటాటోపంగా కనిపించుతున్నా తక్షణ చికిత్సా ప్రాత్రమనుటకు సాక్ష్యమగుచున్నది. జనులను, వర్తకులను, కర్షకులను, కార్మికులను, ఉద్యోగులను క్షుద్రతమ ధనాశా భావముతో కాక దేశాభ్యుదయ మనే ఉత్తమ నంకల్పసిద్ధి కోసమే ఉత్సాహంతో పనిచేయించే ఉపజ్ఞను పురిగొల్పజాలని రాజ్యాంగ విధానము సుప్రశస్తము కాదనుట నిక్కము.

*— ధంకా, ఫిబ్రవరి, 1949*

# "ధర్మమేవ జయతే"

చట్టాలెక్కువవుతున్నకొద్దీ నేరాలు రేఖాగణిత నిష్పత్తిసూత్రం ప్రకారం వృద్ధి అవుతున్నవి. కోర్టులు జడ్జీలు యెక్కువవుతున్న కొద్దీ ఆ సూత్రాల వ్యాఖ్యానాలు దురవగాహములగుచున్నవి. ఆ విధంగా న్యాయధర్మముల పరాకాష్ఠ నానాటికి క్షీణించుచున్నది. నేటి నాగరకతా లోకములో జరుగుచున్నన్ని సివిల్ క్రిమినల్ నేరాలు గత శిలాయుగములలో యెన్నడైనా జరిగియుండలేదని రూఢిగా చెప్పవచ్చును. మానవునికి ఐహిక విషయ లాలస జ్ఞానము హెచ్చు చున్న కొద్దీ నేరాలు చేయడంలో పాండిత్యము చమత్కృతి పెరుగుచున్నవి. అట్లే జడ్జీలు వకీళ్ళు మేజిస్ట్రేటులు పోలీసులు పెరుగుచున్న కొద్దీ విచారణల తీర్పుల పటాటోపములు పెరుగుచున్నవి. ముఖ్యముగా వకీళ్ల సంఖ్య పెరుగుచున్నకొద్దీ న్యాయాన్ని మాటు పుచ్చడానికి అన్యాయమును గెలిపించడానికి అవకాశాలు ఎక్కువగుచున్నవి.

బ్రిటిషువారు ఇండియాలో కోర్టులు పెట్టకముందు నేరాలు జరుగలేదా, అంటే, జరుగలేదని చెప్పజాలము, ఇప్పటి కంటె చాలా తక్కువగా జరుగుచుండెననుట నిస్సంశయము, జరిగిన నేరాలను గ్రామాలలోని నగరాల లోని పెద్దలు యెల్లాగో ఒకలాగ ఫైసలు చేసి యిప్పటి కంటె న్యాయమైన ధర్మం ప్రకారం పరిష్కరించేవారు, కేసులు వేగం పరిష్కారమయ్యేవి. విచారణకు దూరప్రదేశాలకు ఉభయ పార్టీలూ సాక్షులతో పరుగెత్తడం, వాయిదాలు వేయించు కుంటూ వుండడం జరిగేది కాదు.

నేటి కోర్టుల జడ్జీలు కాని వకీళ్లు కాని తమ వద్దకు వచ్చే పార్టీలతో పూర్వానుభవం లేనివారే, వారి సాక్షులతో అసలే పరిచయం లేనివారు. అందువల్ల వకీళ్ళ వద్దకు పార్టీలు కేసులు తీసుకొని వెళ్లడం, తమ వద్దకు వెళ్ళిన కేసులను తమ పార్టీలు విజయమున కనుకూలమగునట్లు వకీళ్ళు కేసులు నిర్మించి ప్లెయింటు సమాధానాలు జడ్జీల వద్ద దాఖలు చేయడం, వారి వారి పార్టీల సాక్షుల నందు కనుకూల మగురీతిని సాక్ష్యములెట్లు చెప్పడమో పాఠాలు నేర్పడం, జడ్జీల వద్ద ఈ పాఠాలనొప్ప చెప్పించడం, ఆ జడ్జీలు తమ బుద్ధిని ప్రయోగించి యే పార్టీ వాదం నిజమైనట్లు

అనుమానం కలిగితే వారి కనుకూలంగా తీర్పులుచెప్పడం, ఇట్టి తీర్పులు తరువాత కేసుల తీర్పులకు వరవడులు కావడం–ఇవీ ప్రస్తుత న్యాయస్థాన విచారణల చర్యల వరుస.

ఈ మహా సంరంభంలో సత్యం గెలవడాని కెట్టి అవకాశాలూ లేవు. ఏ వకీలు బుద్ధిమంతుడైతే అతడు ఎంత అవకతవక కేసునైనా బహు చక్కగా సత్యమైనట్లు తయారు చేసి సాక్ష్యాలద్వారా బలపరచి జడ్జీని కనుభ్రామి కేసు గెలిపించవచ్చును. చేతకాని సత్యసంధ వకీలు చేతిలో పెడితే యెంత న్యాయమైన కేసైనా ఓడిపోవక తప్పదు, ఈ విధంగా బుద్ధిమంతులైన వకీళ్లు త్వరలో శ్రీమంతువలడానికి బుద్ధిహీనులావృత్తిలో చచ్చేదాకా ఈడ్చుకుంటూ ఉండడానికీ దారి యేర్పడినది.

కేసు గెల్చినా ఓడినా ఉభయ పార్టీలకు ఖర్చుల క్రింద పిత్రార్జితపు పిసరూపిప్పి ఊడిపోయి ఫకీర్లవడం తప్పదు. ధర్మానికి సాక్ష్యం చెప్పే దాత లీకాలంలో యెక్కడాలేరు. ధర్మంగా సాక్ష్యం చెప్పే సాధువులను సత్కరించే పార్టీలంత కంటె లేవు. ఎంత పెద్ద అబద్ధసాక్ష్యం చెప్పాలంటే అంత పెద్ద ఫీజు ఇచ్చుకోవలసిందే. ఇటువంటి యుగంలో కష్టపడి పనిచేస్తేను, కవిత్వం, చెపితేను, చిత్రం వ్రాస్తేను, హరికథ చెపితేను వచ్చే ఆదాయం అత్యల్పం. సులభంగా అబద్ధ సాక్ష్యం చెపితే వచ్చే ఆదాయం అత్యధికం అయింది.

ధర్మచింతన తగ్గి ధనచింతన హెచ్చుతున్న ఈ దినములలో సాక్షివాదము నేకైకవృత్తిగా పెట్టుకున్న కొన్ని వర్గాలు యేర్పడినవి. మామూలు మనుష్యులయితే బోనులో నిలబడి మాట్లాడేటప్పుడు అవతల పార్టీవారు అడ్డు ప్రశ్నలు వేస్తే నిజం చెప్పియో అబద్ధం చెప్పియో బోల్తా కొట్టేస్తారు. కాని సాక్ష్యవాద ప్రవీణులు చెక్కు చెదరక అన్ని అడ్డు ప్రశ్నలకును అడ్డు జవాబులు చెప్పుతూ యెక్కడా దొరకక, తమ పార్టీవాదమును గెలిపించ గలుగుతున్నారు. ఇట్టివారు ఎక్కువ ఫీజు అడుగుతున్నారంటే ఆశ్చర్యం కాదు.

ఈ విధంగా నేడే గ్రామము నగరమును చూచినా ఇట్టి అబద్ధం కేసుల నిర్మాణమునకు, అబద్ధ సాక్ష్యముల నిర్మాణమునకు పెద్ద ఫ్యాక్టరీలుగా

తయారయినవి. నానాటికి ధాన్యం పంట, బట్టల పంట, కుండలపంట, గిన్నెల పంట కంటే ఈ కేసుల పంట ఉత్పత్తి హెచ్చవుతున్నది.

ఏ వకీలును చూచినా, జడ్జిని చూచినా ఉపన్యాసకుని చూచినా అసత్యమును ఖండించి న్యాయమును నిలబెట్టాలని ప్రార్థించి ఉపన్యాసాలిచ్చే వారే కాని, ఈ నేరమునరిగట్టటానికి యెవరికినీ దమ్ముల్లేకున్నది. ఈ పంట తగ్గితే వీరికెవరికీ తినడానికి మెతుకులుండవు. త్రాగడానికి నీళ్ళుండవు. తిరగడానికి పరువుండదు. ఇవన్నీ ఇట్లు అమలు జరుగుతూ, వీటివల్ల వీరికి జీవనోపాధి దర్జాలు జరుగుతూ, ఖండనోపన్యాసాలిస్తూ వుంటేకాని లోకమరమ్మత్తుకు అవకాశం యేర్పడదు మరమ్మత్తులోకం కోసం కాక లోకమే మరమ్మత్తు కోసం అనే వృత్తి యేర్పడడం వల్లనే నేటి న్యాయస్థానాదులు, విద్యాసంస్థలు, ప్రభుత్వోద్యోగాలు, ప్రభుత్వ విధానాలు, సినిమాలు మొదలగు విలాస సౌకర్యాలు కూడా ఇటువంటి వక్రపథములను త్రొక్కుచున్నవి.

నేటి పిన్నలే రేపటి పెద్దలు, నేటి విద్యార్థులే రేపటి పౌరులు ఉద్యోగులు నాయకులు మొదలగువారు నేటి సంతతులే, రేపటి తరాలవారికి పితలు పితామహులు ప్రపితామహులు ఈ విధానాలవల్లనే మనము భవిష్యత్ శ్మశాన ప్రపంచమునకు పునాదులను వేయుట, ఆత్మవిమర్శన చేసుకొనుట కవకాశము కలిగించుకోవలదా? ఏ రోజు గొడవ ఆరోజు యెల్లాగో ఒకలాగా తీర్చుకోవడమే ప్రయోజనత్వంగా భావించి కుళ్ళి కుతమరుతూవుండడానికే మాతృగర్భములను ఛేదించి మన మీ లోకమున నవతరించినది! ఈ సమస్యల నెవరైనా తీవ్రంగా ఆలోచించుచున్నారా? ఆలోచిస్తే పరిష్కారం దొరకకపోవడం దుస్సాధ్యమగుచున్నదా? లేక అట్టి ఆలోచన కూడా కపటము గానే జరుగుచున్నదా?

ఇందులో ఎవరి నేమి అనడానికి వీలులేకున్నది. అందరూ పట్టభద్రులు, ఉన్నతోద్యోగులే. అందరూ ప్రధాన మంత్రులు ఉపప్రధానులే, కానివారు అట్లు రేపవుదామని యత్నిస్తున్నవారే. అందరూ వేదాంతపరులు, తత్వజ్ఞులు, ఉపన్యాసకులే. ఆచరణలకు, ఆలోచనలకు ఆలాపాలకూ ఎక్కడా మేనమామ మేనత్త సంతతుల పోలికలైనా లేకున్నవి.

అందరికీ తన్ను మాలిన ధర్మమేమిటనే యేకైక చింత పట్టుకొన్నది. లోక కళ్యాణం కంటే స్వీయ కళ్యాణం యెక్కువ ప్రధాన మనుభావము పొడుకొనివున్నది. ఎవరిని తప్పు పడదామన్నా ప్రతీవ్యక్తిలోనూ యేదో ఒక లొసుగు ఉంటునే వున్నది. లోకంలో కపట శాంతిని నిలబెట్టి ఈ కపట నాటకమును సాగించడం కోసమే నేటి సంస్థలన్నీ తోడుపడుచున్నవి క్రొత్తవి నిర్మించబడుచున్నవి.

కనుకనే నిర్గంధకుసుమాల కున్న గౌరవం సురభిళ పుష్పాలకు లేక పోతున్నది. సురభిళ పుష్పాలన్నీ యేయరణ్యములోనో ప్రతి ఉదయమునను పూచి ఆఘ్రాణించే దాతలు లేక సాయంకాలమునకు రాలిపోవుచున్నవి.

అధవా యీ లోకంలోకి వచ్చి కాస్త సువాసన విరజల్ల ప్రారంభించే టప్పటికి మామూలు నేరగాళ్ళలాగే బంధిఖానాలలో బంధిపబడుచున్నవి. ఇదంతా ప్రజారక్షక శాంతి పోషక ప్రభుత్వ చట్టాల విశాలాశ్లేషణల క్రింద జరుగుచున్న మహాతంతుగా పరిణమించుచున్నది. ఇదే ధర్మమై నేడు లోకమును ప్రభుత్వ విధానములను ధరించుచు భరించుచున్నది. ఇదికూడా కూలిపోతే ఈ మాత్రం ప్రపంచమైనా నిలువదను భయము ప్రతీ పెద్దను ఆవరించి యున్నది. ఇట్టి ప్రపంచం కూలిపోతే సృష్టికి వచ్చే ముప్పేమిటో యెవ్వరును చెప్పజాలకున్నారు.

అయినా సృష్టి మహా చిత్రమైనది. నిలబడుమని మనము కోరితే నిలిచేది కాదు, కూలమని శాసిస్తే కూలేది కాదు, ప్రకృతి దేవత మహాబలీయమైనది. దానికి జ్ఞానం లేదని, మానవుడెట్లు నలిపి పాడుచేస్తే అట్లల్లా లొంగుతూ దాసోహం చేస్తూ వుంటుందని విజ్ఞానులు భ్రమపడుచున్నారు. విజ్ఞానుల విజ్ఞానము కతీతమైన మహాప్రజ్ఞలు దానికున్నవి. ఇవతల మనము విజ్ఞాన డోలికలలో అంబరవీధిలో ఊగుతూ వుండగానే అది మనను అధఃపాతాళములోనికి త్రోయగలదు.

ఒక్కొక్క వేళావిశేషంలో ఈశ్వరుని సహితము మాయ గ్రమ్మి లోబరచుకొనగల మహాశక్తి ఈ ప్రకృతికి ఉన్నప్పటికి రేఖ మారినప్పుడది యీశ్వరుని శాసనమునకు లొంగి పాదాక్రాంతురాలు కావలసినదే.

ఈశ్వరుడు ప్రకృతివంటి మాయాచపలుడు కాడు. క్షణములో నిక్కి క్షణములో కూలెడి కించిజ్ఞవ్యక్తికాడు. నిరీక్షించి నిరీక్షించి తన ప్రజ్ఞాహస్తమునామె శిరస్సుపై నుంచి, అయితే నయాన సంస్కరించడం, లేకుంటే భయాన దహనం చెయ్యడం–రెండూ అతనికి సమాన విలాస కృత్యాలే.

నిజమైన జ్ఞానులు ఆహస్త స్పర్శాగమనమునకై నిరీక్షిస్తూ తపస్సు చేస్తూ వుంటారు. అజ్ఞానులీప్రకృతియే శాశ్వతమనుకొని మోహిస్తూ క్షణిక భోగాలతోను దర్పాలతోను విఱ్ఱవీగుతూ అధః పాతాళమున పడుతూ వుంటారు.

ఇదే భారతీయ మహా విజ్ఞాన సంస్కృతీ విశాల లక్షణము. ఇదంతా మెట్ట వేదాంతమనీ, మన భారతీయులిందువల్లనే భావదాసులై ప్రపంచ పురోగమనమున వెనుక పడిరనీ అజ్ఞానులాక్షేపించుతారు. జ్ఞానులీవిశ్వాసములో అచంచలురై ఈ మాయాదేవత చర్యలపై చిరుకన్ను వేసి మందహాసం చేస్తూ తమతమ సంకల్పములయందప్రమత్తులై వర్తిస్తూ వుంటారు.

"ధర్మమేవ జయతే" అను సూత్ర వాక్యమును మన ప్రభుత్వం వారు మకుటముగా ప్రతీచోటా చిత్రించబోతున్నారు. ఆ ధర్మం జయించేలోపల యెన్నో అధర్మములు నాశనము కావలసియున్నవి. అవన్నీపోగా మిగిలే పరమ ధర్మమునకు మనము నిరీక్షించుచు లోకమును సిద్ధము చేయ యత్నించు చుండడమే పరమ ధర్మము.

*– ఢంకా, ఆగస్టు, 1949*

# అనుబంధం
## (నూతన జాతీయ గీతములు – ముందుమాట)

*1926లో సీతానగరం గౌతమీ ముద్రణాలయంలో మద్దూరి అన్న పూర్ణయ్య గారిచే ముద్రింపబడి, గరిమెళ్ళ సత్యనారాయణ గారిచే ప్రకటింపబడిన "నూతన జాతీయ గీతములు" (ఒకటవ భాగం) ముందుమాట.*

## నివేదనము

ఈ పొత్తముతో మా శారదా గ్రంథమాల యొక్క నాలుగవ కుసుమమును మా చందాదారులు మొదలైన వారి కర్పించుచున్నాము. మా గ్రంథమాలలోని గ్రంథము లనేకములు ఒకటి అచ్చుపడి విక్రయమయేటప్పటికి వేరొకటి తొందరగా వ్రాసి అచ్చొత్తించి పాఠకుల చేతులలోఁ బెట్టెడి నవీన నాగరీక కాఫీ హొటలులలోని వేడి వేడి పెసరట్లవంటివి కావు. చిరకాలము క్రిందట వ్రాయబడి అచ్చుకాకముందే అనేక పాఠక విమర్శక శిఖామణుల చెవులకెక్కినుతులు గొని ముద్రణార్హములని యెన్నఁబడియు, ద్రవ్యాది సాధన లోపముల ఆలస్యముగ కాని ఆంధ్ర నేత్రముల నానందింపజేయజాలని పేదరత్నములు.

ఈ పాటల తాలూకు వరసలు కష్టములు కావు కాని నవీనములు. వీనిని నా ముఖతా యొకసారి వినినచో సులభ గ్రాహ్యము అగుటయే కాక ఆనందదాయకములని కూడ ఆంధ్రులు తలంపకపోరు. ఇదివరలో నాలుగేండ్ల క్రిందట నేను జాతీయగీతములు వ్రాయుటయు ప్రభుత్వము వారి కవి కంటకరొక్కసమయమగుటయు నాకు దీర్ఘకారాగార శిక్ష నొసంగుటయు ఆంధ్రులు మఱచియుండరు. నేను జయిలునుండి వచ్చినప్పటినుండియు ఆంధ్రులెల్లరు నన్ను జాతీయగీతములను పాడుమనుచుండుటయు, నా పూర్వపు పాటలు నిషిద్ధములగుటచే నేనవి పాడుటకు అనుకామియు దేశకాల పరిస్థితులు మారుటచే ఇప్పుడప్పటి పాటలు కాక క్రొత్త పద్ధతులతో క్రొత్త సందేశములతో పాటలు వ్రాయవలసి వచ్చుటయు నన్నీ గ్రంథమును ప్రచురించుటకుఁ బురికొల్పినవి.

ఇవి కూడా బహిష్కారాయుధమున కెఱయవకుండుటకు గానున్ను కలకాలమాంధ్రులు పాడుకొనఁగలుగుటకుఁ గానున్ను, ఇవి రాజద్రోహమును పురికొల్పినవి కాకుండునట్లును, దేశీయ స్థితి సంశోధకంబులుగ నుండునట్లును వ్రాయబడినవని వివేకవంతులెల్లరి కవగాహనమై యుండకపోదు.

నేను చందాదారులను చేర్చుటకు వెళ్ళు గ్రామముల యందును ప్రచారమునకు వెళ్ళు పురములయందును వీనిని పాడింపవలసిన వారికెల్ల వరుసలు చెప్పుచునే యున్నాను. తద్రీతిగా నీవరుసలు ఆంధ్రదేశమున ప్రచారము కావచ్చును. ఎవ్వడు కాని నాముఖతా వినఁ గోరిన యెడల మా కార్యస్థానమగు యా అగ్రహారము నుండి వారి యూరికగు కనీసము ప్రయాణము ఖర్చులను నాపేర మని ఆర్డరుగా పంపిరేని వారి యూరుకు వెళ్ళి వారి కోరికఁదీర్చఁగలుగుదును. మిక్కిలి వ్యయ ప్రయాసముల కోర్చియు తొందరగా అచ్చొత్తించి యా పుస్తకమును మా కర్పించిన గౌతమీ సత్యాగ్రహాశ్రమము వారికి కృతజ్ఞతా పూర్వక నమస్కారముల నర్పించుచు యింతకంటే వేగముగా మా చందాదారులకిది యర్పించలేకపోయినందుకు నన్ను క్షమింపుడని వారిని వేడుకొనుచున్నాను.

సీతానగరం
15.5.1926.

గరిమెళ్ళ సత్యనారాయణ
సంపాదకుడు.